శ్రీమత్పరదేవతాయై నమః.

# సుశీల

(కల్పితప్రబంధము)

తిరుపతివేంకటీయము



మొదటికూర్పు
1000 ప్రతులు.

1941

 [ వెల రు.



శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులవారు

# పీఠిక

ఈ "సుశీల" రచించుటకుఁ జాల వెనుకటి కాలమునుండియే నేను గృహములోఁదప్ప నితరత్ర సంచరించుటకు నోపిక లోపించి యుంటిని. ఆకారణమున సర్వదా శయనగృహమునందే కాలక్షేపము, తెలుగు పరుండియే కాలక్షేపమునకు యేదో గెలుకుట యలవాటైనది. ఆగెల్కుడు చాలవఱకుఁ బత్రికలలోఁ బ్రకటితమైన వ్యాసములపాలైనది. ఈస్థితికి వచ్చినపిమ్మట నిల్లు వదలి యెక్కడికిఁగాని వెళ్లు ధైర్యము లేదు. ఉత్సాహ మంతకు మునుపే లేదు. కాని యింటికి వచ్చి 'మీరు రాకతీర' దన్నచో మోమోటపడి యాయాచోట్ల జరుగు కొన్నిసభలకు వెళ్లుచునే యుంటిని. ఎందుకు వెళ్లితినో నాకుఁ దెలియదు. బంధుగృహములకుమాత్ర మెచ్చటికిని వెళ్లినట్టులేదు. చి॥ సౌ॥ వతి పెద్దమ్మాయిగా రింటికిమాత్రము వెళ్లుట తప్పినదికాదు. ఉత్కృష్టపరిహాసమున కదియే కారణము. దీనింబట్టి బంధుగు లంగఱను ఈయనకు ధనలాభము కనుపట్టనప్పుడు తప్పఁ బ్రయాణము సాఁగదని చెప్పికోఁ దొడఁగిరి. అందులోఁ గొంత సత్యములేకపోలేదు. ఏదో సభ యన్నప్పు డంతకుమున్ను లేనియోపిక గొంత చేకూరుటమాత్రము నా కనుభూతమే. ఆసభలలో ధనలాభ ముండినను లేకున్నను నట్టియోపిక కన్పట్టుటచే బంధుగు లనుకొను మాటలం నిలోఁ గొంతమాత్రమే సత్యమనుకొనవలసివచ్చినది. సౌభాగ్యకామేశ్వరి స్తవములో నీవిషయమును కొన్నిపద్యములలో నుటంకించితిని. ఇట్లు స్పృశించి విడిచితిని. నే నెన్నఁడుఁగాని సోమరిగ నుండను. సోమరియై యుండుట నాకుఁ జాల నసహ్యతకుండును. ప్రస్తుతము సోమరిగాఁ వయార్ద పరుండియే యేదియో కాలక్షేపార్థము గెల్కుచుందును. ఇది యెవరిని రంజించునో నాకుఁ దెలియదు. అట్టిరచనలలో నీ 'సుశీల' యొకటి, ఈమాట

గ్రంథాంతమున వ్రాసియే యున్నను నిట [illegible] చితిని. "మాఘే మేఘే గతం వయః" [illegible] భవతు. ఇందులో నొకచోట—"[illegible]"—అను [illegible] త్రించి ప్రయోగించితిని. దానికి [illegible] కలదు. ఇది తప్ప నే నీపొత్తమున బుద్ధిపూర్వకముగాఁ జేసిన [illegible] ప్రయోగ ములు లేవు. ఎఱుఁగక చేసిన [illegible] లుండవచ్చును. [illegible] లకు నేను బాధ్యుఁడను గాను. అది [illegible] ! ఈ పొత్తము ప్రకటితము కాకపూర్వమే దీనిని వెక్కిరించఁ బూని యున్న [illegible] డిది బయటికివచ్చునా! యని తహతహపడువారు [illegible]. ఈ యా శుభవార్త కొడమంచిలి సత్యనారాయణగారు [illegible] వ్రాసినది. ఎవ్వని యొకపొత్త మచ్చు ముగిసిన [illegible] వలసిన దని కూడఁ గోరిరఁట ! దీనినామధేయమును వెక్కి[illegible] జరిగిన దఁట ! వెక్కిరించుట కుపక్రమణ మిదివఱకే జరిగినను ప్రకటించుటలో పల వారు దీనిం దిలకింపకపోరని తోఁచెడిని. [illegible] సవరించు కోవలసినమాట లేవేని యున్నచో [illegible] మాత్రమే కాక లోఁగడ [illegible] పాఱఁబట్టులేని తగ్గింపవలసిన దని సాంజలిబంధముగాఁ బ్రార్థించు చున్నాఁడను. ఎందులకోకదా ? వారి పరిశ్రమము,

ఇంకొకటి:—లోఁగడఁ జేసినవ్యవసాయము ఫలించెనో లేదో ? యనికూడఁ గొండొక పరీక్షించుకొనుటకూడ నావశ్యకమని హెచ్చ రించుచున్నాఁడను.

దీనిముద్రణము కృతిపతి నివాసము పీఠికాపురమునందలి ముద్ర ణాలయమున జరిగినను ముద్రణాలయమువారి పరిశీలకత్వమువలన నె క్కడనో తప్పఁ బ్రమాదములు లేకుంటకు వారిని మిక్కిలిగా నభినం

దించుచున్నాఁడను. వార్ధక్యదోషముచేతనేమి ఆశువుగా రచనమున కనాదిగా నలవడిన హేతువుచేతనేమి యీపొత్తమ్మున రెండుమూఁడుచోట్ల యతిప్రాసములు తప్పినవి. కాని, అట్టివి యీకృతిని బరిగ్రహించిన శ్రీలక్ష్మీజగన్నాథరావుగారు స్వయంకవు లగుటచేఁ గనిపెట్టి నాకుఁ దెల్పుటచేఁ బురోభాగులవలనిపీడ కొంత తగ్గిన దని సంతసించుచున్నాఁడను. ఇఁకఁ బురోభాగులు చెప్పదంటుశంకలుమాత్రమే యథాపూర్వముగా నొనర్చి సంతుష్టి పడవలసియుండు ననుకొందును. ఆశంకల స్వరూపమును గొంచెము చూపుదును.

(1) "చెప్పఁదగ్గది చెప్పెదఁ జెవుల వినుఁడు."

అని యొకపద్యమునఁ గలదు. ఇక్కడఁ బురోభాగు లిట్లు శంకింతురు. "చెవులతో వినక ముక్కుతోఁగాని మఱియొక్కయవయవముతోఁగాని వినువా రుందురా?"_అని శంక. దీనికి నెంతమంది మహాకవులప్రయోగములు చూపినను మరల యథాపూర్వముగనే వివదించుట, ఇది యాచార మైపోయినది. ఫలానా ఫలానా చోట ఫలానాగ్రంథములో యతిస్థానములోఁ బ్రాసస్థానములోఁ బ్రయోగము లున్నవని చెప్పినను లాభము లేదు. ఆయీప్రయోగములు గల పద్యము లుదాహరించినను లాభము లేదు. నిత్యకృత్యములలో నిదియొకటి,

"పూర్వోతిపూర్వా"గా నేదో లిఖించుట, చూపించుట కొందఱుపూజ్యపురోభాగుల యాచారముగాఁ బరిణమించినది. ఈవిషయము గోచరించి పత్రికలు చక్కనిప్రౌఢోక్తులతో విరమణమును శాసింప నుపక్రమించినవి. అందొకపత్రికలోనివాక్యములు నేఁడే చదివితిని. (ఆయావాక్యములు బయలుదేఱుకతము పూర్వపక్షుల యభ్యర్థనమే యని ఆవాక్యములే తెల్పుచున్నవి. కాని ఆయభ్యర్థనము నే నిందనుకొఁ జూడలేదు.) చాలఁ బ్రౌఢమైన మందలింపుగాఁ దోఁచినది. కాని ఆప్రౌఢిమ

పురోభాగులు గ్రహించునంతటి యోపిక గలవారని నాకు నమ్మికలేదు. అందుచేత నది మందలింపు కాదనియును గౌరవాపాదకమగునభినంద నమే యనియు నభిప్రాయపడుదు రనియు మరల నసూయావాక్యములు వెలువడు ననియు నూహకుఁ దట్టుచున్నది.

"పరేంగితజ్ఞానఫలాహి బుద్ధయః"

ఈభాగ్య మెవరికోగాని (ఇతరులమాట కేమి) కవులలోఁగూడఁ గనుపట్టదు. యథార్థమును మోమోటము విడిచి యెవరేని తెలిఁగించి వచించినచో వారు శత్రుపక్ష మనుకొనుటయే తప్ప వారిమాటయం దున్న సత్యమును గమనించునూహయే యుండదు కొందఱు పురోభా గులకు; అసత్యమైనను ముఖప్రీతికరముగా నెవరో లోకలూకాయలు:—

"బళి! బళీ! మీతాత బల్లెమ్ము చేఁ బూని"

అనుమాదిరిని స్తోత్రము చేసినచో దానినే విశ్వసించి లోఁగడఁ బొందిన ప్రమాదమునందే మరలఁ బ్రవర్తించుట కొందఱికిఁ బరిపాటే. ఇప్పట్టున దోసఁగు స్తుతిపాఠకులదిగాని అసలువారిది కాదు. భవతు! అసూయ దీని కంతకును మూలకారణము. అది పరాభవమును గొని తెచ్చెడి స్వ భావము కలది. ఆపరాభవము జూదగానింబలెఁ దనయుద్యమమునుండి యేరింగాసి విరమింపనీయదు. స్వశక్తినిగూర్చి పరీక్షించుకోవలసియున్నను నందుల కవకాశము నది కలుగనీయదు. అయ్యది అప్పుడు గాకున్న నిప్పుడు జయము కలుగఁగూడదా? ఇప్పుడు గాకున్న ముందేని జయము కలుగఁగూడదా? అని యడియాసను గొల్పెడిని. దీనింగూర్చి పిమ్మటఁ జూచికొందము.

అనావశ్యకమేయైనను శుద్ధపత్రము కొండొక చూపి దీనికి స్వస్తి చెప్పెదను.

# తప్పొప్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 16 | నయ్ను | నయ్యా |
| 5 | 20 | కథనా | కథన |
| 6 | 25 | క్రిమంచు | క్రిమించు |
| 15 | 1 | లిష్ట | లిష్ట |
| ,, | 7 | నటు | నట్లు |
| 17 | 2 | ప్రిశ్నం | ప్రశ్నిం |
| 28 | 15 | లల | లల్ల |
| 38 | 6 | త్రగ్గు | తగ్గు |
| 40 | 21 | గందు | గందు |
| 52 | 25 | ... | బొందును |
| 78 | 7 | క్షీంప | క్షీంప |
| 83 | 6 | బుజల్ | రుజల్ |
| 85 | 2 | మానవుల, స | మానవులః |
| 86 | 4 | నిర్దోషు | నిర్దోషు |
| 88 | 14 | జగతి | జగతిఁ |
| 94 | 20 | రున్వ్య | రున్ |
| 95 | 1 | కృత్ను | కృత్యు |
| 134 | 23 | యుండ | యుండు |
| 139 | 24 | కనేగు | కగునె ? |
| 140 | 13 | క్రిమంచి | క్రిమించి |

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 144 | 6 | గావించి | గాలించి |
| 148 | 7 | సూధకం | సూచకం |
| ,, | 17 | నేఁటి | నేఁటికి |
| 150 | 10 | పచ్చుట | నచ్చుట |
| 155 | 1 | నేఁబోలెదాని | ఁబోలెదానినే |

షరా:— ఇందులోఁ దుట్టతుదిదియు, 85—2 సంఖ్యలు గలదియుఁ జదువరులు జాగ్రత్తగా గమనింపఁదగినవి. చాలభాగము వీనిలో నక్షరము లంటకుంటచేఁ జారిఁగినవే. అట్టి వింకను మఱికొన్ని యుండును. విస్తరభీతిచే నుపేక్షించితిని. ప్రాజ్ఞులకు దీనితోఁ బనియే యుండదు. తదితరులకో ? మొదలే యుండదు. ఆచారము నిర్వర్తింపఁబడినట్లయినది.

స్వస్తి,

గ్రంథకర్త.





లింగం లక్ష్మీజగన్నాథరావు.

శ్రీమత్పరదేవతాయైనమః

శుభమస్తు!     అవిఘ్నమస్తు!

# సు శీ ల

తిరుపతివేంకటీయము.

## క ల్పి త ప్ర బం ధ ము



శ్లో. శుభమ స్త్వవిఘ్నమస్తు
శ్రీరస్తు చిరాయురస్తు విజయోఽస్తు
అస్తు ధనధాన్యపుత్ర
శ్రేయోవిద్యాయశోఽంగనాసిద్ధిః.

శా. శ్రీయుక్తంబగు నైమిశంబనువనిన్ జెన్నారు మౌనీంద్రులా
యా యాగంబులు చేసికొంచు జగదేకారాధ్యు విశ్వేశు నా
మ్నాయధ్యేయు యజింపుచున్నయెడ సన్మాన్యుండు సూతుండు రా
నా యోగిన్ గడు గారవించి యని రత్యంతప్రమోదమ్మునన్. ౧

శా. వ్యాపారమ్ములు లేవు మాకు వినఁగా నాసక్తియున్ మెండు నీ
వా? పాండిత్యము గల్గుపుణ్యుఁడ వగణ్యంబైన మా పుణ్యరే
ఖాపారీణత లబ్ధమైతివి జగద్గణ్యంబు పుణ్యంబు సం
తాపధ్వాంతహరంబు భావిచరిత న్మా కొందు వాకోఁగదే. ౨

క. వింటిమి ప్రాక్తనగాధలు, కంటిమి సంతసము భావిగాధలు వినఁగా
నుంటిమి చెప్పఁగ నీవిట, నుంటివి కాదవేమి? మాకు యోగివరేణ్యా!

వ. నావుడు వినయావనతుండై యమ్మునులకు సూతుం డిట్లను. ౪

ఉ. మీరు మహానుభావులరు మీకు సమస్త మెఱుంగ వచ్చు నో
ధారుణిదేవులార! నను ధన్యునిఁ జేయుతలంపు గాని యీ
కోరిక యొండు గాదు మునికుంజరులార! సమస్తదేవతా
ధారుఁడు కృష్ణుఁ డేమనియెఁ, దజ్ఞులు మీ కొరులేల చెప్పఁగన్. ౫

గీ. మంత్రమూలమ్ము వేదమ్ము మంత్రిములు స
మస్తమును బ్రాహ్మణులకు స్వహస్తబదర
సదృశములు, తాదృశము విప్రజాతి నాకు
దైవతమ్మని చెప్పఁడే? దానవారి. ౬

క. వేదములలోన లేనియ, నాదివిశేషమ్ము లెచటనైనం గలవే?
పాదది సమస్తమునకుఁ, బు, నాది భవదధీనమది ఘనం బన్నిటికిన్.

గీ. అందుఁ బ్రత్యక్షముగఁ గవనగును గొంత
గొంత యానుమానికము, ధీమంతులైన
తీమకు నుభయము వేద్యమే తాదృశులకు
నొరులచే వినఁదగిన దేముండు నొండు. ౮

చ. అవి వినయమ్మునం బలుకు నయ్యనఘాత్ముని సూతుఁ జూచి య
మ్మునివరు లో, గుణాఢ్య? ఋషిముఖ్యుని వ్యాసునిఁ గొల్చి నీవు నే
ర్చినవిషయమ్ము లేమునివరేణ్యులు నేర్చిరి? జాతిమాత్రిశూ
ద్రుని నిను "జ్ఞానవిప్రుఁ" డనరో? యనసూయులు తాపసోత్తముల్.

క. ద్విజకులజాతుండై నను, గుజనుఁడు శూద్రుండు, శూద్రకులజుండైనన్
సుజనుఁడు విప్రుండని చె, ప్పఁజనున్ విజ్ఞులు వివాదపడ రిప్పట్లన్.

క. ఎంతటియోగ్యుఁడవును ధీ, మంతుఁడవును గానిచోఁ గుమారునితో ని
న్నంతేషాసిగఁ గొని యే, కాంతమ్ములు విద్యలెల్ల వ్యాసుండిడునే?

చ. సకలపురాణసంహితలు స్వాంతగతమ్ములు నీకు; నీవు చే
ప్పికొనవు ధర్మహాని కెద భీతిలి; అట్టులె కాకయున్నఁ ద
ప్పక యవి కంఠపాఠమయి బ్రాహ్మణులన్ మఱపింపకున్నె ? త
త్ప్రకటితధర్మమర్మము లపారముగా మది నీ దెఱింగెడిన్. ౧౨

గీ. గాథ లెన్నియొ మున్ను నీకతన వింటి
మనఘ ? మాచెవులకుఁ దృప్తి యనువువడదు
వినినకొలఁది నీవాక్కులు వినఁగవలయు
ననియె మామనములఁ గోర్కు లినుమడించు. ౧౩

గీ. విషము దుర్జనుఁడును నొక్కవిధమువారు
సుధయుఁ బండితుఁడును నొక్కవిధమువారు
బుధులు దొరకినయప్డు సత్కథలు వినని
వారలెల్లరుఁ బశువులవంటివారు. ౧౪

క. ఒక్కొక్కగాథ ముక్తికి, నొక్కొకసోపాన మగుచు నొప్పారెడి నీ
వాక్కునఁ గలసారస్యం బక్కజ "మిదమిద్ధ" మనఁగ నది మాతరమే.

క. సూతజుఁడవంచు నిను నీ, జాతి నెఱుఁగువారు దక్క సర్వజ్ఞుని నిన్
జూతురె ? యొండుగ నీవా, క్చాతుర్యము గలదె ? అగ్రిజాతులకేనిన్.

గీ. అనఘ ? నీపుట్టువునఁ జేసి యంఘ్రిజకుల
మెల్లఁ బావనమయ్యె నిన్నెన్న మాకుఁ
దరము గాదు సాక్షాత్పరాత్పరునియంశ
మెంతయో గల దయ్య ! నీయెడల సూత ? ౧౭

క. కారణజన్ముండవు ని, న్నారక నుతియించునట్టు లూహింపకు నీ
పేర నొకసంహితయె కల దేరెఱుఁగని దింక నధిక మేటికిఁ దర్విన్.

గీ. అచ్చటచ్చట నీవంటియనఘు లవత
రించుకారణముననె అంఘ్రిజకులంబు
వేదసమ్మత మగుచు ననాదిగఁ జెలు
వారుచున్నది గణ్యుఁడ వందు నీవు. ౧౯

వ. అయ్యది యటులుండెఁ బ్రకృతంబు వినుము. ౨౦

గీ. వేదములు పూర్ణముగఁ జదివితిమి వాని
యర్థ మెఱిఁగితి మవలఁ జేయంగబడియెఁ
గ్రతువు లట్లయ్యు సంసృతిఁ గడవఁ జాల
కున్నవారః ముపాయ మొండున్నఁ జెపుమ. ౨౧

గీ. జంతుహింస ఘోరంబని జాలి కలిగి
కూడ శ్రుతు లట్టులుంటచేఁ గొంక కదియు
నాచరించి జన్నములు సేయఁబడెఁగాని
యేలొకో! ఆత్మ శాంతింప దించుకేని. ౨౨

గీ. సంసృతిఁ దరింపఁగాఁ జేయఁ జాలవేని
వేదములు చిల్కపల్కులవిధము కాదె ?
నీకు వివరింపవలెనె ? మనీషి వైతి
తరణసాధన మొండున్న నరసి చెపుమ. ౨౩

గీ. చిత్తశుద్ధికిఁ గర్మముల్ చేసి తీర
వలయునని నీవు సైతము పలికియుంటి
వవి యొనర్చియు హృచ్ఛుద్ధి దవులకున్న
వారమని చెప్పుటకు సిగ్గువడము మేము. ౨౪

ఉ. ఎక్కడనేనియున్ గలరొ ? యేమొ ? మహాత్ములు యజ్ఞయాగముల్
తక్కక చేసి యక్కతన ధన్యత గాంచి మనోవిశుద్ధి పెం

పెక్కియు నెక్కరానిపద మెక్కినవారలు; మాకుమాత్ర మా
చక్కనిత్రోవ యిక్కతన సాధ్యము గాదనియే స్ఫురించెడిన్. ౨౫

గీ. నూఱుక్రతువు లొనర్చి సంసారు లెల్ల
నభిలషించు స్వర్గమ్మున కధిపతి యయి
ఇంద్రుఁ డేమంత శాంతికి నిక్క యయ్యె?
నతనిచరిత మెఱుంగని యలఘు లెవరు? ౨౬

గీ. ఎప్పు డేరక్కసుఁడు వచ్చి యెదరు గలుగఁ
జేయునో? యని యది వాయు నేయుపాయ
మో? వెదకికొంట తప్ప నేమున్నదయ్య?
ఇంద్రునకు సౌఖ్య మెఱిఁగింపు మిద్ధచరిత! ౨౭

క. ఎందుల కైశ్వర్యమ్మున, యందున్ దేవతలుగూడ నజ్ఞులతోపా
టందుదురో? వ్యామోహం, బిందిర కొకతా వటన్న యేర్పాటున్నే?౨౮

ఉ. ఎందుకు వచ్చునో? మరల నెందుకుఁ బోవునో? యెంతకాల మెం
దెందు నివాసమో? తెలియ దిందిరఁగూరిచి, గడ్డిపోఁచయున్
మందిరమౌ జలేజమును మందిరమౌ నియమంబు సున్న దీ
నిం దనదంచు నమ్మికొని నెగ్గినవా రెటనేని యుందురే? ౨౯

క. ఈవిశయము లప్డప్పుడు, భావమ్ము గలంచుచుండుఁ బండితుఁడవు నీ
కేవియు నడ్డవు వ్యాసమ,హావిజ్ఞునికరుణ గత మనాగతమేనిన్. ౩౦

వ. ఇట్లు సంశయడోలాందోళితమనస్కులై సంసారస్వరూపం బెఱింగియు నెఱుంగనిచందంబునఁ బృచ్ఛసేయు శౌనకాదులకుఁ దనయం దున్న వాత్సల్యాతిశయంబు గుఱితించి సూతుండు వారికోరిక ననుసరించి భావికాలచరిత్రకథనాముఖంబునన యవ్వారిసందియంబుం దీర్పనెంచి తదవగాహనార్థంబు గొండొకకాలంబు నిమీలితలోచనుండై. ౩౧

ఉ. వ్యాసమునిన్ దలంచి జగదంబికపాదము లాత్మ నిల్పి ని
ష్కాసితపాపులైన మునిచంద్రుల నచ్చటివారి మ్రొక్కి "నా
దోసములన్ క్షమింపుఁ డెదొ తోఁచినయట్లు వచింతు" నం చుప
న్యాసము సేయఁగాఁ దొడఁగె నమ్మునిమండల మాస్థతో వినన్. ౩౨

గీ. అనఘులార ! మీయడిగినయట్టి ప్రశ్న
కుత్తరము మీ రెఱింగియే యుందు రైన
నేమి చెప్పుదునో? యని యీరు నన్ను
నడిగితిరి విన్నవించెద నరయుఁడయ్య ? ౩౩

వ. త్రిమూర్తులకును ననుల్లంఘనీయమగు నయ్యోగమాయాప్రభావంబ ఆ యీత్రిప్పల కెల్లఁ బరమకారణంబు. అయ్యది యజ్ఞులనేకాక, విజ్ఞులం గూడఁ దనవశమం దుంచికొని యనేకగతులఁ బరిభ్రమింపఁ జేసెడిఁ గావున నిందులకు నజ్ఞవిజ్ఞభేదంబుతో లేశమును సంబంధంబు లేదు. గతించినవారుగాని నేఁటివారుగాని భావికాలపువారుగాని సునాయాసమ్ముగాఁ దరింపవలెనన్న భక్తిజ్ఞానవైరాగ్యంబులకు మించినసాధనంబు కన్పట్టదు. తత్సాధనసంపత్తికి బ్రాహ్మణాదికులభేదంబులతోఁగాని తదితరసంపదతోఁగాని యావశ్యకత లేదు. అయ్యది అర్హులకుఁ గలుగకయుఁ బోవచ్చు ననర్హులకుఁ గలుగనువచ్చు. జన్మాంతరవాసనయే సద్బుద్ధికి మూలకారణంబైనను సత్సంగంబు బాహ్యకారణంబుగా నొప్పక తప్పదు. ఆయీవిషయమ్ము నెల్ల నేనిపుడు నొడువఁబోవు భావికాలకథానకదర్పణంబునఁ బ్రతిపదంబును బ్రతిఫలించుచుండు. నాయీకథానకమీ కలియుగం బైదువే లతిక్రమంచునప్పటిది యని యెఱుంగునది. గురుకటాక్షవశంబున భూతంబున్ బోలె భావియు స్ఫురించుటం జేసి చెప్పంగలిగితి నవధరింపుఁడు. ౩౪

# కథారంభము.

చ. కలఁ డొకవైశ్యుఁ డాతఁడు సుఖంపడి యెన్నఁ దెఱుంగఁ: డొక్కచీ
దలకులమందుఁ బుట్టి ధనధాన్యసువర్ణచిరత్నరత్నరా
సుల కధినేతయై యెపుడు సోమరిగా కతిలోభియై సుతుల్
పలువురు కూఁతులుం గలిగి బాసిలు స్వార్జితభాగ్యశాలియై. ౩౫

గీ. వర్తకముకన్న ధనధాన్యవైభవములు
గలుగఁజేసెడి దేదియు నిలను లేమి
నతఁ డెఱుఁగఁజేసె నతని యీయఖిలవిభవ
మాత్మకులవృత్తి వర్తక మబ్బఁజేసె. ౩౬

వ. ఆవర్తకంబులును బలుతెఱంగులు. ఆకాలంబున హేయాహేయవిచారం బేవిషయమ్మునఁగూడ నంతగాఁ బాటింపకుంటుట భగవత్సమ్మతంబ యగుటంజేసి తోళ్ళు నెమ్ములు లోనగువాని విక్రయణంబుకూడ ధారాళంబుగ సాఁగు. మఱియు 'నట్టఖాల,' 'కేశఖా'లాది సంకేతపదంబులతో విష్ణుపురాణాదులలోఁ బేర్కొన్న వ్యాపారంబులుగూడ వర్ణవిచారంబుతో నిమిత్తంబు లేకయె సాఁగెడి నది యటులుండె. ౩౭

చ. అతఁడు దరిద్రుఁడై జనన మందియుఁ దండ్రికి నందివచ్చు పి
స్నతనమునందు వర్తకమునన్ జరియించిననాఁటిపోడుముల్
మతిని గణించువారలకె మాటికి సి గ్గుచయింపఁజేయు నిం
కతనికి నెంత యేవమున కయ్యవి హేతువు లౌనొ? తాపసుల్. ౩౮

ఆ. ఎట్టులైననేమి? యితని కీతఁడె సాటి
యింతవాఁడు భువి 'నహి ప్రతిల్లె'
అన్నపేరు మ్రోఁగునట్టిఁడై వర్తిల్లె
నతనియిల్లె గాచి రలఘులెల్ల. ౩౯

చ. కొడుకుల నల్లురన్ సలిపికోఁగఁ దలంచి తదర్థమై యతం
"డొడఁబడునో పడండొ? యని యొండొక తత్సఖు నాఁత గొంచు వ
చ్చెడి ధనికాగ్రిగణ్యులగు సెట్టుల కాతఁ డు దర్శనంబు నె
ప్పుడొ? యిడు దర్శనం బిడఁడపో? మఱికొందఱి కేమి చెప్పుదున్. ౪౦

గీ. యాచకులటన్న నాతని కమితభీతి
యా కతమ్మున నెపుడు నిర్భీకమైన
చంద్రశాలనె వసియించుఁ జతురుఁ డతఁడు
దాని భోగంబుగా నొరుల్ దలఁచుచుంద్రు ౪౧

ఉ. "ఎప్పుడొ పెట్టి పుట్టితిమి యిప్పుడు దానికి నెన్నిరెట్టులో
అప్పరమేశ్వరుం డిడియె నందులకున్ దగినట్టివర్తనం
బిప్పుడు చేసి వచ్చుజని యిందిరకున్ గుదురై చెలంగు నా
చొప్పున నుండఁజేతు" ననుచున్ దలపోయఁ డతం డొకప్పుడున్. ౪౨

సీ. ఒకగేస్తు రిక్తుఁడై యుండియుఁ దనకున్న
తోఁటకూర యిడి భిక్షుకులకు
నప్పుణ్యమునఁజేసి యైశ్వర్యవంతుఁడై
తోఁటకూరపెరళ్ళు నాఁటి పెంచి
దాన మ్మొనర్చు 'చంతకు నింత యయ్యె నిం
తకు నెంతొ?' యం చనుటకు నొకండు
విప్రుండు విజ్ఞుండు వికవిక నవ్వి 'యిం
తకు నింతయే' యన దాత 'యేమి'

గీ. సామి! యిట్లంటి రన 'దాత శక్తికిఁ దగు
నట్లొసంగనియెడ వ్యర్థ మగును దాన'
మవి వచించిన నలదాత యనుగుణప్రి
దాత యయ్యె నటందురు ధర్మవిదులు. ౪౩

క. మనసెట్టి కిట్టి వెన్నియొ. మనమున నుండియును ధూళిమాత్రంబేనిన్
దనయింటి దొరులయింటికిఁ,జనుటకునొప్పండు వచ్చుజాడయెచూచున్.

క. ఒకవీసెఁడు గొంటకుఁ గూ, రకుఁ బల్వుర నంపుఁ గొసరు రాబడిచే వీ
సెకు నఱవీసెఁడు హెచ్చొ, టకు నాత్మఁ దలంచి నవ్వటకుఁ బొలగుచున్.

గీ. "దాతలెల్ల దారిద్ర్యవిఖ్యాతులగుదు
రవని లుబ్ధులె యైశ్వర్య మధిగమింతు
రింత ప్రత్యక్షసిద్ధ" మం చెప్పు డతఁడు
విదపఁ డొకపైసయేని యేవిషయమునకు. ౪౬

ఆ. "లేనిదాతకన్న లేకియే యగుఁగాక, యున్నలోభి మేఱఁ"గటన్నసుడిని
నమ్మి యెందఱో అనద లక్కుబేరునిఁ, జూడవత్తు రతఁడుచూడకున్న.

క. ధన మెచ్చుగఁ గలవానికిఁ, బనియే మొండొకనితోడఁ బరుల కతనితో
డనె యుండుం బని నిక్కమె, ధనమేనా? జన్మమునకుఁ దారక మకటా!

మ. కలవా రెందఱు రిక్తు లెంద ఱిపు డిక్కంజాతభూసృష్టి నా
ద్యులు బంగారము మెక్కి మృత్తిక తదన్యుల్ మెక్కుచున్నారె? యి
క్కలుముల్ నిక్కములో? వయస్సు సతమో? కాయంబు నాపాయమో?
కలలే విక్కలలో? మఱేల ధనికుల్ గర్వింత్రు దుర్వారులై. ౪౯

వ. అది యట్లుండె మనశ్రేష్ఠిశిరోభూషణుండు. ౫౦

క. ప్రతిశుక్రవారమును ధన
తతికిం బూజ యొనరించుఁ దనయంతఁ, బురో
హితుఁ బిల్వ నంపఁడు పురో
హితునకు దక్షిణ యొసంగు టిష్టము లేమిన్. ౫౧

క. స్వకులజపౌరోహిత్యము, నకు నీతం డొప్పఁ డేమనఁగ? దక్షిణ వా
రికి హెచ్చొసంగవలె నని, అకించనద్విజులకతన నది జరిగించున్.

వ. పరాపకారకములు గాకుండియు స్వోపకారకమ్ములును గాకుండునట్టి
విట్టిస్వల్పవిషయంబు లెన్నియో యలసెట్టికి నలజడి గలిగించుచుండు
నది యట్లుండె. ౫౩

క. తననేర్చినవిధమున న, ర్చనసేయుట కల్లలక్ష్మి సంతోషంబుగా
గని యా వైశ్యనిగృహమే, మనికిగ వర్తించు వర్ధమానప్రభలన్.

క. కూఁతులు దినుటకు నాతని, చేతం బొప్పికొను వాండ్రుఁ జేపట్టిన జా
మాతలునైతముఁ దినుటకు,నాతని మనమొప్పికొనద అది యెట్టిదియో?

ఆ. పనికి మాలిన దని పల్కుదురే గాని
కవులయందుఁగూడఁ గానఁబడెడి
లోభగుణము; దీనిలోఁ గల మర్మంబు
సెట్టి కెట్టు దెలియు వట్టిగోడ. ౨౬

వ. దీనింగూర్చి మఱియొకప్పు డింకం గొండొక ప్రస్తావించుకొందము
గాక. ౨౭

గీ. క్రమముగాఁ గాల మీరీతిఁ గడచెఁ జాల
నంత సెట్టికి వార్ధక్య మనుసరించె
సెట్టికే కాదు లోభాన కట్టె యయ్యెఁ
గొడుకులకుఁ బెత్తనము వశవడియెఁ గొంత. ౨౮

ఉ. ఇచ్చకు వచ్చినట్టులుగ నిచ్చుచుఁ దారును గుచ్చు వెట్టుచున్
బుచ్చుకొమాళ్ళు దాతలయి భాగ్యపరీతతకున్ ఫలమ్ముగా
హెచ్చుయశమ్ముఁ బున్నె ముదయింపఁగ వర్తిలఁగాఁ దొడంగి రా
సచ్చరితమ్ము బుచ్చుకు విషమ్మయి చేసె నసహ్యవేదనన్ ౨౯

ఆ. "అర్జకునకుఁ దెలియు నందలికష్టమ్ము
మీకు నేమి తెలియు మీరు రూప్య
మొక్కగవ్వగాఁగ నూరక వెచ్చింతు"
రనుచు సణుఁగుచుండు నతఁడు సుతుల. ౩౦

గీ. "రాజుకొడుకేనిఁ గావలె రండకొమరుఁ
డేనిఁ గావలె" నని పెద్ద లెందు కనిరొ ?

యెఱుఁగుదురె ? మీర లూరక హెచ్చి పొంగి
బోరగిలఁ బడకుం" డని పొగిలి తిట్టు. ౬౧

క. పండుగులకుఁ బబ్బములకు
నిండుగ నొక్కరికిఁ బెట్టి నెఱిఁ దినుటకు నా
తం డొప్పక లోలోపల
మండంగాఁ దొడఁగుఁ బెక్కుమాటలు దూఱున్. ౬౨

వ. లోభగుణపరియుక్తంబు లింకను నిట్టివనేకమ్ములు సెట్టియం దుత్పన్నంబులై దుర్భరంబులై యతనినేకాక కొడుకులు లోనగు కుటుంబంబును గూడ బాధింపం దొడంగె. ౬౩

చ. అది గనిసెట్టి పండుగులయప్పుడు గూఢముగాఁగ భక్ష్యముల్
మదికి రుచించునట్టివి సమంజసముల్ పొనరింపఁజేసి యా
ముదుసలి కవ్వి పెట్టకయె మోసమ్మై మెసవం దొడంగి ర
య్యది "దొసఁగం" చెఱింగియును నాతనినోటికి జంకి పుత్రకుల్. ౬౪

సీ. "జన్న మ్మొనర్చెడి జన్నిగట్టునకు ద
క్షిణభాగ మిచ్చె నీసెట్టి" యంచు
బీదబాపనికూఁతు పెండ్లి కర్చు సమస్త
మితఁడె భరించె నహీనుఁ డంచుఁ
గట్టు దప్పిన ద్విజాగ్రణికొడుక్కునకు వడు
గితఁడె చేయించె దాతృమణి యంచు
శిథిలమౌచున్నట్టి శివునాలయము బాగు
చేయించె నితఁడు సుశీలుఁ డంచు

గీ. వేదవేత్తలఁ బిలిపించి విప్రవరుల
నగ్రహార మ్మితఁడు నిల్పె నలఘుఁ డంచు
సెట్టి పెద్దకుమారువాసిని గణింపఁ
జొచ్చె లోకమ్ము, సెట్టి కసూయ హెచ్చె. ౬౫

చ. అతనియదృష్ట మెట్టిదియొ ! అందఱు పుత్రులు గూడ లోకస
మ్మతులయి దుర్వ్యయం బనెడిమాట రవంతయు లేక తండ్రి తా
నతిగ నెటో గడించు నలయర్థపురాశికి సార్థకత్వ మీ
గతి సమకూర్చుచున్ స్వయముగా గడియించిరి హెచ్చుగా సిరిన్.

గీ. అట్టి సత్పుత్రులం గన్న యట్టితండ్రి
లోభియే యగుఁగా కది లోకమునకు
నేమి హాని గల్గించెడి ? నెట్టులేని
ధన్యుఁడే తరియించుఁ దుదకు నతండు. ౧౭

చ. కులవృత్తిన్ ధనమున్ గడించుతనకొడుకుల్ ప్రేమకున్ జాలఁ బా
త్రులుగాఁ దోఁచియు. దాతృతాగుణముచే రోఁతన్ మదిన్ సెట్టికిం
గలుగన్ జేసిరి, లోభమన్న నరిషట్కమ్మందు నేలాటిదో ?
తెలియన్జేసెడి సెట్టివర్తన మహో ! ధీరుల్ విచారించిన్. ౧౮

చ. తనధనమందు లేశమును దానము సేయుట కొప్పఁ డంతతోఁ
జనక మతెవ్వఁడేని యొకసత్రమొ ? చావడియో ? ఘటింప న
ప్పనికిని సమ్మతింపఁడఁట ! పాపపులోభి; విమర్శ చేసి చూ
చిన నరిషట్కమందుఁ గడుఁ జెడ్డది లోభగుణంబ సర్వథా. ౧౯

గీ. సెట్టికొడుకులు గడు సుప్రసిద్ధు లగుచుఁ
దండ్రి యేమేని యన్న నాతనియెడలను
భక్తిభావంబు సడలనిఫక్కి నెలమి
వర్తిలుచునున్న సెట్టికి వైర మబ్బె. ౨౦

క. దానికి వార్ధక్యము తోడై నానాఁటికి గృహమ్మునం దుండుటకున్
మానస మొప్ప కతఁ డరణ్యానిఁ బ్రవేశించె లోభ మది ప్రేరేపన్.

క. కొడుకులు తండ్రిన్ గన కెక్కడి కేగెనొ ? యంచు వెదకఁగాఁ బంచిరి న
ల్గడలకుఁ బరిచారకులన్, దడవియు నవ్వారు గన రతని నెయ్యెడలన్.

చ. కొడుకులతో వివాదమునకున్ దగుహేతువు లేకయుండియున్
జెడుగగు లోభమూలమున సెట్టిగృహానకుఁ గాక వీఁకమై
నెడఁద వశమ్ముగాక వని కేగి దినమ్ములు పుచ్చుచుండె న
క్కడి కరుదెంచె నొక్కనృపకాంతుఁడు శత్రుహృతాత్మరాజ్యుఁడై. ౭౩

వ. తుల్యావస్థ నున్నయావృద్ధు లిరువురు నన్యోన్యవృత్తాంతమ్ము లన్యోన్యము నిట్లు ప్రసంగించుకొనిరి. తొలుదొల్త నృపాలుం డవ్వణిజు నిట్లు ప్రశ్నించె. ౭౪

క. నీ వెవర వేమి కారణ, మీవనిలో నునికి, వగకు నీమొగ మెంతేఁ
దావలమైన నిమిత్త,మ్మే విनఁదగునేనిఁ జెప్పు మేటికిఁ గొంకన్. ౭౫

చ. అనవుడు వైశ్యుఁ డిట్టు లను నన్నృపుతో; జననాథ ? యేను స
జ్జనకులజాతుఁడన్ ధనము చాల గడించినవాఁడఁ బుత్రులన్
గనియును వారు నానుడులు కర్ణములం దిడ కిచ్చ వచ్చుచొ
ప్పునఁ జరియింప నాకు మతి పోయి యిటన్ వసియింతు జోగినై.

వ. ఇట్లు సంగ్రహమ్ముగాఁ దనవృత్తాంతమ్ము నొడివి మఱియు నిట్లనియె.

చ. కొమరులు వశ్యులౌట, తనకున్ రుజ లేమియు నేర్చువిద్య ద్ర
వ్యమునకు దోహదం బగుట భార్య పతివ్రత యౌట సాధుస
ఖ్యము తఱచబ్బుచుండుటయుఁ గల్గిన గేస్తున కీయిహంబె స్వ
ర్గము, నరకంబ యౌఁ గొఱఁత గల్గిన నిందొకదాననేనియున్. ౭౭

వ. ఇట్లు వృద్ధులగుపండితులు వక్కాణింపఁగా విని యుంటి. ౭౮

క. నాకొమరులు లోకమునకు, ధీకుశలులె యయ్యు నామదికి నచ్చరు "సు
శ్లోకు"లని చెప్పికొందురు,లోకులు; వా రెఱుఁగు రెట్లు లోపలిగొడవల్.

క. తనువునఁ గలయవయవములు
తనకున్ వినకుండు టెట్లొ ? తనయులు తనకున్
వినకుంటయు నట్టిదె యగు
నని నాకుం దోఁచి యిట్టు లరుదేవలసెన్. ౮౧

వ. ఇవ్విధంబునఁ దన వైరాగ్యకారణంబు వినిచి సవినయమ్ముగ నతండు.

క. జననాథ ! నాదుచరితము, వినిచితి సంక్షేపముగను బృథివీపతి చం
చును దోఁచెడి నాకృతిచే, వనట మొగంబునను గానఁబడుఁ గతమేమో!

వ. వినవచ్చుండ నని తోఁచినచో వినిపింపం గోరెద "సఖ్యము సాప్తపదీనం" అని భవాదృశులు వాక్రుత్తురుగదా ? మన మిరువురమును మిత్రుల మైతిమి. అన్యోన్యమును వివరించుకొనుటం జేసి మిత్రులదుఃఖమ్ములు గొంత యుపశమించుట సర్వానుభవసిద్ధంబ కావున నార్చుటకుఁ గాని తీర్చుటకుఁగాని సమర్థుండను గాకుండియు నిట్లు గ్రుచ్చిగ్రుచ్చి యడుగుచుంటి నావుడు రాజర్షిసత్తముండు ౨౩

క. తనయులకారణమున నీ, వనమున కరుదెంచి తీవు వగఁగొని యేనో?
వనమున కరుదెంచితి నరి, జనులనికారమ్ముకతన సాధువరేణ్యా ౨౪

క. పరిశీలించినఁ దనయుల, కరులకు భేదంబు లేమి యరయఁగనౌఁ బా
మరు లీమర్మ మ్మెఱుఁగక, పొరిఁబొరి ననపత్యులగుచుఁ బొక్కుదురనఘా!

చ. తనయులు గల్గకున్నపుడు దానికిఁ జింత జనించుపై జనిం
చినత్రుటి యాది యెందులకొ ? చింత యెదో ఘటియించుచే మనం
బున కగుపట్టుచుండెడి రిపుల్ మఱి యింతకు మించి యెట్టిచిం
తను గలిగింతురో ? తెలిపి నావిశయంబును దీర్పు మిత్రమా ? ౨౬

ఆ. ఒక్కప్రాణమున కెదోరీతి భంగమ్ము, గలుగఁజేయు శత్రు వలఁతులైన
సుతులు తండ్రి కెన్నిగతులనో యిబ్బంది, గలుగఁజేతు రరులుగారె?వీరు.

ఉ. వారలవారలన్ జెఱిచి వాస్తవదూరముగాఁ జరించి ని
స్సారపుసంసృతిన్ దవిలి సాగరమందు విసారమున్ బలెన్
దారియుఁ దెన్నునుం గన కెదన్ దగులొందుటకన్న ధీరులౌ
వారలు దూరదూరముగ వార్ధకమందుఁ జరించు టొప్పదే ? ౨౮

క. అన్నియుఁ దనకే కావలెఁ, దిన్నగఁ దిని కూరుచుండఁ దీర దితని కం
చు న్నందను లాడఁగ వృద్ధెన్నఁటికి విరక్తిఁ గాంచఁ డేమికతంబో ?

ఆ. ఇట్టు లిష్ఠగోష్ఠి నృపతియుఁ గోమటి,తనకుఁ దనకుఁ గల్గుపనటఁ దెలిపి
కొనుచునుండుతఱిని గుణరాశి సౌందర్య,రాశి యొక్క వేశ్యరమణి వచ్చె

గీ. అల్లభగవంతుఁ డిచ్చిన యందచంద
ములు వినా వేఱు భూషణములు ధరింప
దాలతాతన్వి వయసు పదాఱు కించు
మించుగాఁ దోఁచుఁ దొలకరిమించు మించు. ౯౧

క. వైరాగ్య మెల్ల నేకా,కారము ధరియించినట్లు కన్నె మొగము తీ
రారయనై వారిరువురు, నారమణిన్ జూడఁదొడఁగి రమరాంగనగన్.

క. జననాథుం డనుకొనె నిది, "వనదేవతయే" యటంచు వైశ్యుఁడు సాక్షా
ద్ధనలక్ష్మి తన్ను వెనుకొని వనమున కేతెంచె ననెడిభ్రాంతిం గనియెన్.

గీ. వారలేదో పరధ్యానవశతనుండు,తఱి నతర్కితముగఁ దొలకరిని దోఁచు
మెఱపునాఁ గన్నులకు మిఱుమిట్లుగొలుపు,బాలయందంబు వారికి భ్రాంతి [గొలిపె.

వ. అట్లు విభ్రాంతులై.

క. ఇరువురు దేవతగా నా,సరసీరుహనేత్రఁ దలఁచి సరగున భక్తిన్
బరవశులై మ్రొక్కిరి యది, వెఱఁగుపడి తొలంగి మ్రొక్కె వీరల కని [యెన్.

గీ. ఏను భోగముదాన మహానుభావు
లార ! ననుమ్రొక్కి నాదుశ్రేయస్సు భంగ
పఱచితిరి దీని కేనేమి పాచితంబు
చేసికొందునో ? యెంతటిదోస మబ్బె. ౯౨

వ. నావుడు గొబ్బున నబ్బాలకు రా జిట్లనియె. ౯౩

గీ. దేవతాకళ దక్క నీదేహమందుఁ, గానఁగా రాదు మానుషకళ మహాస
తివిశేషంబదెల్ల మూర్తీభవించి,నట్టు లుండినదాని వేశ్యయనుట యెట్లు?

ఉ. ఎంతటి యోగ్యురా లయిన నెంత గుణమ్ముల కిక్కయైన దు
శ్చింతల కెంత దవ్వగ వసించెడిదైన మఱెంత గేహినీ

భ్రాంతిని గొల్లువేసమునఁ బై కగుపట్టెడిదైన బోగపుం
గాంతతనంబు దాఁ దెలియుఁ గాని తనంతన సుంత దాఁగునే ? ౧౦౦
క. 'తిమ్మన' యని తనుఁ బిలిచిన, నమ్మనుజుం డెఱుఁగ చెప్పి రన 'నీమొగమే
సు' మ్మందు రెఱుఁగవే? మ్మ,ర్మమ్మిది తాదృశమయెఱుఁగమా? మేమొరులున్
వ. అయినను నీతేజం బసత్యరచనకు దోహదం బిచ్చునది గామింజేసి మేము మాభ్రాంతి నంగీకరింపక తీరక వచ్చినది యనునంతలో వైశ్య వృద్ధుం డిట్లను. ౧౦౨
క. ధనలక్ష్మిని గలలో మును, గనుఁగొను టప్పు గిలదు కనకాంగిరొ ? నీ
జననం బెట్టిదొ? స్వప్నం,బునఁ జూచినరూప మిదియపో ? తరళాక్షీ ?
క. అందముఁ జందము బోగపుఁ, జందనగంధులకు నుంట సహజమె నీదౌ
నందముఁ జందము వే ఱిది, సందర్భించదు మనుష్యజాతుల నెందున్.
చ. నినుఁ గనుఁగొన్నవారలకు నిక్కము మ్రొక్కఁగ బుద్ధిపుట్టు నీ
జననమహత్త్వమో ? సుగుణసంపదుదారమహత్త్వమో ? కనుం
గొనఁదగుపాటి పాండితి కొకొండు సమర్థుఁడె ? మాదృశుండు నీ
జననము లోనుగాఁ దెలిపి సంతసమున్ గలిగింపు కోమలీ. ౧౦౫
వ. అనవుడు నయ్యనవద్యాంగి వినయావనతయై వారలకు మ్రొక్కి యిట్లు వక్కాణింపం దొడంగె నని చెప్పునప్పటికి సంధ్యాసమయం బగుటయు శౌనకాదులును సూతుండును నదీతటమ్మునకు కరిగిరి. ౧౦౬

ఆ శీ ర్వ చ న ము.

క. శ్రీమల్లింగంవంశో,ద్ధాముఁడు నైకూడ సంతతము విష్ణుపదం
బేమఱని జగన్నాథుఁడు, నేమమ్మున వఱలుఁగాక చిరకాల మిలన్.

గ ద్య

ఇది శ్రీతిరుపతివేంకటీయంబగు సుశీల
యనుకేవలకల్పితప్రబంధమ్మునందుఁ
బ్ర థ మా శ్వా స ము.

శ్రీమత్పరదేవతాయై నమః

# సుశీల

## తిరుపతివేంకటీయము.

## ద్వితీయాశ్వాసము.



వ. మఱునాఁడు మరల శౌనకాదు లాహ్నికకర్మకలాపంబులు నెఱవేర్చికొని యవ్వలికథావిధానంబుంగూర్చి ప్రశ్నించుటయు సూతుం డట్లు వినయావనతమ్మై యవ్వేలంది వారలం గాంచి:— ౧

క. అతిదీర్ఘపు వీధులు సౌధతతులు దేవాలయము లుదారులగృహముల్
క్షితికి నలంకృతులుగ దీపిత మను నొకపురవరంబు పెంపెసలారుఁ.

గీ. అందుఁ గల వేశ్యవాటిక యిందిరకు ని
వాస మని చెప్పుమా టది వాస్తవంబు
దానఁ గల వెలచానలలో నొకర్తు
నన్నుఁ గన్నది కడు ధన మున్న దాపె. ౩

క. భోగముగృహమే యైనను,భీగము గలపెట్టై పగిదిఁ బృథివీశు"మహల్"
బాగున 'ఫారా'యు 'నగారా' గలమాయిల్లు చొరఁగ రా దలఁతులకున్.

సీ. వీణధనం బనుపేరు మీ ర్వినియుందు
రాపె మాయమ్మఁ గన్నమ్మయమ్మ
ప్రతిశుక్రవార మాపాటకురాల్ దన
యింటనే వీణ వాయించునంట!
అది వినుకోర్కె గాయనగాయనులెకాక
వచ్చువారఁట! కడు హెచ్చుధనికు
లందులోఁ గొందఱే నాపెకుఁ దాంబూల
మిచ్చి చనినఁగాని యెపుడుఁగూడ

గీ. నధమపక్షము వేయిరూప్యమ్ములేని
వారమునకు నుండెడివని సారెకు మన
లమ్మ చెప్పెడి దంచు మాయమ్మ చెప్పె
నితరమగు రాబడులధన మెంత యుండు ! ౫

క. 'ధనలక్ష్మి' యనెడినామము, 'ధన'మని యయి పిణయందుఁ దత్స్వజ్ఞతక
ల్మినిగృహనామము పిణాం, కనిరూఢం బయ్యె నాపెకాలమునందే. ౬

సీ. కాదంబరీ మహాకావ్యమ్మునందు వే
శ్యలపుట్టువులఁగూర్చి కలదు కొంత
అందులో నొకశాఖ అన్నమత్కులం బని
యాపెయే చెప్పెడి దంచు వింటి
నాపె బ్రాహ్మణులకు నవనీపతులకును
దక్క నన్యుల కెప్డు మ్రొక్క దెఱుఁగ
దఁట ! రాజసభ నొక ప్డందుకు శంక రా
నుత్తరమ్మును జెప్పి యొప్పఁజేసె

గీ. నంట ! యీపట్టుదలలెల్ల "నానకట్ట
కవలివారల" కుండెడి వది యటుండె
నాపెయే కారణము మాకు నఖిలమైన
సంపదభ్యుదయమునకు సౌఖ్యమునకు. ౭

క. కలిమిగడుఁ గలిగి యుండియుఁ, గులవృత్తిని విడువరామిఁ గూఁతులవేశ్యా
కులపరిపాటిగనే య, వ్వలు నమ్మయుఁగూడఁ జేయవలసె వడుసగన్.

గీ. నాకుఁ జెల్లెండ్రు లేరు విన్నాణమునకు
నిక్క లక్కలు గలరు తన్నియతి మిగుల
వర్ణనీయము భోగాలవాండ్రె యయ్యు
సాధ్వు మీఁటి చరింప రాయమ్మ లెప్పుడు. ౯

వ. ఒక్కనాఁడు. ౧౦

గీ. సంజపొ్రద్దుదాదాపునఁ జంద్రశాల
యందు మాయక్క లేదొ? యానందముగను
బాడికొనుచుఁ గూర్చుండిరి పసితనంపు
దాన నే నప్పటికి వాంఛ్రదరినె యుంటి. ౧౧

ఉ. గడ్డము మీసముల్ గలఁ దొకానొకఁ డందముఁ జందమున్ గలాఁ
డొడ్డును బొడ్వునుం గలిగి యుండెను లేఁతవయస్సువాఁ డెటో
అడ్డెడి ద్వారపాలకులయాంధ్యమునన్ వెస మేడ యెక్కి బల్
గడ్డుగఁ దోఁచె నాతనివికారము త్రాఁగని త్రాఁగుఁబో తహో! ౧౨

వ. వానిం గని నాయప్పలు. ౧౩

క. భయపడియున్ గులమర్యా
దయగుటఁ గూర్చుండ నొక్కతగుపీఠము చూ
పియుఁ దాంబూల మ్మిచ్చియుఁ
బ్రియమున్ గనఁజేసి రెడఁద వెగటుగ నున్నన్. ౧౪

వ. అప్పుడు మాయక్కలకు "గుమ్మము కావలివాంధ్రు వీని నెందులకు లోనికి రానీవలయు" నని బోఁతెఁడు కోప మ్ముప్పతిల్లుచున్నను నిపుణ మ్ముగా దానినెల్ల మనమ్మునంద నియమించి వాని నెట్లో నయమ్మున నావలికి సాఁగనంపునుపాయమ్ము వెదకుచుండిరి. అప్పటియాఘట్టమ్ము తీరు సవిమర్శమ్ముగ నే నిపుడు వివరింపఁజాల.వివరించుట యంత ప్రస్తుతంబును గాదు. ప్రధానాంశమ్ము వక్కాణించెదఁ. బిమ్మట నాదుర్వినీతుండు. ౧౫

గీ. తనదు చేపెట్టి యున్న రత్నంపువిలువ
హారములు దీసి 'మీ రిందు నేరికొనుఁడు
కావలసినది యేదేనిఁగాని మీకు
నీఁ దలఁచినాఁడ నా కట్టిమోద ముండె. ౧౬

వ. అనిన నప్పుడు మాయప్ప 'లీతఁడు రత్నవర్తకుం డగుటంజేసి ద్వారపా
లకులు రానిచ్చియుందు' రనుకొనిరి. మరల నాదుర్విదగ్ధుండు. ౧౬

ఉ. అందపుటాటబోటులకు నాకర ముజ్జయినీపురమ్ము నే
నందలివాఁడ, వర్తకుఁడ, నందలిబోటులు మీదుకాలిగో
టిం దులఁదూఁగ నేరరు, విటీకుల మెంత ప్రశస్తి కెక్కె మీ
యందము కారణమ్ముగఁ; గృతార్థము నాజననమ్ము నేఁటికిన్. ౧౭

క. సారాసారము లెఱుఁగని, నారులఁ గవఁగూడుకన్న నాణెపుసౌ రొ
ప్పారెడి విన్నాణము గల, నారులఁ గనుఁగొనుటయే మనమ్మున కింపౌ.

సీ. మీమొగమ్ములసౌరు మిసిమి చందురునందు
నరవిందములయందు నరయరాదు
మీనెఱికురులసొం పేనాఁచునందు మ
తేతుమ్మెదలయందు నేను జూడ
మీకనుబొమలతీ రేకార్ముకముల మ
తేనింబపత్రాలఁ గానరాదు
మీపలువరుసకల్మికి దాడిమీబీజ
ములు వజ్రములుగూడఁ దులకు రావు

గీ. మిమ్ము వర్ణించుటకుఁ గవిత్వమ్మునందుఁ
బ్రజ్ఞ గలవాఁడ నేఁ గాను బద్మనయన
లార ! యేదేని యొక్కగేయమ్ము పాడి
అతిథి నగు నన్నుఁ దనియింపుఁ డది యటుండె. ౨౦

గీ. మీకొఱకుఁ బుట్టినట్లున్న మేల్మిరత్న
హారములు ముందు ధరియించి యస్మదీయ
కౌతుక మలంకరించి పై గానమున కు
పక్రమించినచో ముదంపడుదు నేను. ౨౧

ఆ. సిగ్గుపడెదరేల ? చెలులార! నేను బ౹రుండఁగాను మీసఖుండ నదియుఁ
గాక సిగ్గు వేశ్యకాంతల కుండఁగాఁ౹దగదటంచు మీ రెఱుఁగరె?వినరె?

మ. కులముంగూరిచి సంశయింపకుఁడు 'సిక్కుల్' సుప్రసిద్ధుల్ ధరా
స్థలిఁ బేరెక్కినళూరు, లక్కులమునన్ జన్మించినాఁడ, న్ననున్
గలయన్ జూడుఁడు సర్వమున్ దెలియు నాకారమ్ముచే మీకు మీ
తొలినోముల్ ఫలియించె లేకునికి నాతోఁ బొత్తు మీకబ్బునే ? ౨౩

ఆ. తన్నుఁగుఱిచి చెప్పికొన్నచోఁ దప్పిదం౹బన్న దెఱిఁగికూడ నవసరమ్ము
కలిగి చెప్పవలెనెఁ గాకున్న 'నొకయూరిరాజు మాల వేఱుగ్రామమునకు'

వ. అని మఱియును. ౨౫

చ. అవసరమైనయంతవఱ కంగనలార ! వచించితిన్ మహీ
ధవులకుఁగూడ నక్కజ మెదం బొదలించెడి మాగృహంబు వై
భవ మఖిలంబు మీ రరయుభాగ్యము గల్గినయప్డుగాని నేఁ
డెవరు వచింప నేమియగు? నెల్లియె మీకదియెల్లఁ దెల్లమౌ. ౨౬

క. కన్నెఱిక మైన సరియే, కన్నెఱికము గాకయున్నఁ గడుమే లది నే
మున్నగ నెఱవేర్చియె మా౹యున్నపురమ్మునకు మిమ్మునొగిఁగొనిపోదున్

క. మీయిరువురలో నొక్కతె, నాయందుఁ బ్రియంబు సూపిన న్జాలు వెసన్
మీయమ్మకు నెఱిఁగించెద, నాయమ సంతుష్టిఁ జెందునంతయు నిత్తున్.

చ. ఇరువురు నొక్కరూప వయ సించుక భేదము గల్గు నేమొ ? యా
తరతమభావ మేమియును దట్టదహో ! కవ లంచుఁ దోఁచు మీ
యిరువురసృష్టి బ్రహ్మదని యేను దలంపను బమ్మతమ్ముఁ డా
స్మరుఁడు సృజింపనోపు నిది సత్యము సుందరు లిట్టి రుందురే ? ౨౯

వ. అని, సవిలాసంబుగ నావంకం జూచి. ౩౦

క. ఈయెలబాలికయును మరు౹నూయేలయొ నాఁగ నొప్పుచున్నది బాల్యం
బే యైననేమి ? మీ పై౹చేయి యగుంగాని క్రిందిచే యగుబెట్టుల్? ౩౧

క. ఏరాజేంద్రునికొామరితలో? రోవంగడము సేయు లోకోత్తరపు
జ్యారంభముకల్మిని నవతారము లెత్తితిరి మీకతనఁ గృతినైతిన్. ౩౨

క. ఈలీల దీర్ఘతరవాచాలత నున్మత్తుపగిదిఁ జాల నతండు
ద్వేలానురాగుఁ డౌనరుచునాలాపము వెగటు హేయమై కనుపట్టెన్.

ఉ. చిన్నతనంబు మంచియును జెడ్డయు నేరనిదానఁగాని యా
చెన్నఁటికూఁతలన్ వినఁగ సిగ్గది యింతయు నంతగాదు నా
కన్నులనిండ బూరటిలి 'కాంతగ—నందును వేశ్యకాంత గా
నెన్నఁడుగాని పుట్టు టది యేవమ' యం చెదఁ దోఁచె నా కొగిన్. ౩౪

చ. అతఁ డపు డన్నమాట లవి యన్నియుఁ జెప్పఁగరాదు మీరలో!
పితరులవంటివార లెటు ప్రేలుదుఁ బోకిరికూఁత? లెవ్వఁడో
మతిరహితుండు ప్రేలినను మాటికి నాగతిఁ బ్రేలుఁగాక, పై
కత వినుఁ దట్టిదుర్విటునిఁ గానరు మీరు మఱెవ్వ రెక్కడన్. ౩౫

క. మాయక్కలు మార్వలుకక,యే యుండిరి వాని నవల కెటుఁ బోఁదోలన్
గా యుక్తియొండు దోఁపక; నాయెద కడు సంకటమ్మునన్ దిగఁబడియెన్.

గీ. అందగాఁ డయ్యు వయసువాఁ డయ్యుఁ గొంత
చదువు నేర్చిన వాఁడయ్యుఁ జతురుఁడయ్యు
సరసుఁడే యయ్యు స్త్రీఁ గాంచి చాల బేల
యైనచోఁ బూరుషుఁడు హేయుఁ డంగనలకు. ౩౭

వ. అది యటులుండె. ౩౮

ఉ. సిగ్గునువీడి చెప్పెదను జెప్పఁగరాని యసహ్యమేని యే
యెగ్గును సిగ్గులేని యల యేవపుదుర్విటుఁ డోట లేక తా
డగ్గఱి చిన్నయక్కను—గటా! యెటు సెప్పుదుఁ గ్రోధమూర్తియై
దిగ్గన లేచి తిట్ట 'వెలఁదీ! యని కేల్ గబళించెఁ గేలితో. ౩౯

మ. తులువా! బోగముదైనమాత్రముననే తుందు డ్కిటుల్ కూడునే?
కలవే? యెయ్యెడ నిట్టిదుండగములున్ గామాతురు ల్గారె! యా

యిలలో నెందును, దానిఁ దీర్చికొనుచొ ప్రీతినే యుండునే ?
తలతిక్క న్వాడిపింతుఁ బో మ్మవలికిన్ దప్పిద్ది నైరించితిన్. ౪౦

వ. అట్లు నోనాడి సీత్కారించుటయు నాకూర్తుండు. ౪౧

ఉ. ఇంతకు నైఁచుదాన వీఁక నెంతకు నైఁపవు నీవు, మున్ను నే
నెంత చటూక్తులం బలికి యెట్లు యతించిన నొక్కపల్కురా
దింతటనైన వచ్చె నను నేమననే మది నాకు మిక్కిలిన్
సంతస మిచ్చెఁ బ్రోడలగు చానల చైదము తే నెఱుంగనే ? ౪౨

వ. అని మఱియు నాసిగ్గుమాలిన తుంటరి పగ్గెగలవాఁడుంబోలె నెగ్గెఱుంగక
వెడనవ్వు నవ్వుచు. ౪౩

మ. కులహీనుండను గానటంచు మొదటన్ గొంకేల ? నేఁ జెప్పితిన్
వలపింపందగువాని నన్ను వృథగా వారాంగనారత్నమౌ
చెలివయ్యున్ నిరసించెదేల? సిరి రాఁ జేసేఁత వారింతురే ?
లలనా ! బేలవె ? తూలఁ బల్కఁదగునే ? లావణ్యగర్వమ్మునన్ ? ౪౪

వ. అని యంతతోఁగూడ విరమింపక మఱియును. ౪౫

ఉ. అంతయు నీతనూవిలసనాతిశయంబు రసోత్కటంబు నీ
చెంత నిటుల్ నుతింతునని చిత్తమునందు దలంతువేమొ ? శ్రీ
కాంతునిసాక్షి నీదగుమొగం బరపింద మటుండనిమ్ము ము
క్కెంతపసందుగా నచట నిం పెసలారునొ ! నీ వెఱుంగుదే ? ౪౬

ఉ. 'ముక్కున నుండుఁ గోప' మని మున్ గఱువల్ వచియింతు రిప్పు డా
ఫక్కి సమస్తమున్ దెలియవచ్చెను నీపొలయల్కకల్మి నే
నొక్కటి విన్నుఁ గోరెద మఱొండు వచింపక కోర్కెఁ దీర్పు నీ
ముక్కు నొసంగు మద్ది గొని పోయెద నిప్పుడుఁ బూజఁజేసెదన్. ౪౭

ఉ. ఎక్కడ లేనియంద మది యెట్లొకచో గుడిగూర్పనేర్చె నా
టక్కరిబమ్మ, ముక్కు నెటు డాఁచెదు సోగగఁ దొంగి చూచు నీ

ముక్కఱకన్న నాయిడెడిముక్కఱ యెక్కుడుసౌరు గూర్చు నా
యక్కఱకేమి ? దీనిఁ గొను మం చొక ముక్కఱ దీసి పెల్చనన్.౪౮

క. ముక్కున కలంకరింపఁగ
నెక్కుడు తమకమున నంటునేద్తెఱ మా పె
ద్దక్క నివారింపఁగఁ బెద
వొక్కించుక యెత్తఁబోయియును మ్రాన్పడియెన్. ౪౯

వ. నా కెక్కడలేని క్రోధశోకలజ్జాభయానకభావమ్ము లొక్కుమ్మడిఁ గ్ర
క్కున నంతరంగం బెక్కుటయు. ౫౦

గీ. చిన్నదాననె యయ్యు నేఁ జేతికొలఁదిఁ
బట్టి త్రోసితిఁ 'బాటిపైఁ బందికొక్కు'
సామెతకు లక్ష్యమై, వాఁడు చదికిలఁబడి
యొరగినట్లు నటించెఁ దక్కరితనాన. ౫౧

ఆ. అట్టు లొరగి లేచి యల్లన నన్ను వీక్షించి బుజ్జగించి మంచిరతన
ములను బొదిగియున్న వలయమ్ముల నొసంగఁబోయె నేను వాని ముట్ట
[నైతి.

గీ. చిన్నతనమయ్యు నాకప్డు సిగ్గొకండె
కాక యూహింపఁగారాని కారుమబ్బు
లెన్నియో యుల్లమును గ్రమ్మి యెట్టియెట్టి
యేవమో ! పుట్టఁజేసె ని ప్డెఱుకలేదు. ౫౩

గీ. దేని వాఁ డిట్లు చేసె నద్దానిమొగము
కాళికాదేవికన్న మిక్కటపుసెగలఁ
బొగులుచును సారెసారె నిప్పుకలు గురియు
చుండెఁ గన్నులవెంట నీ రొల్కుచుండె. ౫౪

క. శృంగారరసము హాస్యం
బుం గాక తదన్యరససమూహం బెల్లన్

దొంగారి యవతరించిన
భంగిం గనుపట్టె నప్ప భగ్నహృదయమై. ౫౫

వ. అంత నాదుర్విదగ్ధుండు మాపెదయప్పదరి కరిగి సానునయమ్ముగ వి
ట్లను. ౫౬

చ. చెలియలి నాదరించి నినుఁ జేకొన కూర కనాదరింతు నం
చలుగకు నాకు నీయెడల నాదర మింతయు నంతగాదు నీ
విలసన మేమి? తక్కువ కె? వేఁడుఖదాన? పరిగ్రహింతు మి
మ్ముల నిదె యిర్వురన్ గలసి పోదము మాపురి కింత నంతటన్. ౫౭

ఆ. అనుచు సిగ్గుమాలి యధికప్రసంగమ్ము
చేసికొనుచు నాపెచేయి ముద్దు
పెట్టుకొనఁ గడంగఁ బెళ్ళున నొకచెంప
పెట్టు వెట్టె నాపె కెట్టిచొరవొ? ౫౮

గీ. అపుడు నాదునుల్లమ్మునయందుఁ గలుగు
మోద మింతింతయని చెప్పరాదు గాని
ఖేదమునుగూడ వెనువెంటఁ బాదుకొనఁగఁ
దొడఁగె నద్దానిఁ జెప్పికొందును వినుండు. ౫౯

క. ఇది సంపన్నగృహస్థుల
సదనమె యగునే నొకండు చరచర రాఁగాఁ
బదివేలగుండె లుండెనె ?
మదిరాగృహ మట్టి దయ్యె మాగృహ మకటా! ౬౦

క. ఇంతకు మించిన యేవపు
టింతులగృహములును గలవ యిల సభ్యత యా
యింతుల కుండ దదియు నీ
యింతుల కుండియును నిట్టిహీనత తగునే ? ౬౧

క. ఏరాజసభలఁగానీ, వారాంగన లేనియట్లు వర్ణింపరు వి
ద్యారాధకులు గవీంద్రులు, స్వారాజ్యమునందుఁ గలరు వారవధూటుల్.

గీ. ఎచట నుండిన నేమయ్యె నీకులంబు
నందు స్త్రీ యాజమాన్యము నంది పురుష
లుండినను లేవిచందాన నుండుకతన
నెల్లవారికి నలుసయ్యె నీగృహములు. ౬౩

క. అల్లరి జరిగిన వేశ్యల, యిల్లనుకారణము మున్నె యేర్పడుకతనన్
జల్లఁగ నిరుగుఁబొరుగువా, రెల్లరుఁ గలిగించుకొనకయేగుదురు వెనన్.

ఆ. అంతదాఁక నెందు కస్మద్దనముఁ దిను
చున్నవార లింటి కొక్కయెడరు
గలుగ నైఁప రట్టిగండంద్రు "గుండాలుఁ"
గూడ రారు "వృత్తిగౌడవ" యనుచు. ౬౫

శా. ఆకారాదులు చూచికాదె ? మొదటన్ ద్వారస్థు లీ"పోకిరిన్"
వీఁకన్ లోవికి రా మటేమనరు దుర్వేశ్యాకులం బెంత స
ద్దీకంబై మరియాదగా మెలఁగినన్ దృష్టాత్ము లెట్టెట్టులో
రాకుండన్ మొగి నాఁగుబెట్టు ? వృథ "షారాలు న్నగారాలు"నున్.

క. "షారా" లున్నవొ ? లేక "న.
గారాలే" యున్నవియొ ? యొకండు చనునె ? య
ప్పాఱులు మొదలగు వారల
ద్వారమ్ములుగడచి తుదకుఁ ద్రాగినయపుడున్. ౬౭

క. వాపిన్బలె నౌకన్బలె, నేపుగఁ బూచినలతబలె నెల్లిద మగుచున్
రూపాజీవ గనంబడుఁ, బాపపుజన్మంబు వారవనితల దకటా ? ౬౮

వ. అది యట్లుండె. ౬౯

గీ. అక్క కెక్కడిసాహసం బపుడు వచ్చెఁ
క్షేతికొలఁది నక్కావలుచెంపఁ గొట్టె

నదియు నొకగౌరవమ్ముగా నతఁడు తలఁచెఁ
గాముకునికన్న హీనుండు గానఁబడఁడు. ౨౦

ఉ. సిగ్గగు నాకుఁ జెప్పుటకు; "సిక్కటు దెబ్బను దుల్పఱించి" యో
దిగ్గజగామినీ ? కడు నుతించెద నీకరసాహసంబు; నే
యెగ్గును నీకరాబ్జమున కిక్కతసన్ ఘటియింపకుండఁ గే
లొగ్గి మదిష్టదైవముల నుల్లమునన్ దురపిల్లి మ్రొక్కెదన్. ౨౧

క. అని మఱియు మఱియు నెదియో,
తనవెకలితనంబు చూపుతఱి మాయక్కల్
వినిపించుకొన నుపాయము
మనమున యోజించుచుండ మఱి యతఁ డనియెన్. ౨౨

ఉ. మక్కువ నాదరించినను మంచిది కోరిన వెల్ల నిత్తు నే
"సిక్కు" కులీనుఁడన్ మొదటఁ జెప్పితి నూరక పోను నిక్క మి
మ్మెక్కను గోసి పట్టుకొనిపోయెద, నం, చిఁక నాదుతప్పిదం
బెక్కడ ? వారకామినుల కేమిటి కీమిడిమేలపున్ వగల్. ౨౩

వ. అని మొలనున్న చిన్నసురకత్తిని జూపి జడిపించునంత. ౨౪

క. మనమున భీతిలి "ఫారా" జనులన్ మాయక్క పిలిచెఁ జయ్యన వారల్
చనుదెంచునంతనే మా, చినయక్కకు ముక్కుఁ గోసెఁ జేసురకత్తిన్.

ఆ. పూర్తి దెగకమున్న యార్తధ్వనికి నుల్కి
ద్వారభటులు వచ్చి వానిఁ బట్టి
కొనఁగ వారిఁ దప్పికొని యేగె నమ్మదాం
ధుండు పిదపఁగూడ దొరక లేదు. ౨౫

ఆ. ఇంటియెదుటి మేడనే యుండె శస్త్రవై
ద్యమ్మ నేర్చికొను కళార్థి యొక్క
విప్రనందనుండు వేవేగఁ జనుదెంచి
తగుచికిత్స చేసి సుగము నించె. ౨౬

వ. ఆయీ రసాభాసంబు సర్వంబును నాకు నొజ్జయై చేసినయుపకారంబు
మీకు గోచరించెడిదే యైనను గొండొక విన్నవింతు. ౨౯

క. పదకొండేఁడుల ప్రాయము, పొదలెడి నాకపుడు విఱిగె బుద్ధి వెలకొలం
బెదకు న్నచ్చనియేవం, బుదయించె మనమ్మునంద యొదిగితి నెట్లో.

గీ. ఎవరితోఁ జెప్పికొందు నిల్లెల్లఁదన్మ
యంబ విద్దెలు నవియ మర్యాద లవియ
తుదకుఁ జిత్తరువులుఁగూడఁ దదనుగుణక
థాప్రధానమ్ము లయ్యె మాధామమందు. ౩౦

గీ. గాన మభినయ మప్పటికేను గొంత
అభ్యసించితి నవ్వానియందు నైత
మేవ ముదయించెఁ జెప్పెడిదేమి ? తుదకు
విల్లు ముల్లుగఁ గన్పట్టె నెట్లు నైఁతు. ౩౧

ఉ. ఎందుకుఁ బుట్టఁజేయవలె నీచెడువంగడమందు నన్ను గో
విందః పరాత్పరాః యొరులు వీసము గౌరవ మీని నీచునిం
తిం దెగి చూడలేఁ డెవఁడు నేతఁ్రము లల్లనవిప్పి; వాఁడు మా
చందనగంధులన్ గని బజారున నైతము హాస్య మాడెడిన్. ౩౨

క. "ఏమే ? ఓసీ" యని మా, లేమలఁ బిలువంగనేర్చు లేకిసయిత మే
బాముసఁ జేసిన పాపమొ ?, భూమీశునిసానికేని "ముండ" బిరుదమే.

ఆ. పురుషులందు గానమునఁ బ్రజ్ఞ గలవాండ్రు
గలరు మాకతాన నలుసులట్ల
కనుటకాని లేదు గౌరవం బెచ్చోట
నేకవచనమె గతి యెట్టిఁడేని. ౩౪

క. ఇంతకుఁ గారణ మేమన ? నింతులవర్తనమె దఁ్రవ్య మెంతబ్బిన రో
కాంతలదురవస్థకు నెద, సంతాపము గాంచనట్టి సజ్జనుఁడున్నే ? ౩౫

గీ. ఎన్నియో నీచవృత్తు లీయిలను గలవు
గాని యీవృత్తివంటివి గావు ధ్రువము
కూలినాలి నొనర్చెడిమాలదాని
కున్నపాటి గౌరవమును సున్న మాకు. ౭౬

వ. అని పరిపరివిధమ్ముల నాలో నేనె చింతించుచు నీదుర్దోషమ్మువలన
నెట్లు విముక్తి గల్గు నని విచారించుచు. ౭౭

క. భగవంతునిపైఁ జిత్తము,
దగులుకతన నాఁడు మొదలు తత్కీర్తనలో
ప్పగఁబాడికొందుఁ బ్రహ్లా
దుగుణమ్ములు చదివికొందు దురితహరమ్ముల్. ౭౮

ఆ. ఎంత స్వల్పమైనదే యయ్యు నక్షర
జ్ఞాన మున్నకతనఁ గాలయాప
నంబు భాగవతమునంజేసి నాకయ్యె
విద్యకన్న లేదు వేలు పొందు. ౭౯

క. నాదువిరక్తికిఁ గారణ, మేదియొ ? యని తల్లి గాని యితరులు గానీ
యాదట నడిగిన వారల, కే దొరకఁగనీను హృదయ మేమాత్రమ్మున్.

క. పలుపాపము లొనరించిన
ఫలమున నిక్కాలమునందుఁబడితిని నన్నున్
దొలఁగింపుము నీపాద
మ్ములె గతియని వేడికొందు మురసంహరునిన్. ౮౦

గీ. ఇంటిమర్యాదలందు నే నెందుఁ బాలు
గొనక వెఱిదానిమాదిరి గుట్టుగలిగి
యెట్లొ గడపితి భగవంతుఁడే యెఱుంగు
నెట్లు గడచెనో ? యక్కాల మే నెఱుంగ. ౮౧

ఆ. అంత నీవు వచ్చె నది ముదావహమయ్యె
నంబ కస్మదీయమగు విరక్తి
కతన హృదయతాపకారణంబై తోఁచె
జరిపె నుత్సవము విచారపడుచు. ౯౩

క. సోదెలకుఁ బంపి కనుపడు, సాధువులకు మ్రొక్కఁజేసి జపతపముల నా
సాదించి నన్నుఁగూరిచి, నాదుజనని క్లేశపడి కనదు కారణమున్. ౯౪

క. నాకై ధనికులబిడ్డలు, రాకొమరులు సారెసారె రాఁదొడఁగిరి నా
వ్యాకులత వారెఱుంగరు, చీకాకుగనుండు నాదుచిత్త మెచటనో! ౯౫

క. కులవృత్తియందు కాదీ,యిలఁ గలయేవృత్తియందు నిష్టము నాకున్
దొలఁగి విరక్తంబై యెం,దులకుం గొఱగాక మన సెదోగతి నుందున్

వ. అట్టియెడ నాకై వచ్చినయువకులు. ౯౭

గీ. పలుకరింతురు నే మాఱు వలుకకున్నఁ
బంపుచుందు రేవేవియో పసదనమ్ము
లవియు 'భగవదర్పణ' మని యాత్మ నెంచి
అంబ కర్పింతు దేవాలయమున కరిగి. ౯౮

వ. మఱియు వారు నాకై చనుదెంచినప్పుడు. ౯౯

ఉ. "మోసపువృత్తి వీండ్ర దని మున్నుగ మీర లెఱుంగరో? రసా
భాస మటం చెఱుంగరో? స్వభార్యలకన్న మఱిక్కడేమి సం
తోసముఁ బ్రామికొందురో? వినోదమువెంట విషాద ముండు, లే
దే? సుఖ మిందుఁ గ్రొత్త" దని యేను వచింపఁ దలంచి మానుదున్.

క. త్రాగుంబోతులు వేశ్యా,భోగులు తద్దోషములు సమూల మెఱిఁగి యు
ద్యోగింతురు వారల నెవ,రాఁగఁగలరు రిక్తదశయె యాఁగఁగవలయున్

వ. అది యట్లుండె. ౧౦౨

క. నా కిష్టదైవతం బల,శ్రీకృష్ణుఁడె యయ్యె నతనిచెలియలు సాక్షా
చ్ఛ్రీకాళికాంబపై మన, మేకాగ్రముగాఁగ నిల్పు నేకారణమో? ౧౦౩

ఆ. ఎంతసేపు నాకు నింట శృంగారమే, చదువు దానఁజేసి సత్యభామ
కల్ల కృష్ణునకును నంతఃపురమ్మున, జరుగుకతలవినికిఁ జాలఁ గలిగె.

గీ. కృష్ణుతోఁబుట్టువై పుట్టి కెరలి కంసు
చేతఁ జిక్కియు వాని వంచించి యాక
సమున నిలిచినయారూపు స్వాంతమందు
నాకుఁ గనుపట్టుచుండు ననారతంబు. ౧౦౫

క. స్త్రీ నగుటచేతనో ? యే,మో? నే నిదమిద్ధ మనుచు నూహింపఁగలే
నోనాయనలారా? నా. మానస మాకాశిమీఁద మసలుఁ దఱచుగన్.

క. ఇరువురు నొకతేజమె యను
పరిచితియును గలిగె మదిని; బాండిత్యము లే
దెఱుక గలవార లియ్యది
సరి యందురొ ? అనరొ ? తెలియఁజాలని యబలన్. ౧౦౬

క. ఏరాతిబొమ్మ కనుపడ, నారాతికె మ్రొక్కుదాన నంతట నొకతే
జే రాజిలు ననునమ్మిక, యేమన్ జెప్పకయె కల్గె నెట్లో నాకున్. ౧౦౭

గీ. దేవునకుఁ బేరు వెట్టఁగ దేవుఁడు మన
బిడ్డఁడా ? తండ్రిగాని యేపేరనైనఁ
బిలుచుకోవచ్చుఁ దల్లిగాఁ దలఁపవచ్చు
ననుచు నేమేమొ ? యోచింతు నాత్మ నేను. ౧౦౮

క. స్త్రీ లెల్లరు స్త్రీయని పురు
షాళియుఁ బురుషుఁడని కొలువనగుఁ బరమాత్మన్
స్త్రీలక్షణపుంలక్షణ
జాలం బట లేదు; లేవు షండగుణంబుల్. ౧౦౯

వ. ఇయ్యది మహావిషయంబు దీని నిర్ణయించుటకు నాబోటి యలంతి నె
లంతలు వలంతులు గారు : మనుష్యజన్మం బెత్తుటకు ముఖ్యఫలం బి
ద్దాని నెఱుంగుటతప్ప నన్యంబు లేదు. ౧౧౦

గీ. ఏమహాత్ములనే నాశ్రయించి జన్మ
మునకు సాఫల్య మార్జించుకొను తలంపు
వొడమి యిలువీడి వచ్చితిఁ; బుణ్యవశతఁ
గలిగె మీదర్శనము మునుల్ ఘనులు మీరు. ౧౧౨

వ. నావుడు వెడనవ్వు నవ్వి రా జిట్లనియె. ౧౧౩

క. నిను దేవతగా మే మె,ట్లనుకొంటిమొ ? మమ్ము నీవు నట్లే మునులం
చనుకొంటివి నీచరితము, గన నీచచరితము గాదు కడు ఘన మబలా !

గీ. అనయమున కాలవాల మైనట్టి వేశ్య
కులమునందు గంజాతరుకోటియందుఁ
బుట్టువందిన తులసి నాఁ బొడమి తీవు;
కలదు నీయందు దేవతాకళ సుశీల ! ౧౧౪

వ. నీ వింతకు ము న్నేపేరితోఁ బిలువఁ బడుచుండినను మే మింక నిన్ను
సుశీల యనుపేరునఁ బిల్చెదము. నీ యిప్పటిప్రవర్తనంబువలన నీకు
జన్మాంతరప్రాప్తి యైనట్లు తోఁచుటంజేసి దాని కనుగుణం బగు నామాం
తరంబును నావశ్యకంబ యని వెండియు ని ట్లనె. ౧౧౫

క. నీపూర్వజన్మచరితం, బేపండితులేని యెఱిఁగిరేనియు వా రి
ప్డీపావనశీలత్వ,వ్యాపృతికిఁ గతంబు చెప్ప వలఁతులు సుముఖీ ! ౧౧౬

గీ. ఏను బృథివీశ్వరుండనై యేలి యేలి
తుదకు వైరాగ్యకారణం బొదవి యిట్లు
వచ్చితి వనంబున; కితండు వైశ్యసత్త
ముండు కోటీశ్వరుండు వృద్ధుండు ఘనుఁడు. ౧౧౭

క. కొడుకులఁ గూఁతుల విరివిగఁ
బడసియు సంసారమునకు భయపడి యీవృ
ద్ధుఁడు వనమున కేతెంచిన
సడి యీతఁడు చెప్పు నవ్వచనములఁ దోఁచున్. ౧౧౮

గీ. కడుఁ బ్రియోజకుఁ డీతండు ఘనుఁడె కాని
వృద్ధుఁ డయ్యు నహంకృతి వీడలేక
తనదునాజ్ఞనుబట్టియే తనయు లోలి
నడువఁగా నెంచె నప్లేరు నగుతు రబల ? ౧౨౦

వ. వృద్ధులలక్షణంబులు పెక్కులు; వానిలోఁ బైలక్షణంబును నొక్కటి.

మత్తకోకిల. చూపు తగ్గుట, దేహవార్ధ్యము సున్నయౌట, పొరింబొరిం
గోప మబ్బుట, చిన్నికుఱ్ఱలకున్ హితంబులు సెప్పుటల్
'శ్రీపతీ! కరుణాకరా! కృపఁజేసి ప్రోవర!' యంచు న
య్యాపదుద్ధరు వేఁడుకొంటయు నబ్బు వృద్ధత గూరినన్. ౧౨౨

ఆ. కొన్ని లక్షణములు గొనియాడఁదగి యుండుఁ
గొన్ని లక్షణములు గుత్సితములు
వృద్ధులకు ఘటించు; వేయి సుగుణములఁ
జెఱుచు లోభగుణము చేరెనేని. ౧౨౩

చ. ఎవనికొతప్ప లోభగుణ మేర్పడుఁ బూర్తిగ వార్ధకాన, దా
నివికృతు లేమి సెప్పుదు మనీషులు కబ్బములన్ లిఖించి, రా
సవముబలె న్నరున్ మిగుల సత్పథదూరు నొనర్చు లోభమున్
దవిలినవృద్ధుకస్తి యల్లదైవమ తా నెఱుఁగున్ గుమారికా! ౧౨౪

క. అరివర్గమ్మునఁ గామము, తఱచుగఁ గొన్నాళ్ళు వేపి తప్పికొనెడి నీ
దురితపులోభము తుదకున్, శరీరమును వీడుదాఁకఁ జావదు చంపున్.

క. తుద కిది పొట్టకుఁ దినుటయు
నది యొకదుర్వ్యయమ యనెడియంతకుఁ దెచ్చున్
ముదుసలులయంద తఱచి
య్యది వాస మొనర్చు దీని నడఁప వశంబే ? ౧౨౬

క. ఇది యొక్కటి తొలఁగిన నిం
కెదియును వృద్ధాత్మ నంత హింసింపదు తాం

బదితొమ్మిదిపా శ్శియ్యది
వదలదు నాయనుభవంబు వాక్రుత్తుఁ జెలీ ! ౧౨౭

క. స్వయమార్జకులు ప్రయోజకు
ల యెడల నిది యెక్కుడుగ నొలయు నీవృద్ధుం
డయథార్థమ్మొ ? యథార్థమొ ?
దయ నీయావస్థ యిక్కతనఁ గవియుంచున్. ౧౨౮

వ. ఇంకను వృద్ధులలక్షణమ్ములు మఱియుం గొన్ని గలవు. ౧౨౯

క. తనమునుపొనరించిన య
ప్పనులే తనయు లొనరింప 'వల'దని వారిం
చను విననియెడలఁ గోప
మ్మున కెరయై మండిపడును ముదుసలి పెలుచన్. ౧౩౦

వ. ఇట్లు నొడువుచున్న వృద్ధనృపతిమాటల కడ్డమె వైశ్యుం డిట్లను. ౧౩౧

క. పడరానిపాట్లు వడి యెక్కుడుధన మార్జించి తుదకుఁ గోటికిఁ బడగె
త్తుడు దాని నిలుప నెంచరు, కొడుకులు, నేనెఁచుటెట్లు కువలయనాథా?

క. ఉన్నది సర్వము వ్యయమై, చన్నపిదప వీంద్ర కెట్లు సంసారము సం
పన్నమగు? బ్రతికిచెడుచో, వన్నరుగతి చెప్పవలెనె? అది నరకమ యౌ

క. చెడి బ్రిదుకువార లెం దగు
పడుదురు వారలకు లేదు భయము; బ్రతికి యె
వ్వఁడు చెడు వాఁడు వడెడి తుం
దుడు కది వివరింప వశమె ? దుఃఖద మగుటన్. ౧౩౪

వ. ఇవ్విధమ్మునఁ దనకున్న భయమ్ము నంతరంగంబు విప్పి చెప్పు నవ్వై
శ్యవృద్ధునకు నవ్వేశ్యబాలిక యిట్లనియె. ౧౩౫

చ. వయసున జ్ఞానమందు మఱి వైభవమందును నన్యమందు నో
సుమశ ! భవాదృశున్ వెదకి చూచుట దుర్ఘట మిట్టిమేటికిన్

భయము జనింపఁ జేసిన యభాగ్యపులోభగుణమ్ముకన్న దు
ర్నయమగు శత్రు వెందుఁ గనరా దరిషట్కమునందు సన్మణీ!
క. మీవంటివారి కేదియు, నావంటిది చెప్పరామి నామన మెఱుఁగున్
గోవిదురాలను నేఁ గా, నో వైశ్యోత్తంస! యడుగుచుంటిని మిమ్మున్.
చ. తల నెరసె న్మొగంబు ముడుతల్ వడెఁ గంఠమునందు గద్గద
స్ఖలనము దోఁచుచున్నయది కాయముఁ బానెడియమ్మహార్త మో
యలఘుమతీ! పదేఁడులకు నావలనుండదు మీకు నేల? యీ
వలపు ధనమ్ముపై నఖిలవాంఛలు దీఱిన శాంతమూర్తికిన్. ౧౩౭
క. మీకొడుకులు మీయార్జన, చేకొలఁది వ్యయింత్రుగాక చెడిపోదురె? కా
రే కోమటిబిడ్డలు? ఛీ,కాకు వడఁగనేల? విడువుఁ డాచింత మదిన్.
క. సకలవ్యాపారములును,సుకముగఁ గొమరులకు విడిచి చూచుచుఁ బరమే
శుకటాక్షం బర్థించుచు, నిఁక వార్ధక్యమ్ము గడపుఁ డిహమే దివమౌ.
వ. నావుడు నావృద్ధుండు. ౧౪౧
మ. వ్యవహారమ్ములలోఁ దెలుంగరు ననున్ బ్రశ్నించి కన్గోరు చా
ల విశేషమ్ములు నేర్వఁగా వలయు వాలాయమ్ము వాణిజ్య మం
దవివేకుల్ ప్రతివాని నమ్మెదురు ముప్పౌఁ గాదె? అట్లైన; న
న్నెవఁడో శత్రువు వీఁ డటన్న మదితో నీక్షింత్రదే పాపమో? ౧౪౨
గీ. ఏను వారలనేమమే యెపుడు హృదయ
మందు జపియింతుఁ బరమాత్ముఁ డదియె నాకు
నన్నుఁ బెనుభూతమున్బలె నాదుకొమరు
లరయుదురు కారణంబు నా కెఱుకపడదు. ౧౪౩
ఉ. పెత్తన మేను వాంఛ్రపయిఁ బెట్టినయంతన యేదిగూడఁ గిం
చిత్తును నాకుఁ జెప్పకయ చేయుదు రే నది 'కాదు కూడ' దం
చుత్తలపాటుతో 'నిది యటుండెడి నయ్యది యిట్టులుండు' నం
చెత్తి వచింపఁ బోవ విన రేమనుకోఁదగు నోతలోదరీ! ౧౪౪

క. మావాంద్రవిశృంఖలతకు, నేవం బుదయించి 'యెందు కీబెడఁద'యటం
చే వైరాగ్యము గొని యిటు, లీవని కేతెంచి కంటి నీనృపు నిచటన్.

క. ఈయనకును నాకున్బలె 'సీ'యని సంసారమందుఁ జిత్తు ముడిగె నీ
వో? యీమావలెఁ గావ,య్యో! యెలప్రాయంపుదాన వుచితమె? యిది

శా. నీయం దెంతటి యాస వెట్టుకొనెనో? నీతల్లి; ని న్నెప్పుడున్ [యున్
బాయంజాలని సోదరీమణుల నంబంగూడ వంచించి యీ
కోయల్ బోయలు నుండు దుర్గమఘనక్రోడ ప్రభూతాగమ
చ్ఛాయామేయసదానిశీథమున కాసం జేతువే ? కానకున్, ౧౮౭

ఉ. నీరజనేత్రి ! యెయ్యదియొ నీచపుదోసము నీకులమ్మునం
దారసి నీమనమ్మున కనాదర మొయ్యనఁ గల్గుచే ధ్రువం
బే రొనరించు వృత్తియెడ నీదృశదోషము కాక యున్న దై
వాఱక యున్నె ? దోస మొకపాటిది, యంతనె వీడికొందురే ?

ఉ. ఈయన రాజు; భూప్రజల నేలెడి రేఖ గలాఁడు ధర్మమున్
బాయక పున్నెము న్నిలిపి పాపము నాఁగెడివాఁడు మాన్యమౌ
నీయనఘాత్మవృత్తి యని యెంచెదమేనియు దాన నెన్నియో
రోయక తీరనట్టి యవరోధము లుండు నెఱుంగ వేమొకో ? ౧౮౯

ఉ. ఎందఱుగొంతుకల్ దెగెనొ ? యెందఱుకొంపలు గూలెనో ? మ ఱిం
కెందఱియప్పుపత్రముల నెంద అపాహృతిఁ జేయఁ గల్గిరో ?
చిందఱవందతై యితఁడు చేయుప్రభుత్వమునందు; న్యాయముల్
గందురె ? తీర్పరుల్ శఠులు కన్నులఁ గారముఁ గొట్టి నెట్టరే ?

గీ. ఇతఁడు ధర్మాత్ముఁ డగుఁగాక యెల్లరాచ
కార్యములఁ జూడనేర్చు నొక్కండె యెట్లు
ప్రతినిధులు సేయునట్టి దౌర్మార్గ్య మెట్లు
తప్పుఁ దప్పనిచో నెట్లు తప్పు దొసఁగు ? ౧౯౧

క. పరిపరివిధములఁ బండితు
లరసియె వచియించి యుందు రటు 'రాజ్యాంతే
నరకం ధ్రువ' మని దీనన్
దురితము లేకున్నచో బుధు ల్వాచకుదురే ? ౧౫౨

గీ. విష్ణునంశానఁ బుట్టిన వీరమూర్తిఁ
దక్క నితరుల కంకని ధారుణీపరి
పాలనమె నరకమ్మన కాలవాల
మైనఁ దక్కువృత్తుల దొసఁ గడుగవలెనె ? ౧౫౩

వ. అది విని తద్వాక్యముల కుపోద్బలకమ్ముగా జేఁ డి ట్లనియె. ౧౫౪

ఉ. ఎన్నియొ పాతకమ్ము లెవఁ డేనొనరించునొ ? వాఁడె రాజుగా
నెన్నఁబడున్ ధ్రువం బిదియు నే నఖిలమ్ము నెఱుంగుదున్ గటా !
కన్నులు గల్గి గ్రుడ్డియును గాళులు గల్గియుఁ గుంటియౌ నరుం
డన్న ! నృపాలుఁడే, యితరు లట్టిరు గారు దరిద్రులేనియున్. ౧౫౫

చ. స్వయముగ వస్త్రధారణము నైతము సల్పఁగనీరు 'నౌకరుల్'
రయమున వచ్చి కట్టుదురు 'రాజు స్వతంత్రుఁ' డటండ్రు గాని త
ద్దయు మఱి రాజుకన్నఁ బరతంత్రుఁడు వే ఱొకరుండు లేఁడు ని
శ్చయము; స్వతంత్రుఁ డన్నపుడు జ్ఞానియె, ఆశకు నంత ముందునే ?

మ. ఒకయూ రేలిన నేలఁగావలయు నింకొండూరు భార్యాసహా
స్రక మున్నన్ గణికాంగనాజనసహస్రం బున్న నన్యాంగనా
సుకపోలమ్ములమీఁదియాస హృదయక్షోభానకున్ మూలమై
యెకసక్కెమ్మొనరించు నేమిటి కహో ! యీచ్ఛక్రప్రభుత్వోన్నతుల్.

చ. వలదు విరక్తిపూర్తిగ 'భవం బిది బుద్బుదతుల్య' మింత చం
చలమగు పుట్టు వందుటయె చాలు, వృథా దురితప్రచారముల్
సలుపుటకూడ నేల ? యని స్వాంతమునం దలపోయువ్యక్తి వం
దల మఱి వేల లక్షలఁ గనంబడఁ డెయ్యెడ తేండ్లపట్టికన్. ౧౫౮

ఆ. తేండ్లదాఁక నేల ? రేపు మాపును బొట్ట
నిండ నన్న ముండునేని యట్టి
వాండ్రఁ బట్టికొనఁగఁ బగ్గంబు లుండునే ?
మదముఁ బోలుశత్రు వెదియు లేదు. ౧౫౯

క. సంగీతం బెఱుఁగని యొక,వెంగలి గాయకునిఁ జేయు వెఱ్ఱి గొలిపి, సి
గ్గుం గెంటి పాఱఁదోలున్, శృంగారి నొనర్చు సెట్టియెడ్డెన్ మడ్డిన్.

క. ఏమాత్రము సిరిగల్గిన, నీమాద్రివికారచేష్ట లెసఁగించు మదం
బోమఁగఁ జేసెడి రాజ్య,శ్రీమాట వచింప నేల? చెడు మతి దానన్.

మ. వనితాచందన స్రగ్గజాశ్వ విపులప్రాసాద సంపత్తిఁ గై
కొని నాకుం బ్రతి లే' రటంచు వయసుం గోల్పోయి వార్ధక్యముల్
గనినప్డేనియుఁ గొంద ఱుత్తమగతిన్ గాంక్షింతు రాభాగ్య మె
వ్వనికో తక్క 'నభస్సుమం' బనియె నే వాక్రుత్తు మాతేండ్లకున్.

ఉ. ఇంద్రునియంతవేల్పునకు నెందు 'సుఖం బగుపట్టు' దంచు మౌ
నీంద్రులు పల్క, రమ్మునుల కింద్రపదంబు తృణమ్ము గాఁగఁ దోఁ
చుం ద్రిదశేంద్రుఁ 'డిత్తు' ననుచున్ బ్రతిమాలిన 'వద్దు పొమ్మ'టం
చంద్రు మహానుభావు, లహహా ! మఱి వారి ''విరక్తు'' లెట్టివో ?

ఉ. ఒక్కరు చెప్పనేల ? జగ మున్నది బోధ యొనర్చు నెంతయో
చక్కఁగ; దీనివంటి గురుసత్తము లెవ్వ రెఱుంగ నేర్చుచో
నక్కట ! లోకవృత్తముల నారసికూడ జడాత్మ లేటికో
యిక్కటుసంసృతిన్ ముఱిగి యేగతి గానరు వ్యర్థజన్ములై. ౧౬౪

వ. అని మఱియును. ౧౬౫

ఉ. వృత్తులయందు క్షత్రియులవృత్తి కడున్ ఘనవృత్తిగాఁ బురా
వేత్తలు వల్కుచుందురు పవిత్రత దీన నొకింత లేదు దు
ర్వృత్తికి మూలకంద మగుహింస ప్రధానము క్షత్రవృత్తి కీ
వృత్తిని జ్ఞాను లెవ్వరు నొకింతయు నొప్పరు వైశ్యసత్తమా !

వ. నావుడు వృద్ధవైశ్యుండు మీకు క్షత్రియవృత్తియందున్బలె నాకు వైశ్య
వృత్తియందును గొంతయనుభవము కలుగుటంజేసి ప్రసక్తి కలుగుటచేఁ
గొండొక వచింతు. ౧౬౭

ఉ ఎంతటివానినేని నన్నృత మియ్యది యాడఁగఁ జేసి పాపపుం
బుంతను బెట్టు "లచ్చి కిది పుట్టినయి''ల్లనుమాట సత్య. మీ
సొంతపువృత్తిఁ బోవిడుచుచో ఫల మేమని మాకులస్థు లా
వంతయు నన్యవృత్తులకు నగ్గము గా రిది చాల శ్లాఘ్య మౌ. ౧౬౮

గీ. అన్నివృత్తులు మంచివే. అట్లె యన్ని
వృత్తులనుగూడఁ జెడ్డవియే, అటేని
తనదుపూర్వు లొనర్చెడిదాని విడువఁ
దగ దని వచించెఁ గృష్ణుండు ధర్మవిదుఁడు. ౧౬౯

వ. అని యక్కన్నె నుద్దేశించి. ౧౭౦

క. ధర్మవ్యాధునికత యీ,ధర్మము బోధించుఁ జిన్నదానవు నీ వీ
మర్మం బెఱుఁగక యిల్వీడి, నిర్మానుష్యమగు నివ్వనికి వచ్చి తొగిన్.

చ కలిగెనె యమ్మ చట్టన వికారము నీమది కాత్మవృత్తిలో
పలి యవమానముల్ దలఁచుపట్టున; నయ్యవి యట్టివే యగున్
దలఁచిన గుండె బెందువడుఁ దదత నైచ్యము; శోచ్యమయ్యు మి
క్కిలి నిది కొందఱన్ మనుచుఁ గీర్తియు ద్రవ్యము నిచ్చి నిచ్చలున్.

శా సంగీతమ్మననో ? మ టొక్కకృతినో ? సంతోషమున్ బెంచి మీ
ర్శృంగారమ్మను రత్నముల్ మొదలుగా ద్రవ్యమ్ము నార్జింతు రిం
దుం గించిత్తును లే దఘంబు భగవంతున్ గృష్ణుఁ గీర్తింతు రా
శృంగారఁపురసాధిదేవతకు మీ రెల్లప్డు దాసుల్ గదా ? ౧౭౩

మ. పగనైనన్ వగనైన దేవునికతల్ బాడంగ నుంకించువాం
డ్రుగదా ? ధన్యులు, మీకు నీసుకృత మెప్డున్ గల్గుచుండున్ ఘనుల్

సుగుణం బెంతురు దేననేనిఁ జెడుగున్ శోధింప రక్షించుచో
భగవంతుండుఁ బరీక్ష కాఁగఁడన నేవా రాఁగువారో ? కదే ? ౧౭౪
క. బేల వగుటచే నొయ్యన. జాలికిఁ దానకము పగుచుఁ జనుదెంచితి వా
భీలారణ్యమునకు నిని. మేలని యనుపెట్టు లొరులు మెలఁతలమిన్నా!
గీ. నీకులవృత్తి సచ్చక నీకు నేవ
మబ్బునెడఁ బెండ్లి చేసికొ మ్మతివ ! యెంద
ఱెందఱో మీకొలమ్మునయందుఁ బెండ్లి
యాడిన పతివ్రతలు గల రందు నందు. ౧౭౫
వ. నావుడు నబ్బాలిక యిట్లను ౧౭౬
ఉ. ఏను వివాహ మాడినను నిల్లు సమస్తము పాపవృత్తి కా
స్థానమ యయ్యె, దానిఁ గని సైఁచుట కష్టమ కాదె ? నాదుసం
తానము సద్గుణంబులకుఁ దానకు మౌటకు నింట నున్నయ
జ్ఞానము బాధకం బగునుగాని సుసాధక మౌనె ? యెమ్మెయిన్. ౧౭౭
గీ. కాన నే నవివాహితగానె యుండి
మిమ్మువంటి పెద్దలఁ గొల్చి యమ్మహాత్మ
దేవదేవు ననంతుని దివ్య భవ్య
నాత్మ నిల్పి కృతార్థత నంద నెంతు. ౧౭౮
ఉ. పెండిలి యాడఁగే స్తనుభవించు సుఖం బదిమాత్ర మెంత ! యొ
క్కండును నిష్కళంకపు సుఖంబు నెఱుంగఁడు నిక్క మిట్టిదై
యుండియు నిందుకే జనన మొందినయట్టులు గేస్తుధర్మమున్
గందురు జ్ఞాను లించులకుఁ గాంక్ష యొనర్పరు తత్త్వవిజ్ఞతన్. ౧౭౯
ఉ. ఐనను లోక మంతటికి నర్హముగాఁ గనుపట్టుచున్న యి
ద్దావి వరాకి యెవ్వతెయొ ? తప్పిద మన్న గ్రహింతు రెవ్వ రీ
మానవలోకసృష్టి కిది మార్గముగా భగవంతుఁ డెంచిన
ట్లే ననుకొందు మావృశుల కిందలితత్త్వ మెఱుంగు టెట్లగున్. ౧౮౦

గీ. ఇతరగృహమేధులకు మాకు నెంతొ వార
యుండు వారాంగనకు విరాగోదయంబు
గల్గుచో యోగినీత్వంబె కడు హితంబు
గాఁగ నాయంతరాత్మకుఁ గానిపించు ౧౮౨

చ. "నిలుచునె? వృద్ధులౌ ఘనమనీషులె తాల్పఁగ లేని నిష్ఠ నీ
కలఁతికి బాల కెందు"కని యందురు మీరని నే నెఱుంగుదున్
నిలిచినయన్నినాళ్ళె యిటు నిల్తు ననంతరమం దెటుల్ మదిన్
దలఁ పుదయించు నందులకె దాస్య మొనర్చెద నేమి లోపమౌ. ౧౮౩

క. మంచిపనియందు మది యొ
క్కించుక నిలిచినను నది యెదేని "శుభము గ
ల్గించు" నని పెద్ద లందు రొ
కించుకకాలమ్మె యైన నిది సేవ్యంబే. ౧౮౪

మ. భగవద్ధ్యాన మొనర్చుకొంచు జలమో ! పండో ! మ ఱిం కేదియో
పగలో ! రేయియొ ! ఖిన్నవృత్తికొఱకై ప్రాశించుచున్ సర్వదా
నిగమజ్ఞాతలయొద్ది కేగి యెవియేని న్వించు వైరాగ్య మొ
ప్పఁగ వర్తించుటకన్న నొండు గలదే? భాగ్యంబు జన్మానకున్. ౧౮౫

ఉ. వచ్చినరాత్రులే మరల వచ్చు బగళ్ళును నట్లె; సంసృతిన్
జచ్చుచుఁ బుట్టుచున్ వ్యథగఁ జర్వితచర్వణముల్ పొనర్చుటల్
నచ్చక నామనం బిటు ప్రపంచమున కీడ్చుక వచ్చె, మిమ్ము నే
నిచ్చటఁ గంటి మీరు కృతకృత్యులు సేవ్యులు నన్ను బోటికిన్. ౧౮౬

గీ. ఎపుడు సద్వృత్తిపై మది కి[illegible] పోడమె
నపుడె శుభములు [illegible] [illegible]వచ్చె
నిందులకు వృద్ధులై[illegible] మీ[illegible] రి[illegible] వ్రరిచట
దర్శన మొసంగు టి[illegible]ఁగా నిదర్శనంబు. ౧౮౭

క. ఉత్తమవంశస్థులు వి,ద్వత్తములున్ వృద్ధు లఖిలధర్మవిదులు మీ
యెత్తు ధన మిడిన పత్తురె?, సత్తమదర్శనము సులభసాధ్యం బగునే?
గీ. అమ్మయిమ్మైన తీర్థమ్ము, లశ్మమృన్మ
యమ్ములగు దేవతావిగ్రహములు సజ్జ
సులభలెఁ బవిత్రిత నొసంగఁగలవె? శ్రీఘ
కాలమున దీర్ఘకాలానఁ గాని యెంచు. ౧౮౯
చ. మనమున నున్న నెవ్వగలు మాయుట "కెయ్యది మంచి చెత్త" యం
చును గనుఁగో మనఃకుహరశుద్ధి ఘటింపఁగఁ జక్కఁ గాలయా
పన మొనరింప నెక్కుడు శుభంబులు గూర్పఁగ సాధనంబు స
జ్జనులనుదర్శనం బిది ప్రశంస్యము దీనికె సాటి లే దిలన్. ౧౯౦
క. భగవంతుఁడు తను సమ్మిన,సుగతికి మార్గంబు విధిగఁ జూపు ననుట మీ
రగుపట్టుటచే నిక్కమ్ముగఁ దోఁచెన్ వేయునేల? పున్నెము పండెన్.
వ. ఇట్లుపన్యసించు నక్కన్నియ భక్తిజ్ఞానవైరాగ్యంబుల కచ్చెరు వంది
వా రిరువురును దమలోఁ దాము "తమ కామెసుఁ గలజ్ఞానమ్ములో నె
న్నవవంతును లే" దని యభినందింప సాఁగిరి. అందు వైశ్యవృద్ధున
కంతకు మున్ను పీడించు సంసారభ్రాంతి యీపెమాటలు వినుటంజేసి
చాలభాగంబు తొలంగి వివేకోదయం బగుటయు నతండు. ౧౯౧
ఉ. ఏదియొ పూర్వజన్మమున నీమె తపం బొనరించి పుట్టె నం
దేదియొ తప్పు చొప్పడుటయే నెలచానకుఁ బుట్టుహేతు వీ
యాదరణీయశీల మన కన్నివిధమ్ముల మాననీయ నేఁ
డాదిగఁ బుణ్యగోష్ఠి మన కబ్బిన దీపెకతాన నెమ్మెయిన్. ౧౯౨
క. వనమున నాకలములల జీవనము న్నెఱవేర్చికొనుచు భగవంతునికీ
ర్తన లీమెకతన వినుచున్, మునులను దర్శించుకొంచు మోదమ్మలరన్.
క. జీవితశేషము గడుపుట
కీ వైరాగ్యఖని మనకు నీశ్వరుఁ డొసఁగెన్

దైవతకళ గల యీసతి
సావాస మ్మిహపరముల లొసఁగున్ మనకున్. ౧౯౫

చ. అని యనుకూలభావమున నాముగు రొక్కట నాశ్రమంబు సై
కొని యతిథిప్రపూజనముఁ గూరిమిఁ జేయుచు నప్పుడప్పు డ
వ్వనమున నున్నసాధువులపజ్జను నేగుచు ధర్మచింతనం
బొనరుచుచున్ యథార్థముగ నుండిరి కొండొకకాల మయ్యెడన్.

మ. ఒకనాఁ డయ్యెడ కేగుదెంచె జటిగా నొప్పారు విప్రుండు నై
ష్ఠికసల్లక్షణశాలి కక్షమున నాడీగ్రంథ మొక్కండు తా
ళకపత్రంబుల దున్నవాఁడు; కని వాలాయంబు సద్వాని, న
ర్చకతానం బరితుష్టుఁ జేసి రలవేశ్యాపుత్రి వా రిద్వయున్. ౧౯౭

గీ. అట్లు పరితుష్టుఁ జేసి తదన్వయాది
కమ్ముఁ బ్రశ్నించి పిమ్మటఁ గతగతము
పొత్త "మేపొత్త" మని యల పూవుఁబోఁడి
సవినయమ్ముగ నడుగ నాసాధు వనియె. ౧౯౮

శా. ఈపొత్తమ్మును గూర్చి చెప్పునెడ నెంతేఁ జెప్పినం దీర దా
యీపొత్తమ్మున లేని దేదియును లే దీపొత్తమే సద్ధనం
బీపొత్తమ్మె మదిష్టదైవతము నా కీపొత్తమే చేసె నా
శాపూర్తిన్ గల వింద నెన్నియొ రహస్యంబుల్ పరీక్షించినన్. ౧౯౯

ఉ. గతమునుబోలె నాగతముఁ గన్నులఁ గట్టినయట్లు తోఁచు దు
ష్కృతసుకృతాదికమ్ము లెవఁ డెన్ని యొనర్చెనో ? దీనఁ దేలుఁ గ
ల్పిత మనుకోకుఁ డిందు లవలేశ మలీకము లేదు పూర్వసం
చితమగు భాగధేయమునఁ జేకుఱె నాకిది వేయు నేటికిన్. ౨౦౦

గీ. ఇది గలుగువాఁడు తేఁ డగు నిది యెఱిఁగిన
వాని జేం డ్లాశ్రయింతురు వానియింట

నెపుడు ధనలక్ష్మి తాండవం బెలమి నాడు
దీనిసత్త్వ వచింప నెవ్వానితరము. ౨౦౧

ఉ. నావుడు వైశ్యసత్తముఁడు నవ్వి భవద్వచనంబునందు నా
భావము విశ్వసింపమిని ప్రశ్న మొనర్తు క్షమింపుఁ డట్టి స
ద్దైవత మబ్బికూడ భసితంబును బూసుక జోగివై యిటుల్
భూవలయానఁ ద్రిమ్మరఁగఁ బోలునె నీకు ? మహాత్మ ! చెప్పవే ?

ఉ. బంగరుఁదూఁగుటుయ్యేలల బాలురు బాలికలున్ జెలంగ స
ర్వాంగమనోభిరాములగు నంగనలం జెలువారు మేడలం
దుం గొలువుండఁగాఁ దగిన తోరపురాసిరి మీకుఁ దా నొసం
గం గలపొత్త మీయది బికారిని జేయుచుఁ ద్రిప్పు టెట్టిదో? ౨౦౩

సీ. ఏనుఁగంబారీల నెక్కి యెక్కడికేని
యేగు రాసిరి మీ కదేల లేదు ?
"పంచకళ్యాణి" యశ్వము నెక్కి స్వారి వేం
చేయని కత మేమి ? చెప్పుఁడయ్య !
శరదిందుముఖులు పార్శ్వములందు నిల్చి చా
మర లేకతాన వీవరు మహాత్మ !
వందిమాగధులు కైవారముల్ సలిపెడి
సడి వినరామి కాశ్చర్య మనఘ !

గీ. సకలవాంఛల నిడి మిమ్ము సాఁకఁజాలు
కల్పవృక్ష మీపొత్తము కక్షమందుఁ
"కరతలామలక" మ్మనుగతి నెసంగి
జోగిగాఁ జరియించుట చోద్య మయ్యె. ౨౦౪

క. నావుడు నాతం డిట్లను, నో వైశ్యకులావతంస ! యున్నదె యనుకో
మ్మేవిభవమొ? అది మేననె, యేవాఁడు వహించి తిరుగు టెందున్
గలదే?

గీ. ఈవు కోటికిఁ బడగెత్తి యిటకు వచ్చు
నప్పు డది నెత్తిఁ బెట్టుక యరుగుదేర
వేమి ? "మనుజున కుంటయే యెందుఁ బుష్టి"
యనెడినుడి నీవు నెఱుఁగుదు వలఘుశీల ! ౨౦౬

చ. అదియునుగాక రిక్తులగు నయ్యల కమ్మల కున్న శ్రద్ధ సం
పద లధికమ్ముగాఁ గఱుగువారికి 'షోకు'లపట్ల నుండఁబో
దిది మది నీ వెఱుంగవె ? మహీశుఁ డొకప్డెపుడో ధరించుఁగా
ని దినదినంబు దాల్చునె మణీమకుటంబును జారుహారముల్ ? ౨౦౭

ఉ. నావుడు నవ్వి కోమటి "మనంబున కచ్చెరు వెక్కు డయ్యె న
య్యా ! విని మీనుడుల్; మకుట మన్నపుడున్ ధరియింపకున్నను
నీవలె ఱేఁడు జోగిగతి మేనికిఁ జక్కనివస్త్ర మేని లే
కే వెడవేస మూని చరియించునె ? చంకను బొత్త మూనుచున్.

ఉ. దీనికి నుండి తీరెడి నెదే నొకహేతువు; మీరు సజ్జనుల్
సూనృతవాదు లిట్టిపరిశోధన మీయెడఁ దప్పిదంబ యౌఁ
గాని భవచ్చరిత్ర వినఁగాఁ దెగి ప్రచ్చ యొనర్చుచుంటి నా
పై నెనరుంచి చెప్పుఁ డన బాపనమౌని వచించె నీగతిన్. ౨౦౮

క. నే నొకసద్విప్రకుటుం,బానన్ జనియించినాఁడ మాతామహవం
శాన సిరిగలద యిల్లట,మూని జనకుఁ డుండె భార్యయును దా నచటన్.

ఉ. అన్నయుఁ దమ్ముఁడుం గలర అందఱి కేఁ గడగొట్టువాఁడఁ గా
నన్న స్వయంకృషిన్ ఘనులయాదృతిఁ గై కొనునంత యోగ్యతా
భ్యున్నతి కిక్కయై వెలయుచుండెను బ్రస్తుత, మాతఁ డిట్టియ
భ్యున్నతి నంది యుండుటకుఁ బూర్వమె పోయిరి తల్లి తండ్రియున్.

క. మాతల్లి గుణగణాఢ్యత, యేతాదృశ మంచు నాపె నెఱిఁగినగఱువల్
ప్రీతిమెయిఁ జెప్ప విందును, బాతివ్రత్యమున కామె పరమావది యౌ.

చ. నను( గని కొన్నిముచ్చటలు నాయవి చూచెనొ లేదొ ? తాఁ బరం
బున కరుదెంచెఁ దల్లి; యెటు పోషణచేసెనొ ? అన్న నే నెఱిం
గను బసివాఁడ నౌట నలకాలమునందుఁ గుటుంబ; మంతలో
ఘనతరసంపదున్నతులు గల్గె స్వయంకృషిచేత నన్నకున్. ౨౧౩

మ. "తలిదండ్రుల్ గన" రన్నలోప మొకఁడే తక్కంగ నేలోటు నా
వల లేకుండెను; గన్నపుత్రుబలె నాపైఁ బంచప్రాణమ్ములున్
నిలుపు న్నాయనగారు న న్విడువఁ డెంతేఁ గార్యమే యున్న; వి
ద్య లలిన్ జెప్పఁగఁ జేసె సద్గురులచే నత్యంతమున్ శ్రద్ధతోన్.

ఉ అన్నకు రాజకీయకళయం దభిమానము మెండు నా కదే
"వన్నియ గల్గఁజేయు" ననువాంఛను దానినె చెప్పఁజేసె నేఁ
గొన్నిదినాలు చేనికడఁ గొల్వొనరించితి వేతనంబు గొం
చు "న్నృపసేవ కష్ట" మనుచున్ మదిఁ దోఁచెఁ గ్రమక్రమమ్ముగన్.

ఉ. తోఁచి స్వయంకృషిన్ సలుపు త్రోవలు లోఁ దలపోయుచు న్మది
న్నీచముగాఁ దలంచియును నే నది వీడక జాతకమ్ములన్
జూచెడి విద్దియన్ దెలుపుసూరులవంకకు దృష్టిఁ జొన్పి వా
రేపతురత్వమున్ గనమి కే నెదలోఁ గడు దుఃఖ మందితిన్. ౨౧౪

ఉ. చక్కనివిద్య యియ్యది విశాంపతులేనియు దీని నేర్చున
య్యక్కృతిద్వారమందు వినయంబున దర్శనకాంక్ష నిల్తు "రే
ఫక్కిని దీనికిన్ దగినవైభవ మబ్బునొ ? చూత" మం చె దే
నొక్కసుమార్గమున్ గనుట కూహ జనించె హృదంతరమ్మునన్.

ఉ. చిన్నతనమ్మునుండియును శ్రీరఘురాము పదారవిందముల్
మన్ననఁ గొల్చు నల్ల హనుమంతుఁడు నాకు నుపాస్యదైవమై
యున్నకతాన నయ్యనఘు 'నూఁతము గ'మ్మని వేడికొంచు నే
నున్నతఱిం గనంబడియె నొక్కట నక్కపిరాజు నాకలన్. ౨౧౬

క. కనుపట్టి జాతకపుఁ గల, కనుగుణగౌరవము గలుగు నాయాత్రోవల్
వినిచిన నయ్యవి యెల్లను, మనమున నిల్పికొని కొలువుమాని యథే [చ్ఛన్.

క, కృషి సల్పితి 'నెపు దేయే
ఋషి దీనింగుఱిచి చెప్పె నేసంగతి యే
ఋషిమతముఁ బట్టఁదగు నే
ఋషిమత మగుఁ ద్యాజ్య' మనుచు నేకాంతమునన్. ౨౨౦

క. మానసికశక్తి హనుమ,ద్ధ్యానమ్ముకతాన హెచ్చె నక్కతమున నే
దేని వచించిన నయ్యది, సూనృతమై ప్రజలమనసు సూటిగ నాటెన్.

గీ. క్రమముగా దేశదేశాలఁ గ్రిమ్మికొనియె
నాదుపే; రక్కతాన ఘనాఘులాది
యెల్లధనికులు నాగృహ మేగుదెంచి
కాన్కలిడి కాంచుచుండిరి కార్యసిద్ధి. ౨౨౨

క. దానికిఁ దోడై పిమ్మట, నీనాడీగ్రంథమొకటి యే నలసేతు
స్నానార్థ మేగుతఱి స్వల్పానను నొకఁ డమ్మఁ గొంటి భగవత్కరుణన్

ఉ. అప్పటికే యఖండదళ కాకరమైన మదీయజాతకం
బొప్పె ననంతరంబు పరమోన్నతికిం గుదురౌచు ద్రవ్యముల్
గుప్పలుగాఁగఁ బోగుపడెఁ; గొండొకచేఁడు జమీనుగూడ నా
కప్పనఁ జేసె జాతకము నాతనికిన్ వచియించుహేతువై. ౨౨౪

క. కలిగిరి కొమరులు; మనుమలు
గలిగిరి "తాత" యని పిలువఁగాఁ జొచ్చిరి భా
ర్యలకుఁ దల నరయఁజొచ్చెను
"గల సంసారం" బటన్న గతిగాఁ దోఁచెన్. ౨౨౫

ఉ. ఎందును లోటు లేమి పరమేశ్వరుసత్కృపచే లభించె నా
నందమయమ్ముగాఁ గడచె నాదగుజన్మన మెల్ల; వార్ధకం

బందికొనెన్ బరంబునకునై జతనం బొనరించునిచ్చ నా
డెందమునన్ జనించెను గడిందిగ నాఁగఁగరాక యెమ్మెయిన్. ౨౨౮

ఉ. అన్నములేని రిక్తులకు నన్నమ యొఁ బరమార్థ మిట్టులే
యెన్నుచుఁ బోదుమే నెవరి కెయ్యది యుండదొ వారి కద్ది స
ర్వోన్నతముక్తిపీఠ మగుచుండు. సమస్తము నున్న మేటిసం
పన్నులె ముక్తి కేగునలమార్గముపట్టున నర్హులెమ్మెయిన్. ౨౨౯

ఉ. చిన్నతనాన రిక్తతను జెంది యెఱింగితి దాని వైఖరిన్
గ్రన్నన జవ్వనంబునెడఁ గంటిని భోగములన్ విశిష్టసం
పన్నులలోన నే నొకఁడ; భార్యలుఁ బిల్లలు నెందు లోటు లే
కున్నది సంసృతిన్ విడిచి యోగిగతిన్ జరియించు టొప్పదే ?

క. ఆనందము సంసారము,లోనన్ మృగ్యంబు దానిలో నేలోపం
బేని ఘటించినచో న,య్యానందము మఱియు మృగ్య మని యెఱుఁగ [నగున్.

గీ. అనుభవించినకొలఁది భోగానుభవము
పట్టి పీడించుచునె యుండుఁ బ్రాణికోటి
నక్కటన భావిశుభగతికై నరుండు
దానిఁ ద్యజియించుటకుఁ బ్రయత్నపడవలయు. ౨౩౦

వ. శ్రీకృష్ణదేవరాయలు దీనింగుఱిచి 'ఆముక్తమాల్యద'లోఁ జక్కనిమా
ర్గం బుపదేశించె; నయ్యది 'భోగినీసంగతికి రాజు వోవుచుండి' అను ప
ద్యం బున్నఘట్టమ్మున స్పష్టంబుగ గోచరించెడిని. ౨౩౧

క. ఓపిక గల దినములలో, నే పురుషుం డిహమునందు నిర్లిప్తుం డై
యేపాటిదొ పరసుఖమునకై పాటు పడంగలేఁడు నర్హతకొలఁదిన్.

వ. నాపుడు వైశ్యం డిట్లనె. ౨౩౩

చ. వినినకొలంది నీచరిత వీనులవిం దగుచుండెఁ గాని యో
గి నియతి నుండుకోర్కె విని కేవల మాత్మ తపింపఁ జొచ్చె నో

యనఘ ! తపించి కైకొనెడి నాకము నీ కిచటన్ లభించి యుం
డినయపు డేల ? దానిని గణింపక జోగిగతిన్ జరించుటల్. ౨౩౪

క. "దూరపుఁగొండలు నును" పని
ధీరులు వచియించుమాట తెల్లం బాయెన్
వైరాగ్యమ్మున నీ విపు
డూరక సంసారనాక మొగి విడుటచే. ౨౩౫

క. నీకున్ వార్ధకవయ సని, నాకున్ దోఁప దెలజవ్వనము దాఁటెడి సు
శ్రీ కలకౌమారమ్మగుఁ, గా కెదియే నైననగును గా కిది మేలే. ౨౩౬

క, ననుఁ "గోటికిఁ బడగెత్తితి"
వని పల్కితి వెట్లు తెలియనయ్యెను నీ కో
జనమాన్య ? తెలుపు మనవుడు
మునుపే యెఱిఁగించినాఁడ మునుకొని దీనిన్. ౨౩౭

క. నాయైశ్వర్యము సకలం, బీయెఱుకకతాన నబ్బ పెఱిఁగించితిఁ గా
దే ? యేటికిఁ బ్రశ్నించెదు ? నా యాథార్థ్యమ్మునెడల నమ్మిక లేదే ?

వ. నావుడు వైశ్యుండు. ౨౩౯

ఉ. నమ్మిక లేక కాదయిన నా మొగ మెన్నఁ డెఱుంగనట్టి నీ
విమ్మెయిఁ జూచుమాత్ర నెటు లేకరు వెట్టఁగఁ జాలి తంచు నొ
క్కమ్మడి నక్కజంబు మది నుండక పైకెగఁదట్టి నిన్నుఁ బ్రి
శ్న మ్మిది చేసితిన్ జగమునం గల రెంతటి బుద్ధిశాలులున్. ౨౪౦

క. ఇది బుద్ధిబల మటంచును, మదిఁ దలపఁగ వీలు లేదు మర్మం బిది యె
ట్లైద నిర్ణయించి పలికితి, విది నిక్కమ యయ్యు సంశయించెద నెంతో.

వ. సామాన్యంబుగా "నైశ్వర్యవంతుఁ" డని చెప్పుటకు నీకేదేని గ్రంథా

ధారం బుండిన నుంకుఁగాని యింత యని ఖండితంబుగా వచించుట
యు నది యథార్థంబగుటయు నక్కజ మయ్యె. ౨౪౨

ఉ. ఇంతటి జ్ఞానసంపద యహీనము వైభవ మొప్పు లొల్కన
త్సంతతి లోనుగాఁ గలుగు సర్వసుఖంబులు గల్గుమేటి కే
చింతయు నుండ దొక్కపరచింత వినాగ, గృహమ్మునంద త
చ్చింతకు పీలు గల్గదొకొ ? చేరఁగ నేల ? వనాంతసీమకున్. ౨౪౩

ఉ. నా నతఁ డిట్లు వల్క భవనంబు వనంబు నటన్న రెండె పో ?
మానవుఁ డుండఁగాఁ దగిన మాన్యపుఁజోటు, లోకంట నున్నచో
మానదు భీతి; నెమ్మది శమమ్ము గడింపఁగఁ జాల దెంత మే,
లైనను గీడులం బొరయ కట్టై సదా నిలువంగ నేర్చునే. ౨౪౪

చ. కొమరులు చెప్పినట్లు వినకో ? మఱి వారలభార్యలందుఁ బో
చ్చెము లుదయించియో ! యెవియొ చెట్టలు సంసృతి నీఁదువారికిన్
గ్రిమముగ సంఘటించుచు కనంబడు నెట్టికుటుంబికేని లో
కముపరిపాటి తప్పికొనఁగాఁ గల రెవ్వరు ? వైశ్యసత్తమా. ౨౪౫

చ. జనకుప్రయోజకత్వ మది సర్వవిధమ్ములఁ బుత్రులన్ సుదు
ర్జనుల నొనర్చు నద్ది గని సైఁచుట కష్టము, అట్టి వేవియున్
గనకయ మున్న ప్రాజ్ఞుఁడు సుఖమ్ముగ గేహము వీడి యోగివ
ర్తనమున భావిజన్మమును ధన్యము చేయ యతించు టొప్పదే ! ౨౪౬

శా. విన్నన్ గన్పడువాఁడు గన్పడఁడుగా ? నేఁ డెందఱో మేటిసం
పన్నుల్ చట్టనఁ గూలిపోవుటయు దౌర్భాగ్యాలవాలమ్ము లు
త్పన్నప్రాభవులౌట లోనగు నసందర్భంబు లీక్షించుచో
విన్నాణం బిసుమంత యున్నమది కావేగంబు జన్మింపదే, ౨౪౭

చ. జనుఁడెవఁడేనిఁ గొంత తనుశక్తి దృఢంబుగ నున్నయప్డె కై
కొనవలె సంసృతిన్ విడుచుకోరిక; పూర్తిగ శక్తియెల్ల లోఁ

గినయపు దేమి నేసెడి ? నగించెడి నయ్యపరక్తి: వానిఁ గ
న్గొని యలముక్తికామినియుఁ గొండొక నవ్వుఁ దృణీకరించుచున్.

మ. జననం బందుట, పెద్ద యౌటయు గృహస్థత్వమ్ము గైకొంట నం
దనులన్ గాంచుట, పెండ్లి సేయుట యిటుల్ నానాఁటి కేదేనియున్
బని యున్నట్టులె తోఁచుఁ బ్రాజ్ఞుఁ డెటులో భావిన్ విచారించి స
జ్జనసాంగత్యముఁ గాంచి సార్థకజనుస్సంసర్గియౌ టొప్పదే ?'' అట్లా

మ. ఎపుడో ? పెద్దలపొత్తు గైకొనెద, నే నెప్డో జగత్కర్త స
త్కృపకుం బాత్రుఁడనై చరించెద '' నటం చీమాడ్కి యోజించుచు
న్నపుడే యాయువు మూఁడునేమొ? 'యిది నిత్యం' బంచునెవ్వాఁడుపూఁ
ట పడున్ ముందుగ మేలుకొన్నయెడ నష్టంబేమి? దీర్ఘాయుషుల్.

శా. నాకుం దోఁచినమాట 'యైహిక' మటన్నన్ దీర్ఘ యాత్రాపరుల్
పీఁకన్ జేయుమకాములం దొకటి యౌ వేయేండ్లు జీవించినన్
లేకుల్ 'శాశ్వత' మంచు నెంచెదరు వల్లిం బొల్చుపుష్పమ్ము గా
దే ? కన్గొన్న మనుష్యజీవితము, చన్నే ? నమ్మి వర్తించుటల్.

ఉ ఎందఱొ దీనితత్త్వము మనీషులె కన్గొనలేరు 'జాతకా'
లందురుగాని యొక్కొకపు డయ్యవినై తము మోసగించు నే
నందుఁ గృషిం బొనర్చితి ధనార్జన చేసితిఁ గాని యాయువున్
బొందుగఁ జెప్పలేమి యనుభూతమ, ముందుగ మేలుకోఁదగున్.

ఉ. ఇందనుకన్ వచించు నుడులెల్లను మెల్లఁగ నాలకించి యా
నందము పట్టఁజాల కలనాతి మహాత్మ ? భవద్వచోమృత
స్యందము మన్మనంబునకుఁ జాలఁ బ్రశస్తముగాఁగఁ దోఁచె నే
మందమతి న్నినుం బొగడుమాటలు నేర క్షమింపు మ్రొక్కెదన్.

క. సంసారసుఖములెల్లను, హింసకుఁ గారకము లనియె యే నెంతునెటో
కంసారిభక్తి పాప, ధ్వంసక మని యెంచి నరుఁడు తరియింపనగున్.

తే. ఎండమావుల జల ముండునేని సుఖము
సంసృతినిగూడ నుండు, సంసారికన్న
దుఃఖి యెవ్వఁడు నుండమి తొల్లి బుధులు
తెల్పి యుండిరి సంసృతి దెగడు టొప్పు. ౨౫౫

క. ఎల్లడ విరక్తి సంసృతి, నొల్లనిచో సృష్టి యెట్టులో? యని పలుకన్
జెల్లునె? సృష్టికిఁ బుష్టి ఘటిల్లుటకే సంసరించెడినె? ప్రతినరుఁడున్.

తే. నూఱులంగాదు వేలయందు మఱిగాదు
లక్షలంగూడఁగాదు కోట్ల నొకప్రాణి
కబ్బునో? లేదొ? వైరాగ్య మంతమాత్ర
సృష్టి కేమంత నష్టి యోఁ జెప్పఁగలరె? ౨౫౭

శా. "సంతానార్థము పెండ్లి యాడు" టనుచున్ శాస్త్రమ్ము శాసించు నే
కాంతన్ గాంతుఁడు సంతుకోస మెలమిన్ గామించునో? చెప్పఁ దేఁ
బంతమ్మోని వచింతు 'నొక్కఁడును గన్పట్టం' డటంచున్; సుఖ
భ్రాంతింజేసియె పెండ్లి యాడు నది స్వప్నప్రాయమౌఁ బిమ్మటన్.

వ. ఇట్లేదియో తనకుం దోఁచినతెఱంగున నాయోగివర్యుని వాక్యంబుల కుప
శ్రుతిగా నయ్యతివ వచించుచుండ నవ్వైశ్యవృద్ధుం డడ్డమ్ముగా నేదియో
పలుకం గడంగుడు వారించి యారాజర్షి యిట్లనియె. ౨౫౯

క. మే మిరువురము విరక్తుల, మే మాటలు పెక్కులేల? యీబాలిక తా
నీమెయి విరక్తి గొనుటకు, నేమేమో? చెప్పెఁ గతము బుత మనిపించెన్

తే. ఇంద్రియమ్ము లజేయమ్ము లెంత పెద్ద
పండితునకైనఁగాని లోఁబడమి ధ్రువము
స్త్రీకి లేఁతప్రాయమున వర్తిల్లుదాని
కింద్రియజయమ్ము గల్గుట యెట్లు పొసఁగు? ౨౬౧

వ. ముక్తికై యత్నించువారలకుఁ బక్షిన్యాయం బొండును బిపీలికాన్యాయం
బును శాస్త్రసమ్మతంబులై యున్నయవి అద్వైతయమ్మునందుఁ బిపీ

లికాన్యాయానువర్తులు ప్రమాదంబు నొందరు ఈపెవిరక్తి పక్షిన్యాయం బునకుఁ జెందినయదియకదా ? యిది తుద నెగ్గెడినా? లేక రసాభాసం బగునా ? ౨-౭

క. అని సందియమ్ము వొడమెడి, ఘనపతి వీ వనుభవించి కాంచి విరక్తిన్
జనుచెంచితి విది లోకమ్మునఁ గలదే యీపెగతికిఁ బొసఁగఁగ వలదే?

క. చిరకాల మనుభవించియు విరక్తి గొని పరలి దాన వేఁడుఁగొని త
త్పరమార్గదూరులగు ముని,వరుఁచరిత్రము తెలుపఁవారము కాదే,

ఆ. ఎఱిఁగి యెఱిఁగి యీపె కెట్లేని బోధించి
యింటి కనుపకుంటిమేని జగము
మనల దూఱు నటచు మదిని నాకు జనించె
భయము మీరుగూడఁ బాఱఁగనుఁడు. ౨-౮

వ. నావుడు నయ్యోగివరుఁడు తనయొద్దనున్న పుస్తకముఁ దిరుగవేసి చూచి.

తే. దీన లోకమ్మునం గలమానవులస
మస్తజాతకములు నుండు మంచి చెడ్డ
సకలమును నిది వచియించు సంగ్రహముగ
విస్తరించి తెల్పెడిఁ గొన్ని విషయములను. ౨-౯

క. గౌరీశాప మ్మొండిన, కారణమున నెక్కడే నొకానొకటి యెదో
తీర్రై పొల్లగు దానిన్, ధీరులు గణియింప రిద్ది తెలుపు నఖిలమున్.

వ. దీనింబట్టి పరిశీలించిన నీపె వైరాగ్యం బనుల్లంఘనీయం బనియె నాకుఁ దోఁచెడి నావుడు వైశ్యవృద్ధుండు ౨-౯

తే. ప్రకృతజన్మవృత్తాంతమే పలుకునొక్కొ
గతము నాగతమునుగూడఁ గలిపి చెప్పఁ
గలదొ ? "దాక్షిణాత్యులకడఁ గల" వటంచు
వింటి మిట్టిపొత్తమ్ములు గంటి మిపుడు. ౨౦

వ. నావుడు యోగి యాపొత్త్రమునకుఁ గొండొక పూజాదికమ్ము నెఱపి మీయడిగినవిషయమ్ము వచించెద ననునంత మాధ్యాహ్నికసంధ్యాకాలం బాసన్నం బగుటయు మునులును రౌమహర్షణియుఁ దాత్కాలికంబులు నిర్వర్తించుకో నరిగిరి. ౨౭౧

ఆ శీ ర్వ చ న ము.

క. లింగంవంశ్యం డెప్పుడు
భంగములేకుండు సిరికిఁ బాధ్రై కవితా
రంగ మగుయశముతో ను
ప్పొంగుచు నలరారుఁగాక పూర్ణాయువుతో.

ఇది శ్రీతిరుపతి వేంకటీయమ్మగు సుశీల యను
కేవలకల్పితప్రబంధమునందు
ద్వితీయాశ్వాసము.



శ్రీమత్పరదేవతాయైనమః

# సు శీ ల

## తిరుపతివేంకటీయము.

## తృ తీ యా శ్వా స ము.

వ. మరల శౌనకాదులు నిర్వర్తితమాధ్యాహ్నికకర్మకలాపులును గృతభోజనులును నయి సూతుంగని యనంతరకథావిధానం బానతిమ్మనుడు నాతం డిట్లు చెప్పందొడంగె ననంతరం బామహాయోగి వారలం గని. ౧

క. ఒకఁ డనఁగనేల? యియ్యది
సకలము వాక్రుచ్చు నిదిగో? చదివెద వినుఁ డీ
యకలంకచరితగతజ
న్మకథన్ వివరింతుఁ గలదు మంచియుఁ జెడుగున్. ౨

క. ధనవతియును గుణవతియును, ననుగుణవిద్యావతియును నగువేశ్యకుఁ దా
జనియించె నీపె తొలుతటి,జనియందుఁ దనూజ యగుచు జాతికిఁ దొడవై

మ. కులవిద్యన్ గడు మిన్నయై యలరు విఖ్యాతున్ మహారాజు న
ర్మిలికిం బాత్రము తల్లి తాఁ గనుటచే తేఁ డెంతయో ముద్దుగా
నలరన్ బెంపఁగఁజేసెఁ బిమ్మటను రాజాలంబ మవ్వేశ్యకున్
దొలఁగెన్ దానినిమిత్తమున్ వినుతు నుద్యోగింపుఁ డాలింపఁగన్. ४

చ. వికృతముగాఁగ నుండు నృపవీరులచైదము, లొక్కట న్నృపా
లకుఁడు మహార్ఘముల్ వలువలన్ జతనంబున వ్రేలఁగట్టి కే
శికిఁ జనుదెంచినట్టి వెలలేమలఁ గన్గొని " కాంతలార ! మీ
రొకరొక రేగుదెంచి యొకటొక్కటిగాఁ గొనుఁ డీదుకూలముల్. ౫

చ. అనవుడు స్త్రీస్వభావమున నాత్మల సిగ్గొకకొంత దోఁప న
వ్వనిత లొకింత గొంకియును బార్థివునాజ్ఞను దాఁటరామిఁ గై

కొనుటకు సిద్ధమౌనెడల "గోపికలన్ బలె మీరుఁగూడఁ గై
కొనవలె నేనుదక్క మఱికొండొక రెవ్వరు లేరుగా? యిటన్." ౬

ఉ. నావుడు నవ్వేలందుకలు నవ్వుమొగమ్ముల సిగ్గు మూఁగఁగాఁ
"బూవులవిల్తుఁ డిట్టివెడబుద్ధులు వుట్టఁగఁజేయు నెట్టిస
ద్భావులకేని" యంచు నెడఁదం దలపోయుచు నేవగించుకొం
చావలి కష్టపెట్టి రయి దంచెను; నెందొకతేమ నెట్టనన్. ౭

క. "ఆయనకు తేని సెబ్బితి. సీ! యనె నాకేటి" కంచుఁ జిత్తమునందున్
దాయక యోజించెనొ? యే, మో? యెప్పని కెఱుక దానియోజనతెఱఁగుల్

చ. అలరుచు డేఁను గన్గొన దిగంబరయై యొకతెప్పపాయలో
పల నలపల్వలందు నొకపల్వను చీసి ధరించె భూషణం
బులమిఱుమిట్లు సాయపడి పొల్తుకకున్ దెరచీరచాడ్పునన్
దొలకరిమించు రై వెలిఁగెఁ దోడిచెలు ల్నగి రాత్మలం బొరిన్. ౯

క. అటు చిటికలో బనారసు
పటమున్ ధరియించు నల్లపడఁతికి వఱఁడై
అటుపిమ్మటఁ బూర్వపు వెల
మిటాకిపైఁ జూపఁడయ్యె మేలు నృపతియున్. ౧౦

చ. వలువకు సిగ్గుమాలు నలవారవధూటిని రాణిఁ జేసి భూ
తలపతి గారవించి ప్రకృతంపువధూటికి నిచ్చుచుండె ము
న్నెల కిడునట్టిజీతమును; నీతిని దాఁటక యవ్వేలంది వ
ర్తలె నలరాజుపేరిటనె రిత్తప్రవర్తన లేక సాధ్వియై. ౧౧

క. కూఁతునకుఁ బెండ్లిసేయుట,కై తల్లి యతించి తుదకు నర్షుఁ డెవఁడు జా
మాత తటస్థింపమిఁ ద,న్మాతవిచారించుచుండె మది నల్లునికై. ౧౨

తే. అట్టియెడ నన్యజాతికన్యకలఁ బెండ్లి
చేసికొనుట కభ్యంతరస్థితిని దొలఁచు
సంఘసంస్కారియొక్కఁ డాచానఁ బెండ్లి
చేసికొనె బ్రాహ్మణసుతుండు శిష్టకులుఁడు. ౧౩

వ. కాని యావివాహబంధముగూడ నంతంతపాటిదియై కొలఁదికాలమునకు మరల నలవెలచానకుఁ గులవృత్తిప్రవర్తనంబె శరణ్యంబై చాలఁ గాలం బతిక్రమించె. ౧౪

ఉ. ప్రాయముప్రొద్దు వ్రాలునలపట్టున నాపె ననుగ్రహించి నా
రాయణమూర్తి యొక్కయనఘాత్ముని స్వీయపచారవిందపా
రాయణుఁ గోడెకానిఁగఁ బురాకృతపుణ్యమునన్ ఘటించె న
జ్జాయతనేత్రి కక్కతన నబ్బె సదాచరణప్రచారముల్. ౧౫

క. ధనికుం డుద్యోగియుఁ గడు,
ఘనుఁడు సదాచారుఁ డతఁడు కాఁడు భుజంగుం
డనఘుఁడె యయ్యుఁ బురాకృత
మున దీనిం గొనఁగవలసె మూఁడవ సతిగా. ౧౬

చ. ఇరువురు భార్య లాయనకు నింతకు మున్ గతియించి రందు నొ
క్కరితకు నొక్కఁ డింకనొకకాంత కొకండును బుత్రులుండి ర
ప్పురుషునఁ బెండ్లియాడవలె బాలిక; నాయమ కీడు వచ్చి కా
పుర మొనరించునప్పటికిఁ బున్నెపుఁగాలము నంతయున్ జనున్. ౧౭

ఆ. ఆత్మసుఖము గోరి యబ్బాలసుఖమును
జెఱుచుపొంతె నా సుశీలఁ ద్రొప్పి
కొనక సాహసించి కొసకు రూపాజీవ
నుంచి కొనియె "నిదియె యుక్త" మనుచు. ౧౮

వ. అక్కాలమ్మున వితంతూద్వాహమ్ము లనియు నేమో యనియు నేమో యనియు మఱికొన్ని సదుపాయమ్ము లున్నను నతండు పూర్వాచారపరాయణుం డగుకతన నందుల కొడంబడఁ డయ్యె. ౧౯

ఉ. కొందఱు కాటికేగుతఱిఁగూడ వివాహము చేసికొందు రే
పందలొ పిల్లనిత్తు "రిది పాపపుఁ గార్య" మటంచు నెవ్వరే

నిందము మూఁడు వారలఁ గణింపరు పరిస్తుతబుద్ధిశాలి యే
నిందయుఁ గొంచె మున్నను మనీషిహితంబె పొనర్చె నెమ్మెయిన్. ౨౦

ఉ. ఇందును గూడ దోస మది యించుక యుండకపోదు గాని క
న్యం దుదిప్రాయమందున ధనంబిడి పెండిలి యాడు తప్పుక
న్నం దురితమ్ము తక్కువని నామదికిం బొడకట్టు భార్య వో
నెందఱొ పెండ్లియాడరు మనీషులు వారి నుతింప శక్యమే? ౨౧

క. వారు మహాఋషితుల్యులు. వారు వివేకులు ప్రశస్తవర్తనులు ప్రపం
చారాధ్యులు వారలపద, సారసములు మ్రొక్కఁదగుఁ బ్రశంసింపఁదగున్

ఉ. వారి నటుంచి పెండిలికి వాటముగాని వయస్సునందు సం
సారపుబండిచక్ర మది జాఱుకు జారుఁడుగాక గేస్తు వి
స్తారధనాఢ్యుఁడేని వెలసారసనేత్రకతాన నాత్మసం
సారపులోటు దీర్చికొనుచందము పెండిలికన్న యుక్తమౌ. ౨౩

వ. ఇట్టిది మహాధనికవిషయము సామాన్యగృహస్థులకు జితేంద్రియత్వంబు శరణ్యంబు సభాపూజ్యతకనియును కర్మాచరణంబునకనియును వార్ధకమునఁ బెండ్లియాడువారు పలువురు గలరు, వారిగుఱించి యిందుఁ బ్రసంగింపఁ దలఁపనని పెండియు ౨౪

క. శృంగారరసము పెండిలి
కిం గావలసినరసంబు కేవల మది వృ
ద్ధుం గాంచి దూరముగ నే
గుంగద? వృద్ధుండు పెండ్లికొడుకగుటెట్టుల్. ౨౫

వ. అది యట్లుండెఁ బ్రస్తుతము వినుండు ౨౬

ఉ. ఆయన కచ్యుతార్చనమునందున శైశవమాది శ్రద్ధ మెం
డై యలరారు నక్కతన నక్కృతి తప్పకచేయుచుండు నా
రీయువతీవతంసమును రోజుకు రోజుకు భక్తి హెచ్చి నా
రాయణపాదదాస్యమునయందు మదిన్ లగియించి వర్తిలెన్. ౨౭

చ. తనకులభుక్తి మాని వనితామణి వైష్ణవభక్తియుక్తయై
తిను ఫలమూలశాకములు, తిర్మణియుం దిరుచూర్ణమున్ ధరిం
చును శుచిశుభ్రతల్ గలిగి సూరు లొనర్చినస్తోత్రములే పఠిం
చును గతజన్మపాపములు శుష్కములై వెస రూపు మాయఁగన్.

ఉ. ఆయనఘుండు సౌధమునయం దొకదేవళమున్ ఘటించి నా
రాయణవిగ్రహం బునిచి యన్వహమున్ యజియించు వేశ్యయున్
సాయమొనర్చు నప్పుడు సన్మతులౌ హరిదాసు లేగ నా
శ్రీయుతుఁ డట్టిదాసులకుఁ జేయుఁగథల్ వినుచున్ బహూకృతుల్,

ఉ. ఆయన వేశ్యకున్ విటుఁడె యయ్యుఁ బ్రవర్తనమందు లేశమున్
రోయఁగఁ దగ్గదోసములు రోసినఁ గన్పడకున్కి బందుగుల్
రోయక వచ్చిపోవుదురు రోవెలఁదిన్ గనినట్లుగాక వా
రీయువిదన్ గులాంగనగనే కనుచుందురు పేర్మిపెంపునన్ ३०

చ. ప్రతిదిన మాత్మసౌధమున భాసిలుదేవుని మ్రొక్కి యేగున
య్యతివయు దేవళంబునకు నచ్యుతుదర్శనముం బొనర్ప శ్రీ
పతి నుతియించి భార్యలకు భక్తిప్రపత్తియు నొప్ప మ్రొక్కి "నా
పతితతఁ బాపుఁ" డంచుఁ బలుభంగుల వేడికొనుం బొరింబొరిన్. ३१

ఉ. జవ్వనమేగువేళఁ దొలిజన్మఫలంబున నబ్బినట్టి యా
మవ్వపువైష్ణవాగ్రణి సమాగమ మన్నివిధాల "జాజి మేల్
పువ్వులునుం బ్రసాద" మనుపోలిక నావెలపూవుఁబోఁడి యన్
గవ్వను రత్నమున్ సలిపెఁ గన్గొనువారల కక్కజంబుగన్. ३२

చ. జని సకలం బిటుల్ నడిచి చాల వయస్సు నతిక్రమించి పై
జని నది యీలతాంగి యయి సద్గుణరాశిగఁ బుట్టెఁ "బూర్వపున్
జనిసుకృతంబు దుష్కృతము సర్వము నిర్వహణం బొనర్చు" నం
చనుట యథార్థ, మూరక మహాత్ము లసంగతముల్ వచింతురే? ३३

క. తొలిజన్మంబున నీసతి
కులవృత్తిన్ జవ్వనంబు గొండొక పాపా
విలముగఁ జేయుటచే వెల
వెలఁదుక గర్భమునఁ బడి వివేకిని యగుచున్. 34

క. వెలనె ననంతరసుకృతపు, బలిమిని, సుకృతంబు గాని పాపము గానీ
తొలిజన్మంబున సలిపిన, విల నీజన్మమునఁ గుడువకే తీరెడినే ? 35

సీ. బహుజన్మకృతపాప పరిపాకతూలరా
శికి సాధుసంగంబు శిఖికణమ్ము
అవివేకజనిత మౌఢ్యాహంకృతిధ్వాంత
మునకు సత్సంగమమ్ము రవిదీప్తి
కామలోభాది దుష్కరశత్రువర్గమ్ము
నకు సాధుసంగ మ్మనలమహాస్త్ర
మురుతరాపద్ఘోర శరదపరంపరా
గతికి సత్సంగం బమితపుగాలి

గీ. ఎన్నిజన్మమ్ములనొ రచియించినట్టి
పున్నెము ఫలించినప్పుఁడే పొందు నరుఁడు
సాధుసంగంబు; దీనికి సాటి చెప్పఁ
గాఁ దగిన దెయ్యదియు లేదు లేదు లేదు. 36

చ. వెలవెలికిన్ జనించియు వివేకవిహీనముగాఁ జరించియున్
దల నరయంగఁబోవునెడఁ దామరసాక్షునిభక్తు గేస్తు ని
ర్మలు భజియించి యక్కతన మంచిగొనమ్ముల కిక్కయై హరిం
గొలిచి తరించె నిమ్మతివకున్ సరి వత్తురె ? యేవెలంతలున్. 37

గీ. ఎంత మంచికొలమ్మున నెంత మంచి
దంపతులకు జనించిన ధన్యుఁడేని

సాధుసాంగత్య మబ్బనిజన్మమునకు
లే దిహంబును బరమును లేదు లేదు. ౩౮

ఆ. ఎన్ని సద్గుణమ్ము లిల నుండె నవియెల్ల
సాధుసంగమమున సంభవించు
నెన్ని దుర్గుణమ్ము లిల నుండె నవియు న
సాధుసంగమమున సంభవించు. ౩౯

క. సురహరిహరలోకంబుల, కరిగి సుఖంబు గనుకంటె నాసుఖమెల్లన్
బొరి సత్సమాగమమ్మున, నరుఁ డందఁగవచ్చు నీజననమున నెందున్.

క. ఒకరిన్ గించి త్తన రాం
డొకరివలనఁ బడరు సుజను లొకమాటయు. మం
చికిఁ గానిది వలుకరు వా
రికతానన్గాదె ? నిలుచుఁ బృథ్వి యచలమై. ౪౧

సీ. తలక్రిందుగా వేదములనెల్లఁ జదివి యం
దుద్దండబిరుదాళినొందుకంటె
షడ్దర్శనములం దసామాన్యపాండిత్య
మార్జించి బిరుదంబు లందుకంటెఁ
దగఁ జతుర్విధకవిత్వవధాన సంధాన
మునఁ బేర్చి బిరుదముల్ గొనుటకంటెఁ
దుంబురు నారదాదుల మించు గానసు
శ్రీ గాంచి బిరుదు లార్జించుకంటె.

గీ. భూపతిత్వంబు గొని జనుల్ వొగడఁ గొన్ని
బిరుదముల్ గొనుకంటెను నరుఁడు "సుజనుఁ"
డనెడిబిరుదు నార్జించుపే యధికకష్ట
మెంతయో పుణ్యమున నబ్బు నిట్టిబిరుదు. ౪౨

గీ. చదువుచేఁగాని యొరులయా శ్రయముచేతఁ
గాని "సుజనుం" డనెడిబిరు దేనరునకు
వచ్చినట్టులు వినము పరివర్తనమున
వచ్చుఁ గొందఱు గల రట్టివారు జగతి. ౪౩

గీ. ఇతరబిరుదులతోఁ బని యిహమునంద
కలదు పరమున నవ్వానిఁ గనరు సుంత
"సుజనుఁ" డనుబిరు దిహమునఁ జూతు రవలఁ
బరమునందును జూతు రాబిరుదె బిరుదు ౪౪

ఉ. వారల ప్రాపు గోరవలె, వారిఁ గనన్వలె వారితోడ వ్యా
పారము సేయఁగావలయు వారల కిచ్చుచుఁ గైకొనన్వలెన్
వారలపిల్లకాయలను భద్రము లందెడి కోర్కి యున్నచో
వారికి మించి సేవ్యమగు వస్తువు లేదు జగాన నెయ్యెడన్. ౪౫

క. వారికిఁ బరమేశ్వరునకు, వార విశేషించి కానఁబడ దిలలో సం
సారికి వారికి మించిన, తారకమంత్రమ్ము లేదు తథ్య మ్మరయన్.

క. పరమాత్మకు వారికి ద, గ్గఱచుట్టఱికమ్ముకలిమి కనిపెట్టి జనిన్
దరియించు మానిసులు స, త్వర మవలంబింపవలయుఁ దత్పదసేవన్.

గీ. ఇతరమతములకన్నఁ దా నీవిషయము
శైవవైష్ణవమతములు జాల గార
వించు, భాగవతముఁగూడ విలువ దీని
కెచ్చుగా నిచ్చె నిది తరియించు త్రోవ. ౪౮

క. సుజనులు గాకుండియుఁ గడు
సుజనత్వ మ్మభినయించు సోమరులు తమున్
"భజియింతురు ప్రజ" లనుకొని
విజయంచేయుటయుఁ గలదు వేషము లలరన్. ౪౯

ఆ అట్టివారిఁ జేరు టంధకారపుఁ ద్రోవ
యైన నగునుగాక ఆత్మశుద్ధు
లైనవారి కదియు నఘవిదారకమ యౌ
వారికపట మదియు వారిఁ జెఱుచు. ౫౦

వ. ఇయ్యది విషయాంతరంబు దీని నిట్లుంతము. ౫౧

చ. ఎఱిఁగి యొనర్పకున్నఁ బరమేశ్వరభక్తుల సేవ "మంచికిన్
దెఱవగు" నంట కీవెలసతీమణివృత్తియె సాక్ష్య మిచ్చె న
గ్నిరుచి నెఱింగి తాఁకిన నొగిన్ బొరపాటునఁ దాఁకినన్ స్వత
స్స్ఫురణము నొక్కటేగతిని జూపుట యెరికి స్వానుభూతమే. ౫౨

వ. ఇట్లు పొత్తమ్ముఁ జూచి యందున్న సూత్రప్రాయములగు నంశమ్ము
లకుఁ దనవ్యాఖ్యానమ్ము జోడించి యేకరు వెట్టుచుండ వా రిట్లనిరి.

ఆ. ఈమె పూర్వవృత్త మీపొత్తమున నున్న
దీవు చెప్పినాఁడ విది యథార్థ
మగునుగాక దీనియందు నమ్మిక మాకుఁ
గల్గుటెట్లు ? నీకుఁ గల్గుటెట్లు ? ౫౪

వ. మే మింతకుమున్న యీమె ప్రకృతజన్మచరిత్రంబు గొంత వినియుం
టిమి దానింగూర్చి వివరించితివేని యప్పు డిద్దానిమహత్త్వంబు మాకుం
దేటతెల్లం బగు ననవుడు యోగి "వల్లె" యని యప్పొత్తమ్మున మఱి
కొన్ని పత్రంబులు తిరుగవేసి చదువం దొడంగె నావుడు మునులు సూ
తుం గాంచి. ౫౫

గీ. ఎన్నియొ పురాణగాథల నీవు మాకుఁ
జెప్పియుంటివి మ న్నిట్టిచిత్రగాథ
చెప్ప వెప్పు డియ్యదియు నీచేతఁ గల్పి
తంబొ ? కాకున్న నిది యథార్థంబొ ? యేమొ ? ౫౬

క. ఏమైన దైవభక్తిని, సామాన్యు లెటుల్ తరింపఁ జాలుదురొ ? తదు
ద్దామస్వరూప మిక్కత, చే మాకున్ దెలిసె సంతసించితి మనఘా.

గీ. వృద్ధనృపతియు వైశ్యుండు వేశ్య యల్ల
యనఘుఁడగు యోగికతన నేయర్థ మెఱిఁగి
రదియు నట్లుండ వార లనంతరమున
నెట్లు చరియించి రెఱిఁగింపు మిద్ధచరిత. ౫౮

వ. నావుడు సూతుం డట్లు యోగి చదివినవేశ్యాపుత్రి గతచరిత్రమ్మునకును
నాపెవలనఁ దాము విన్నదానికిని లేశంబును భేదంబు లేకుంటకుఁ
బరమాశ్చర్యంబు నంది వారలు యోగిం బ్రశంసించిరి పదంపడి తేఁడు
తనభూతకాలవృత్తాంత మ్మెఱుంగం దలంచి ప్రశ్నించుటయు నయ్యోగి
వర్యుండు. ౫౯

ఉ. ఈవు మహానుభావుఁడ వహీనపరాక్రమశాలి వుత్తమం
బౌవిధి భూమినేలితి వహంకృతిదూరుఁడ వౌచు; నీకు దు
ర్భావుఁ డొకండు మంత్రియయి రాజ్యము దాఁగికురింప నెంచి నీ
చేవకు మించు శత్రునృపుచెంతకు నేగి వంచించె నీగతిన్. ౬౦

ఆ. మీరు మానృపాలుమీఁదికి దండెత్తి
రాఁదలంచు టది గరంబు నే నె
ఱింగినాఁడ మీకు సంగరంపుఁ బరిశ్ర
మం బదేల ? నాదు మనవి వినుఁడు. ౬౧

గీ. చతురుపాయమ్ములందు నీచతరమైన
నగునుగాక భేదోపాయ మతిసుఖంబు
రక్తపాతంబు దీన విరళముగాన
రాజనీతిజ్ఞుల కిది కరంబు హితము. ౬౨

క. ఈవిధమున వాక్రుచ్చిన
నావిభుఁ "దివ్వాఁడు ద్రోహి": యని యెఱిఁగియు సం

భావించి "యిచ్చితిని వర
మీ వెటు మెలఁగెదవొ ? మెలఁగుము ?" యని పనిచెన్. ౨౩

క. పదపడి నృపునానతిఁ గొని,
"అదను నిరీక్షించుచుండు" మని చెప్పి కడుం
బదిలముగ స్వస్థలమునకు
నెద ముదమందుచు నమాత్యుఁ డేగెఁ దనంతన్. ౨౪

ఉ. వచ్చె ననంతరమ్మున సవప్రముఖాఖిల సత్కృతిప్రభా
భ్యుచ్చయకారణంబు ద్విజహోమ మహోత్తమ ధూమగంధసం
పచ్చయ ధూతకల్మషము పాదపజాలవిలగ్న మర్విభా
పచ్ఛ్రీకృతిప్రవణ భవ్యగుణంబు వసంత మొంతయున్. ౨౫

క. ప్రతివత్సరము వసంతపు, ఋతువునఁ బానకము ప్రజల కిడి తా భూమీ
పతి పుచ్చుకొనెడి దొకఁ డ.ప్రతిమానము జరుగునుత్సవము మీపీటన్.

వ.ఇంతదనుకం జదివి యయ్యోగి గ్రంథమ్ము మూసి "యేమి రాజేంద్రా!
విన్నంతవఱకుఁ దార్కాణంబుగా నున్నదా?" యని ప్రశ్నించుటయు
దేఁడు 'కడుంగడుఁ దార్కాణంబుగా నున్న'దని ప్రత్యుత్తరం బిచ్చెఁ
బదంపడి యోగి యనంతరచరితం బిట్లు వక్కాణించె. ౨౬

క. ఆయుత్సవమ్మునాఁడే, నీయిల్లయమాత్యుఁ డిడియె నీకు విషము నీ
కాయువు దీర్ఘంబై యూ,ప్యాయంబుగఁ గ్రోలి చచ్చి బ్రదికితి మరలన్

క. పానకమున విష మిడి నీ.వానుటగని నీదుమంత్రి అశ్వారూఢుం
డై నగరము విడి యరిసగ,రానకుఁ జని చెప్పెఁ దనపరాక్రమ మెల్లన్.

వ. చెప్పి "యిప్పటికె నృపాలుం డసువుల విడియుండు నీసులజడియంద
తాము దండెత్తితిరేని రాజ్యంబు సులభసాధ్యం బగు" నని చెప్పుటయు
నాతఁ డట్లొనర్చి యయ్యమాత్యు భదరింబుగాఁ దనవీట నుండ నియ
మించెఁ బదంపడి. ౩౦

క. భవదాప్తుం డాయుర్వేదవిశారదుఁ డొకద్విజుఁడు సుధాహస్తుఁడు నీ
సవిధమున నుండుకతమున, నవసియు బ్రదికితివి కొన్ని నాళ్ళకు నీవున్

వ. నీవు విషబాధామహావిపత్సముద్రమ్మునం బడి 'కిందెట్టు మీఁదెట్టు'గా
నుండుటయు, మంత్రి దుర్గనుండై శత్రుగతుం డగుటయుఁ గారణమ్ము
లుగా నతిస్వల్పం బయ్యు శత్రుసైన్యంబు నీరాజ్యం బాక్రమించునదిగాఁ
దోఁచి యితికర్తవ్యతాశూన్యంబగు నాసమయంబున నీకొక విజ్ఞానజ్యోతి
యుదయించి మనంబు విరాగాయత్తంబై శత్రురాజునకు నీ విట్లు వార్త
నంపించితి వది యెట్లంటేని. ౭౨

ఉ. ఏసును నాదురాజ్యము నహీనము నాబలఁగంబుఁ బుత్రు లీ
నానళినాక్షి యీక్షణమునన్ భవదీయధనంబ; మాకు నే
మేనిడు మీయకుండు మది నీమదికే వదలంబడెన్ భవ
త్సేనకతానఁ బౌరులకు నేగి ఘటింపమి నేను గోరెదన్, ౭౩

చ, అది గని తేఁడు సిగ్గువడి యాత్మ నలందురి 'యౌర ! యెంతత
ప్పిద మొనరించినాఁడ విషపీడితుమీఁదికి నేన నంపి; కో
విదజనదూషితంబు నొకవెంగలి చెప్పినమాటఁ గర్జ మొ
ప్పఁ దగునె ? కీర్తిలేని క్షితిపాలన మేటికిఁ బొట్టకూటికే. ౭౪

క. తినవే ? పక్షులుఁ బురువులు
మనవే ? మనుజుఁ డయి పుట్టి మంచియుఁ జెడ్డం
గనక ధనలోభమునఁ గడు
ననుచితము లొనర్చుకన్న నఘ మొకఁ డున్నే ? ౭౫

శా. ఈవేళన్ మృతియేని రేపటికి రెం డేతాదృశంబైన యీ
జీవమ్మందును గాయమందును సుతస్త్రీబంధుగేహాదులం
దేవారేనియు నాస నేయుటది తప్పే యెక్కుచోఁ జేసినన్
భావింపన్వలె 'నెంత సత్య' మనుచున్ బ్రాజ్ఞుండు లోలోపలన్. ౭౬

వ. సకలమ్ము నెఱింగియు లోభోపహతచేతస్కుండనై యుక్తాయుక్తవిచా రశూన్యుండనైన నా కిమ్మహితుండు చక్కనిగుణపాఠ మ్ముపదేశించె నని వెండియు. ౨౨

మ. మహి యెల్లం దనయేల్బడి న్నిలిపె నామాంధాత యున్నాఁడె? నేఁ డహిలోకమ్మును మించులోఁతు గలయమ్ముంభోధిలో సేతు వే మహనీయుం డొనరించె ధీరుఁ డలరామస్వామి యున్నాఁడె? ధూ ర్వహు లున్నారె? యుధిష్ఠిరప్రభృతు; లేరాజేగె నీభూమితో? ౨౩

వ. ఇట్లు లోభోపలమి సుఁపలఁ బశ్చాత్తప్తుండై తనయాంతరంగికామాత్యుం బిలువనంపి యతనితో మంతనంబునఁ దనపరితాపంబు వాక్రుచ్చుచుఁ దాత్కాలికంబుగ స్మృతిం దవిలిన యొకయితిహాస మ్మప్పటి తనయవి వేకమ్మున కుదాహరణంబుగా నుంటంజేసి యి ట్లుపన్యసించె. ౨౪

చ. ఎఱుఁగుదువే? మరాలన్నృపు నీతనిభార్య కొకండు దాసి కొ క్కరుఁడుఁ గుమారకుల్ గలరు గాని ప్రతాపము లోనుగా గుణో త్కర మది యెల్ల నెక్కుతమొ? దాసితనూజునకే ఘటించె వేఁ దుఱుగతినుండు నన్నృపతి తొయ్యలిపుత్రుఁ డెఱుంగఁ డేమియున్.

వ. నరపతియుఁ జిరకాలంబు రాజ్యం బేలి పరమపదించునవసరమ్మున మహిషీతనూజునకు మూఁడుపాళ్ళను దాసీపుత్రున కొక్కపాలునుగా రాజ్యంబు విభజించి యిచ్చి "క్షీరనీరన్యాయమ్ముగ వర్తింపుఁ" డని బో ధించి చనియె; ననంతరము గొన్నివత్సరమ్ములు తదుపదిష్టప్రకార మ్మునఁ బొరపొచ్చెమ్ములు లేక యిరువురును వర్తించిరి; పిమ్మట ౨౫

క. దగ్గఱనుండెడి పిశునులు, ప్రెగ్గడ లలరాచకొమరు పేలవతలపం బెగ్గును లగ్గు నెఱుఁగ దని, యిగ్గతి బోధింపఁదొడఁగి రిష్టులపోల్కిన్

ఉ. నీవు నృపాలపుత్రుఁడవు నీదగునెంగిలికూడు మెక్కుచున్ జీవనమున్ బొనర్పఁదగు సిబ్బితినాతియపత్య మాతఁ డే

దేవునసుగ్రహమ్మునసౌ ? దీనత దక్కె నృపాలుఁడై భవ
ద్భీ విభజించి పుచ్చికొనె సగ్గగు నాతనిచర్యఁ జూచినన్. ౮౩

తే. తండ్రి తనతల్లియందలి దయనుబట్టి
తనకును "జమీ" నొసంగిన దాసికొడుకు
రాజునకు దీటు వచ్చునే ? రాజచిహ్న
మెల్లఁ దాఁ దాల్చి యూరేగు టెంత వింత ? ౮౪

ఆ. రాజుకొడుకు దక్క నేజనుండునుగూడ
ఛత్రచామరములజంట నొక్క
ఛత్రమేనిఁ దాల్పఁ జనదన్న నుభయమ్ము
దాసికొడుకు దాల్పఁ దగునె ? యకట ! ౮౫

క. "కలికాలమహత్త్వ" మ్మని
పలువురు పలుగతుల వీటఁ బలికెద రవి వీ
నులు సూడినట్టు లగుఁ బ్రతి
వలుకము చెప్పఁదగు నొకజవాబును లేమిన్. ౮౬

క. మీయమ్మగారి కియ్యది, యాయాసకరమ్ముగాదె ? యధిపా ! మీరల్
ధీయుతులు సర్వమెఱుఁగుదు, రేయది కర్తవ్య? మరసి యేర్పఱుపుఁడొగిన్

వ. నాపుడు నయ్యమాయికుం డాసూచకుల దుపదేశంబు తలకెక్కి యా
దాసీతనుజన్ముపై దండెత్తి యేగి తత్పట్టణమ్ముదరి విడిసి రణభేరి
మ్రోఁగించె. ౮౭

చ. అతఁడు వివేకి గావున జయం బవలీలగఁ దన్నుఁ జెందుటల్
మతిఁ బరికించికూడఁ దనమానస మందుల కొప్పమిన్ గృత
జ్ఞత కిరవై నిరాయుధుఁడుగాఁ జని మ్రొక్కి "యిదేటికన్న ? నీ
కుతుక మెటుండె నట్లె పనిగొమ్ము ననున్ భవదీయదానుఁడన్. ౮౮

మ. "ఇదిగో ! సర్వము నీయధీన; మిపుడే యే నేగుచున్నాఁడ నా
యది యిందొక్కఁడు పూరిపుల్లయును లే" దంచు న్నివేదించి కో

విదు లెల్లన్ దను మెచ్చఁగా నరిగెఁ బృథ్విన్ సర్వ మేకాతప
త్రదశన్ బాలనసేయుచున్న యలసమా(గ్రిజ్మౌళి దర్శింపఁగన్. ౬౯
వ. అట్లు సందర్శించి కొండొకకాలం బలచక్రవర్తి కొలువు సేయుచు జాగ
రూకతతో మెలంగుచుఁ దదనుగ్రహపాత్రుండుగా నుండునంత. ౭౦
ఉ. కప్పము గట్టు నొక్క నృపకాంతుఁడు కప్పముఁ గట్ట మాని యే
చొప్పునఁ ద్రోవకున్ జనక శూరత చూపఁ గడంగి వానిపై
కప్పుడు సేనతో నితని నంపెఁ దదీశు జయించి తేనికిన్
మెప్పు గడించె నీతఁ డలమేదిని యీతని కిచ్చె నాతఁడున్. ౭౧
వ. అట్లు స్వార్జితధరాధిపత్యంబుతోఁ జిరకాలంబు సుఖించి యవసానకాలం
బున మరలఁ దనయన్నను స్మరించికొని సగౌరవంబుగ నాతని నాహ్వా
నించి సవినయమ్ముగ నిట్లనియె. ౭౨
క. నీతండ్రికి జనియించుట,చేత న్నేనేమొ? కొంతసిరి కర్హుఁడనై
ఖ్యాతల మేలితి నియ్యది, నాతోడనె యాఁగు టొప్పు నరనాధమణీ !
క. నీచకులోద్భవుల కెటో, రాచతికం బబ్బఁగాక రాణించునె? యే
కాచమ్మొ మంత్రియై ఘన,కాచార్యకమై యడంగు నదియున్ ద్వరలో.
ఆ. అట్టిజేనియొద్ది కాత్మాభిమానంబు. గలుగువార లెవరు కాలు వెట్ట
రట్టులగుట 'నాదునన్వయం బిందుకుఁ దిగ' దటంచు నే నెదన్ దలంతు
వ. "అట్లగుటంజేసి నాకొమరులకును గూఁతులకును దక్కుంగల పరివార
మ్మునకును నీకుం దోఁచినట్లు జీవనోపాధుల నేర్పఱచి పోషింపుము
నేనిదె చనుచున్నవాఁడ; నీకున్ దయగలదేని నాయుత్తరక్రియలు
నీవ యొనర్చుట మదభీష్టం"బని తనరాజ్యం బన్నకు నివేదించి కవిజన
శ్లాఘ్యంబగు నుత్తమగతికి నతం డరిగె, నన్నయు గతమ్మునకు లజ్జిం
చుచు నతండు చెప్పినచొప్పున నొనరించె, నతనింబలె నన్నును లోక
ము చెప్పికొనుదుస్థితి తారసించె నిఁకనేని మెలఁకువ గలిగి మెలఁగని
యెడల నిహపరమ్ములు రెంటికింగూడఁ జెడవలసి వచ్చునని వెండియుఁ

శా. "లక్షల్ గూర్చెదఁ గోట్లు కూర్చెద సిరుల్ రక్షింతు భక్షింతు న
ధ్యక్షత్వమ్ము వహింతు" నంచు నిటు లూహల్ సేయు పేకాని తా
యక్షేశుం డగునే? యథోచితముగా నావేళ కావేళయే
కుక్షిం దేల్చెడివారెపో? జగతిలోఁ గోటీశచూడామణుల్. ౯౭

వ. నావుడు మంత్రిసత్తముండును రాజానుమతంబుగాఁ దనయభిమతంబు వెలిపుచ్చిన నృపాలుండు సంతసించి చయ్యన నీకడకుం జనుదెంచి గత మ్మునకు వగచి నీరాజ్యమ్ము నీకు నివేదించి తనరాజధానికిం జనియెఁ గాని తత్త్వవేత్తవగు నీకది రుచింపక. ౯౮

ఉ. "ఎందఱు దేవతల్ చనిరి యెందఱు తాపసు లట్టె భ్రష్టులై
రెందఱు రాజు లేగిరి మఱెందఱు యోగులు భోగులైరి గో
విందుని పాదపద్మములు వీడనిభక్తి భజింపనేర కా
చందము నొందకీవు మనసా! హరిపాదము లాశ్రయింపవే." ౯౯

వ. అనుపద్యార్థంబు నెమ్మదికి నచ్చి విరక్తుండవై యిట కరుదెంచితివి. నీ కొమరులు నీరాజ్యంబు పరిపాలించుచు నున్నవారలు నీయెడల ద్రోహ మ్ము దలఁచిన మంత్రికి శిరఃఖండనమే శాస్త్రచోదితంబగు శిక్షయైనను నందులకు నీయంగీకృతిలేమింజేసి యావజ్జీవకారాగారవాసుం బొన రించి కులాచారమ్ములకు భంగంబులేకుండ నలనృపాలుండు కాపాడు చుండె, నమ్మంత్రియుఁ దనచేసిన యకార్యమ్మునకు వగచుచు నిప్పు డచ్చట నొకతపస్వియై యున్నవాఁడు. రాజేంద్రా! యియ్యది నీచరి త్రంబు. నావలన నింకేమి మీరు వినఁదలంతు రనుడు రాజర్షి సత్త ముండు వృద్ధవైశ్యునిజాతకవిశేషంబులుగూడ విననలయు నావుడు నతండు వారించి. ౧౦౦

గీ. ఈవు ధర్మంబు దప్పక యేలినట్టి
రాజఋషివి నీఘనచరిత్రంబు చెప్ప

వారికిని విన్నవారి కవ్వారిసుకృత
మబ్బు; నాచరితంబు శ్రావ్యంబు గాదు. ౧౦౧

చ. మిముఁ గవఁగూడినట్టి దినమే ప్రథమంబుగ నున్న నాచరి
త్రము సుకృతాలవాల మగుఁ దక్కినినాఁటిచరిత్రమో ? యెదో
క్రమముననుండు వర్తకము కౌర్యము గూర్పదుగాని కొన్ని య
క్రమములు దానిలో సలుపఁగావలయున్ మఱి యెంతవానికిన్. ౧౦౨

వ. నాపుడు రాజవరుం డిట్లను. ౧౦౩

గీ. వర్తకు లొనర్చునట్టి యపారధర్మ
కార్యముల నేన్పపాలురుగాని చేయఁ
గలరె ? దేనియందును గుణగణము వెదక
వలయునే గాని దోషముల్ కెలఁకరాదు. ౧౦౪

వ ఇట్లు వారిరువురును బూర్వపక్షసిద్ధాంతమ్ము లొనర్చుకొనుచుండ న
య్యోగి జేని కిట్లనియె. ౧౦౫

చ. ఇతఁడు ధనాఢ్యుఁ డయ్యు స్వయ మేసుకృతమ్మను జేయలేదు స
త్కృతులు కొమాళ్ళు సల్పుటకు నించుకయున్ సహియింప లేదు త
త్సుతు లొనరించు సత్కృతులు చూడఁగ నోపక యిల్లు వీడె సూ
నృతము వచింప కెట్లొ వివరించెను మీకడ నాత్మవృత్తమున్. ౧౦౬

గీ. కాని మీతోడఁ గలిసినగడియ మొదలు
గలిగె నీవృద్ధునకు ధర్మకాంక్ష మిగుల
నింకమీఁద నీతనివృత్తి మెల్లగతులఁ
బండితస్తోత్రపాత్రమై పరిఢవిల్లు ౧౦౭

వ. అని సూతశ్రిప్రాయమ్ముగా నానెట్టిగతచరిత్రమ్మును భవిష్యచ్చరిత్రమ్ము
ను జెప్పి యెటకేనియున్ జనుతలంపుతో గమనోన్ముఖుం డగుటయు వా
రలాతనియెడఁబాటునకు సహింపక "మహాత్మా! మీ రిటనుండి యెట కే

గెద రింతకు ము న్నేయేపుణ్యదేశమ్ము లరసి యిట కరుదెంచితి రాన తిచ్చి యీమీఁద మమ్ముఁగూడ మీవెంటం గొని పోవలయు నింతకు మున్ను మీ రెచ్చో నేమతమ్మున నివసించుచుంటిరి ?" నావుడు నయ్యోగి యిట్లనియె. ౧౦౮

క. ప్రతిదేశమ్మున సదనము, ప్రతిసదనము యోగికొసఁగు భైక్ష్యాన్నంబున్
బ్రతికాసారం బుదకవ,సతి కగు యోగులకు నొకట సదనం బేలా ?

గీ. సంగ్రహమ్ముగా నాదగు చరిత మున్న
చెప్పితిని దీర్ఘయాత్రలు సేయుతలఁపు
వొడమి బయలుదేఱితి నలుగడలు పుడమిఁ
దిరుగుచుంటిఁ జూచితిఁ బెక్కుతీర్థములను. ౧౧౦

క. మఱియున్ జూడం దగినవి, ధరణి ననేకములు గలవు తత్తత్తీర్థ
స్మరణంబె పాపహరమన, నరసినవారిసుకృతంబు నలవియె పొగడన్.

క. ప్రతిపదమునఁ దీర్థము వి
శ్రుతమగుఁ ద్రికరణములన్ విశుద్ధులకు, మనో
యతి లేని మూఢమతులకు
నతిపావన మమరనదియు నఘకారణమే. ౧౧౨

వ. నావుడు వారలు మహాత్మా ! మీ రారసిన క్షేత్రమ్ములలో సూక్ష్మమ్ము లో నధికపుణ్యప్రదంబగు క్షేత్రం బెయ్యది ? దానిం బేర్కొని తచ్చ రిత్రంబు వాక్రుచ్చి మమ్ముఁ గృతార్థులం జేసి నేఁటి కింద యుండి మాయొసఁగు నాతిథ్యమ్ము గైకొని రేపకడ మాతోఁగూడఁ దీర్థయాత్ర లొనరింప ననుగ్రహింప నంగీకరింపుఁ డని కోరుటయు నతం డట్లకాక యని సమ్మతించి నాఁటి కంద నిలిచి వార లొసఁగు ఫలమూలమ్ముల నాహరించిన యనంతరంబునం దొకక్షేత్రంబుంగూర్చి యిట్లు వచించె.

చ. కల దొకపర్వతంబు కలికాలదురంత మహాఘవాసనా
బలవినివారణప్రథిత పాదపసంగత పక్షిజాలవా

గ్ధళితసమస్తమానస వికార మనేకమృగావళీ సమా
కులఘనపుంజరంజితము కూటతటీస్ఫుటితాభ్ర మొక్కటన్. ౧౧౪

సీ. ఆపర్వతమ్మునం దాదియుగమునుండి
శ్రీమహావిష్ణువు సిరినిగూడి
వసియించు ననియు నెవ్వనికిని గనరాని
పరమాత్ముఁ డైన యవ్వాసుదేవు
సేవింప దేవతల్ దేవులతోఁగూడ
వచ్చిపోవుదురని వారువారు
ననుకొనుచుందు రిట్లరిగెను గాలంబు
కలియుగంబునఁగూడఁ గడచెఁ గొంత

తే అంత లోకంబునందలి యఘము మిగులఁ
బెరిఁగి భరియింపరామికి వెగటు గదిరి
ఆత్మఁ జింతించి సులభ ముపాయ మొకటి
సేయ నూహించి ఆదినారాయణుంతు. ౧౧౫

క. తనకుఁ బరమభక్తుండై,
తనయునికిని విశ్వసించి తఱచుగ నక్కొం
డను మ్రొక్కుచు వలగొను పై
ఖ్యనికలలోఁ గనఁగనయ్యె నొకరాత్రి తుపన్. ౧౧౬

మ. కనవై కారుణికాగ్రగణ్యుఁడు రమాకాంతుండు "నీభక్తినా
మనమం దెక్కుడు ప్రీతి గొల్పె నిను మన్మంత్రార్థసర్వస్వవే
దివి వైశ్యోత్తము నాదరించుటకు నే దేవీసమేతమ్ముగాఁ
గన్నైతిఁ బనికూడ నొంతు గల దేకాంతమ్ము వాక్రుచ్చెదన్.

ఉ. ఏమని యన్న? దుష్కలిసుమీ! యిది. నాదగునున్కిఁ గూర్చియే
పామరు లట్లయుండఁగను బండితులే మది విశ్వసింప రే

దో ? మతియుంతు లుందు రొకరో ? మఱియిర్వురొ ? నమ్మువార. లి
ప్సామునసంఖ్య హెచ్చి యలపండితులుం(డ్రు నిరాశ్రయస్థితిన్. ౧౧౯

మ. "భగవంతుండు గలం" డటంచు నెవ(డో వాక్రుచ్చినన్ "జూపు" మం
చగణుం జేయుచు వానిఁ బట్టికొని, యీయజ్ఞత్వమున్ బాప నే
మనుస్సన్నవె వారికెల్లర, కటే యోగాక వాం (ఛంతతో
మనసుతిన్ "గ" మ్మన కూరకుండుట యసంభావ్యంబ వేయేటికిన్."

వ. అని యొప్పర్వతంబు కేలంజూపి. ౧౨౦

ఉ. చూపుచు నీవు నే(గలను గన్పడినట్టి విశేష మేరికి
న్బ్రాపు లభింపఁ బోక యిఁక నేఁడు మొదల్ జనులెల్లఁ జూడ నీ
యప్పురాధరంబునకు నేదినమున్ జని భక్తియుక్తి మేల్
పూవుల నన్ను నేమమునఁ బూజ యొనర్చుచునుండు మచ్యుతున్.

మ. అదిగోఁ జూచితె ? రావిచె, ట్టచటనే యస్మన్నివాసం బటన్
బొనలున్ రోఁతున భూమిలో నొకశిలాభూతంబు తేజంబు నా
యదియే: యయ్యదియున్న భూమిపయి నీపర్చింపు మాపూజ కే
మువమ్ము గాంచఁగలాఁడ దీనికతన స్మన్మందు భద్ర మ్మగున్.

క నిను వెంబడింత్రు కొందఱు
మనుజులు, రానిమ్ము వాండ్రిమతి వాతులుఁగాఁ
గను నిన్నుఁ ; గ్రమక్రమమున
మనుజుల నీయెడలఁ గలుగుఁగడు నమ్మికయున్. ౧౨౩

గీ. పలుగువోసల " నిందేది గానరాదు
మట్టినేల పూజించుట వ్యర్థ " మనుచుఁ
బలుక సాఁగిన నీవు నవ్వారికిఁ బ్రీతి
చెప్ప కెప్పటట్టులె పూజ సేయు మనఘ ? ౧౨౪

క. బహుజన్మంబుల నను నీ, వహర్దివముఁ బూజ సేసినట్టిఁడవు నినున్
బహుమానించి సఖించెద. నిహపరములు రెండుగూడ నిదు నిధి నీకున్,

భక్తి గలుగు నరుఁ డొక్కఁడె
శక్తుండై నన్నుఁ గనఁగఁ జాలెడి నిఁక నే
యుక్తియుఁ బొసఁగదు మఱియు వి
రక్తియు భక్తికిని పాటి రా దెఱుఁగఁ దగున్. ౧౨౬

నీ వెఱిఁగిన యీయర్థము, నీవలెఁ బలుమంది యెఱుఁగ నేరరు పాంత్ర
న్నీ వుద్ధరింపఁగావలె, నీవలనం గలి తరింప నేర్తు రనేకుల్. ౧౨౭

ఉ. దేవుఁడు లేఁడు పొట్టపని దీరుటయే పరమార్థ మన్నదు
ర్భావము పూర్తిగాఁ బ్రబలి పాడఱుచున్నవి కొన్ని దేశముల్
వావిరి నాఁడునాఁటి కలవాసన సోఁకి పవిత్రమైన యీ
భూవలయమ్ముగూడఁ జెడుపోడిమి కన్పడు టీ వెఱుంగవే ? ౧౨౮

ఉ. "కుక్కల నక్కలం దినుటకూడ నిషిద్ధము కాదు యుక్త" మం
చక్కట ? కొన్ని దేశములయం దిపు డట్టులు మెక్కి పుష్టి పెం
పెక్కి యధర్మయుద్ధముల నెత్తి నశించి నశింపఁ జేయునా
యిక్కటు నీవెఱుంగనిదె? యిక్కటువర్తన సహ్య మెట్లగున్. ౧౨౯

క. "యాదవకులముసలమ్ముల", చే దౌర్భాగ్యము నశించుచెయిది సకల మా
మోదింతు నేను ఘన్ను య,శోదకొడుక నైననాఁటి చొప్పెఱుఁగుదుగా?

మ. పొగరుంబోతుతనమ్ముచేతఁ గలుషమ్ముల్ సల్పువాం డ్రెట్టులోఁ
తెగటాఱన్వలె నంతొ ? యింతొ ? మదిలో "దేవుం డొకండుండె భ
క్తగణంబున్ గరుణించువాఁ," డనెడి భక్తశ్రేణికష్టంబు వా
పఁగ నే నెప్డు మదిన్ దపింతుఁ జెడఁ డెవ్వాఁడు న్నను న్నమ్ముచో.

శా. ఏదేశం బెటులైననేమి ? విను మాయీదేశమే సర్వదా
వేదంబన్నఁ దదర్థమన్న మఱి తద్విజ్ఞాత లన్నన్ దదు
ద్వాదంబన్న నఖండభక్తిని నమోవాకంబు లర్పించు నా
యీదేశస్థు లదృష్టవంతులుసుమీ ! యీ వీనుడి న్నమ్ముమీ ! ౧౩౨

ఉ. మారణయంత్రజాలము లమర్చెడి నేరుపు నేర్పు గాదు ని
స్సారపుఁ బొట్టకోసర మసహ్యపుఁదిండిని మెక్కు నేరుపు
న్నేరుపుగా దుదారగుణనీరధులై నను భక్తి కల్మిచె
న్నార నెఱుంగునే ర్పెవరి కబ్బునొ? వారలె ధన్యు లెమ్మెయిన్.

శా. పూచెం గాఁకర కాచెఁ గాయ లుడిగెంబో! పాదు సర్వమ్ము నిం
తే చర్చింప మనుష్యజీవితము, దీనిం బెద్దగా నమ్మి యే
ప్రాచీనుల్ పరమున్ ద్యజింప రిపుడో? భ్రష్టీకృతం బయ్యె న
య్యాచారం, బిహమే సమస్తమున కాధ్యం బయ్యెఁ దా నెల్లెడన్.

చ. ఋణ మెగఁబెట్టఁగాఁ దగిన వెన్ని యుపాయము లుండె నన్నియున్
గణుతికి నెక్కె బ్రాహ్మణులె కన్గొని శాస్త్రములందుఁ బొల్చు బ్రా
హ్మణపదమందు నుండిన సదర్థము మంటను గల్పి రెట్టి ర
క్షణమును లేక ధర్మము కృశాంబగు టీవు నెఱింగినట్టిదే ౧౩౪

ఉ. అంకులు పెండిళుల్ దురితరాసులు పున్నెము లేమి చెప్పుదున్
బొంకులు ధర్మశాస్త్రములు "పూర్వపువిజ్ఞులు మూర్ఖు" లంచు నే
పంకిలచిత్తులో యిహమె "పావన" మన్కొనువారు రేఁగి యే
జంకును లేక సాధుజనసంఘములన్ గికురింత్రు తెలుంగుదే? ౧౩౫

మ. కలియే యన్మదియైన నచ్చటచటన్ జ్ఞానుల్ పురాధర్మవే
త్తలు తత్తద్విధు లాచరించు ననఘుల్ ధాత్రిన్ గలా రల్లవా
రలసంరక్షణ నాకుఁ దప్పదు సదారంభుల్ మఱిన్ గొంద ఱుం
డిరి వారిన్ దరియింపఁజేయవలయు న్నే నీదుమూలమ్మునన్. ౧౩౬

చ. జనకుఁడు సంతతిన్ గనెడిచాడ్పున నేనుజగత్తుఁ గందు నం
దను లొకకొంద ఱుత్తము లధార్మికు లుంటయు సంఘటించు నే
జనకుఁడు దాని నాఁగుటకు శక్తుఁడు గాఁ డటు లేనుగూడఁ బైఁ
గనుఁగొనుచుందు సాక్షినయి కర్మముపై భరమెల్ల మోపుచున్. ౧౩౭

వ. అది యటులుండె. ౧౩౮

చ. అచ్చటనచ్చటన్ గిరులయందు మదాకృతి గోచరించు ని
ష్టచ్చటఁగూడ నావెలయునిచ్చకు హేతువు నీకుఁ జెప్పెదన్
ముచ్చట గల్గె లచ్చికి సముద్రము పుట్టినయిల్లు దాపుగా
నిచ్చటి కుండునక్కతన నేనును నందుకు సమ్మతించితిన్. ౧౪౦

క. ఈకొండనుండి చూచిన,నేకాలం బా పెతండ్రి దృష్టికిఁ గదు విం
దై కానఁబడెడి నదియును, గా కిక్కధరమ్ము పూర్వకాలమునందున్.

వ. మిక్కుటంబగు తపం బొనర్చిన యొక మహామహుఁడని యెఱుంగుము
పర్వతాదులయందు దేవతాత్మకత్వంబు కలదని యిప్పటివారు విశ్వసిం
పకున్నను నది యసత్యంబుగా దని యెఱుంగు మని వెండియు. ౧౪౨

మ. ఇదియుం గాక జమీనుదారుఁ డొకఁ డెంతే నాకు భక్తుండు మ
త్పదముల్ నిష్ఠమెయిన్ జపించు మల యాతం డేలుదేశంబుదా
పుది తా నియ్యది వానినోముటయు నే మున్మున్నె యోజించి యిం
దుదయింపం దలపెట్టినాఁడ విను ముద్యోగింపు మౌ భద్రముల్.

చ. అనుచు ననేకసంగతుల నచ్యుతుఁ డానతి యిచ్చి యేగె నం
త నతఁడు మేలు కాంచి "సుదినం బిది" యంచుఁ దలంచి స్వామి చె
ప్పినయటు స్వామిపూజ నెఱవేర్చుచునుండెఁ గ్రమంబుగాఁ బురం
బున జనులెల్లఁ బోయి యలపూజను గన్గొనుచుండి రాస్థతో. ౧౪౪

చ. కనికని యొక్కనాఁ డనిరి కానఁగ విగ్రహ మొండు లేదు చె
ట్టున కనుకొంద మన్నను నటుల్ పొనరించినయట్లు దోఁప, దే
మని యనుకొందుమయ్య ! మహితాత్మ ! భవత్కృతమైన నిత్యపూ
జనమున కున్నలక్ష్యము రసన్ యజియించుట కర్థ మున్నదే ? ౧౪౫

గీ. ఈ " చిదంబరపురహస్య " మెట్టిదొ ? యెఱుఁ
గంగఁ గోరి ప్రశ్నించుటగాని యొండు
గాదు తెలియ వచింపు నిక్కమ్ము మాకు
నావుడు నతండు వల్కె విన్నాణ మెసఁగ. ౧౪౬

మ. భగవంతుండు గలండు సర్వజగతిన్ బాథోధి నాకాశమం
దగకోటిన్ మృగకోటి వృక్షములయం దబ్జమ్ములం దుమ్మలన్
ఖగణమ్మందు నిరమ్మదమ్ము నెడలం బాతాళమం దంచు నిం
దగుపట్టున్ మఱియెందు సర్వగతుఁ డయ్యాద్యుండు లేఁ డెయ్యెడన్.

చ. అలయలఘుండు లేనిభువి యాతఁడు లేనిదివంబు నమ్మహో
జ్జ్వలుఁడు వసింపకుండినరసాధర మింకెదిగాని లేదు స్థం
డిలమున కర్చ సల్పుటది నేరము గాదని తేలె నింక ని
మ్మల కరుదెంచి చేయుటకుమాత్రము హేతువు చెప్పఁగా వలెన్.

శా. ఇందున్ లోఁతుగఁ ద్రవ్వి చూచునెడ నయ్యాశుండు లోకేడ్యుఁ "డా
నందో బ్రహ్మ" యటన్నవాక్యమునకున్ లక్ష్యంబు మూర్తిత్రయం
బెందావిర్భవమయ్యె నప్పరముని స్వీక్షింపఁగా వచ్చు నీ
సందర్భం బది పైపయిం గలదె? విశ్వంబెల్లఁ గూడన్వలెన్. ౧౪౯

క. బహుజనసాధ్యం బియ్యది, బహుధనసాధ్యంబు నగుటఁ బరికించిమహా
మహుఁడున్నచోట నే ని,ట్లహరహ మయజించుచుందుననుటయువారల్.

మ వగులంగొట్టఁగ లేమొ? కొండ నెటులో, వద్మాక్షునవ్విగ్రహం
బు గనంజాలమొ? పైకిఁ దీసి విదవం బూజింపఁగా లేమొ? మీ
ర్భగవద్భక్తులు మీకుఁ దోడ్పడుట మాభారమ్ము, దేవేశు నే
వగనే నిద్దర నిల్పి చూడఁగఁదగున్ భక్తార్తి నిర్వాపణున్. ౧౫౧

వ. నావుడు నాభక్తాగ్రణి యొకింత నగి యిట్లనియె. ౧౫౨

చ. పయికెటులేనిఁ దీసెదము పాఱలుఁ బల్గులుఁ బూని త్రవ్వి ఆ
పయి గుడి గట్టఁగావలయు బ్రాహ్మణు లర్చకు లుండఁగావలెన్
స్వయముగఁ జేయునర్చనము సాఁగదు పిమ్మట, రిత్తమాటలా?
భయపడ కెట్లు విగ్రహము పై కెగనెత్తఁగ సాహసించుటల్. ౧౫౩

వ॥ ఆమాటలు విని యచ్చటివారు. ౧౫౪

ఉ. కొందఱు "మీరు చెప్పినదిగూడ విచార్యమె" యంచుఁ బల్కి "రా
నందమయుండు శ్రీవిభుఁ డనాథుఁడె సర్వము నిర్వహించు" నం
చుం దెగి కొంద ఱాడి "రెదొ? చూతము పిమ్మటఁ బైకిఁ దీయఁగా
ముందు యతింత" మంచనిరి ముఖ్యులు గొందఱు వారిలోపలన్. ౧౫౫

గీ. "మంచి" దని యంద ఱేకీభవించి తుదకు
నొక్క శుభముహూర్తమ్మున నెక్కుడుగఁ బ్ర
యత్నపడి త్రవ్వి రాగిరిరత్న మచట
పట్టి యాయాస మని తోఁచె వారి కపుడు. ౧౫౬

గీ. ఎంత త్రవ్విన విగ్రహం బేదిగూడఁ
గానరాకున్కి నాతఁ డొక్కరుడుదక్క
నెల్ల రుత్సాహశూన్యులై "యితఁడు వట్టి
వాతులుం" డనునంతకు వచ్చుటయును. ౧౫౭

చ. తొలుతటి వైశ్యవృద్ధు వగతో భగవంతు నెడంద నిల్పి "నా
కల ధ్రువ" మంచు నీదుపదకంజములన్ గుఱిచేసి నేను వి
చ్చలు నినుఁ బూజసేయుచు నిజంబుగ "నీ వట నున్నవాఁడ" వం
చెలమిని ద్రవ్వ మంటిఁ దుద కేమియుఁ గన్పడ దేమి? దేవరా! ౧౫౮

చ. అసలు కలిన్ జగంబు పరమాత్మునియున్కిని విశ్వసింప దే
రసికులొ విశ్వసించినఁ "బరాత్పరుఁ డుండినఁ గానరాఁడె" యం
చు నొరిది నాస్తికుల్ పెనఁగఁ జూతురు వారికి నీవు సాయమై
కసరిన భక్తు లేగతిఁ బొకా ఎదురయ్యా? యథార్థవక్తలై. ౧౫౯

మ. ఇపు డీరావికుజంబునీడ భువిలో నీ వున్నటుల్ నాఁడు స్తం
భపుగర్భంపుఁగతన్ స్మరించుకొను నాపల్కున్ మది న్నమ్మి గ్రా
మపుఁబెద్దల్ పొరుగూళ్లనుండు ఘనసంపన్నుల్ వెసన్ వచ్చి నీ
కృపకై వేచుచునుండి రేమిగతి? నీ విందుండి రాకుండినన్. ౧౬౦

గీ. అపుడు ప్రహ్లాదునకుఁ బ్రాణహాని వచ్చె
నను చు నుక్కుకంబంబున నవతరించి
తిపుడు నామానహాని కీ వెదఁ దలంక
వలదె? మానంబుకన్నను బ్రాణ ముఁ అవె?. ౧౬౧

శా. ఈవే నాకల వచ్చి యానతిడు నాయీవాక్కె పొల్లైనచో
నావేదంబుల నున్నయర్థములు సత్యంబౌనె? నీవాక్యముల్
గావే? వేదము, లాస్తికుల్ చెడినచోఁ గష్టమ్ము నీ కబ్బు ని
న్నేవాఁడున్ దలపెట్టఁ బోఁ డెఱిఁగి సామీ? నామొఱాలింపవే. ౧౬౨

ఉ. ద్రోవది కష్టు చీరలను దొంతులు దొంతులుగా నొసంగి న
ట్లీవఱ కెల్లవారు వచియింతురు భారతమందుఁ జూచి, దు
ర్భావు "లసత్య" మంచెవియొ వ్రాఁతలు వ్రాయఁదొడంగి రిప్డు నీ
సేవకు నన్ మొఱంగునెడఁ జేకుఱుఁగాదె? జయంబు వారికిన్.

క. "కల" వన్నఁ గలవు "లే" వని
పలికినచో లేవు నీదుబల మిట్టిది నేఁ
"గల" వని నమ్మినభక్తుఁడఁ
"గల" వనునామాట ధ్రువము గావింపు మఱా. ౧౬౪

సీ. కరిని గాచినగాథ కల్లయౌ ద్రోవది
నాదరించిన దసత్యంబ యౌను
అలకుచేలునిఁ బ్రోచు టది మిధ్యయై పోవుఁ
బ్రహ్లాదు నేలు టబద్ధ మౌను
ధ్రువు నుద్ధరించుట తుడిచిపెట్టుకపోవు
గుహునిఁబ్రోపది క్రుంగు గహనమందు
రావణానుజుని సామ్రాజ్యం బసత్యమౌ
సుగ్రీవు నేలుట సున్నయౌను

గీ. నేఁడు నీ వనాదరణము నెఱపెదేని
యెన్నిసత్యమ్ములకొ మూఁడు నెడ రెఱుంగు
మందులో నిది కలియుగ మపుడు చూచి
కూడ నిశ్శంకముగను బొంకుదురు జనులు. ౧౬౫

ఉ. ఈయుగమందుఁగూడ నొకఁ డెవ్వఁడొ దేవునిసత్తు నమ్మినాఁ
డై యఘ మాచరించుటకు నాత్మఁ దలంకుచునుండ వానికిన్
'సాయము నీ వొనర్పు' వని సజ్జను లేమొగమూని పల్కి నా
రాయణ ! నిన్ను మ్రొక్కఁగఁ గరంబులు సాచెద రానతీఁగదే. ౧౬౬

క. జ్ఞానులను దృప్తి పఱచుట, కై నాయత్నంబుగాద అజ్ఞానుల స
మ్మానించుటకే; జ్ఞానులు, సూనృతవిదు లెట్లొ నిన్నుఁ జూతురు వారల్.

మ. ప్రతిమాపూజలు మమ్మబోట్లకొఱకే ప్రామాణికుల్ చెప్పె ర
త్రపతిముల్ విజ్ఞులు, వారికిన్ గుడికి సంబంధంబు లేశంబు లే
దతివల్ శూద్రులు బ్రాహ్మణబ్రువులు లోనౌ వారలీ నీడుప
ర్వతయాత్రం బొనరించి ధన్యులగు సౌభాగ్యంబు గల్పింపవే. ౧౬౮

చ. నినుఁ దమజ్ఞాననేత్రముననే కనువారికి విగ్రహంబుతోఁ
బని యొకఁ డుండునే ? వృథగ బ్రహ్మసమాజము లట్టివారి వ
ర్తనమును మూఢమానవపరంపరపట్ల విధించి విగ్రహా
ర్చన నిరసించు టెంతయపచారమొ ? వేఱె వచింప నేటికిన్. ౧౬౯

ఉ. ఆకృతి లేనినీకు నొకయాకృతి కల్పనఁ జేసి లీలయే
లేకలరారు నీకు నొకలీలను గల్పనఁ జేసికూడ నా
లోకన నేయలేని జడలోకుల నుద్ధరణం బొనర్ప నీ
వే కరుణింపకున్నఁ గలదే ? మఱియొం డిఁక దిక్కు దేవరా. ౧౭౦

మ. ఫలమో? పుష్పమొ? పత్రమో? గొనుచు నీప్రాసాదమున్ మ్రొక్కు బో
యలుగూడన్ చరియింపఁగావలయు నీయాకారము న్గాంచి మ్రొ

క్కులు చెల్లించెడివాండ్రై కాదు మది నీకోర్కెన్ విచారింప యీ
వలెఁజామ్రీ! వర; మెంతవట్టును లఘూపాయమ్మె కామ్యం బజా.

ఉ. స్నానమొనర్చుచున్ జపము సల్పుచు సంధ్యయు వార్చుచు న్నిసు
న్మానసమందు నిల్పుజనమాన్యుల కే మలవారలెల్ల నె
న్లేని దరింతు రేనియము మించు కెఱుంగని యెడ్డె మడ్డి వాం
డ్రేనిఁ దరించునట్లు కరుణింపవలెన్ గలిగాన దేవరా! ౧౭౩

మ. అని యద్దేవుని వేడికొంచు నెవియో ప్రార్థించుకొంచు న్వెసన్
గనులన్ మూసినయంత వేకువఁ గలన్ గన్పట్టె మున్వోలె నా
యనకు న్నాయనఘుండు శ్రీహరి భవిష్యచ్చర్య వాక్రుచ్చె మే
ల్కాని “అచ్ఛోటనెత్రవ్వఁడింకమఱియున్ గొంచె”మ్మనెన్ భక్తుఁడున్.

చ. ఒగి నటు ద్రవ్వఁగాఁ దొడఁగి రొండొకలోఁతున స్వామివిగ్రహం
బగుపడె నేమిచెప్పుదు? జనార్దనుఁ గాంచిన వైభవ్య మోవ; మా
జగదధినేతకు న్నతులు సల్పుచుఁ బాడుచుఁ దాండవించె నొ
ప్పుగఁ దనచుట్టునుం బ్రజలు మూఁగిరి శ్రీగిరిదేవుఁ బాడుచున్. ౧౭౪

వ. మఱియుం గొండొకలోఁతు ద్రవ్వి చూడుం డని యాసాధుకులభూష
ణుండు హెచ్చరించుటయు నట్లొనర్ప నయ్యెడఁ బంచలోహమయంబు
లగు శ్రీవారి యుత్సవవిగ్రహంబులు గన్పట్టె వానిశిల్పరచన యనితర
సాధ్యంబుగ నుండెఁ బిమ్మటఁ దాత్కాలికంబుగ స్వామికి నొకపర్ణశాల
నేర్పఱిచి యందు విడియఁ జేసిరి. పదపడి యలభక్తుండు కరంబులు
మొగిచి. ౧౭౫

ఆ. త్రేతలోన మున్ను శ్రీవారు పర్ణశా
లను వసించినార లనుటెకాని
చూడలేదు నేఁడు చూచి ధన్యులమైతి
మయ్య! యెంత భాగ్య మబ్బె మాకు. ౧౭౬

మ. జలనిద్రాళుఁ డటుల్ స్వబుద్ధిమెయి విశ్వంబున్ గటాక్షింప ని
ర్జలమౌ మెట్టను వాసమున్ సఖుపఁగాఁ బ్రారంభమున్ జేసె న
వ్వల నక్కొండయు వార్మయం బగుచుఁ గన్పట్టెన్ నదీమాతృకం
బులు తత్సానువు లయ్యెఁ బండులును బూవుల్ నిండెఁ గన్పండువై.

ఉ. ధారలులేని కొండ జలధారల కాకర మయ్యె వానివాః
పూరము గ్రోలుయాత్రికులపూర్వబుజల్ తొలఁగంగఁ జొచ్చె "ని
స్సార" మటంచు నొక్కఁడు "ససార"మటంచును నొక్కఁ డున్నెః సం
సారము సర్వ మిట్టులె ససార మగున్ భగవత్కృపాప్లుతిన్. ౧౭౮

సీ. సార్వకాలంబు రసాలఫలమ్ముల
కొ్కండనే గాని యెకొ్కండ లేవు
ఎల్లకాలముఁ దమ్మి లింపారుసరసు ల
కొ్కండనేగాని యెకొ్కండ లేవు
ఒకప్రక్క వాన వేఱొకప్రక్క యెండ య
కొ్కండనేగాని యెకొ్కండ లేదు
ఋతుభేద మదిలేక యెల్లపక్షిరవ మ
కొ్కండనేగాని యెకొ్కండలేదు

గీ. ఫలులుగల్గియు దౌర్మార్గ్యమునకుఁ జోరవు
ఉన్నరోగమ్ములే పోవుచున్న వనినఁ
గ్రొత్తరోగమ్ము లెటు మొలకెత్తు నచట
సర్వథా నందనం బలశై లవరము! ౧౭౯

చ. క్రమముగ దేవళంబు లపరంజిమయంబులు గాఁగ లేచె న
భ్రము స్పృశియించు గోపురవరంబులు లేచె శిలామయంబు సా
లము నొగి లేచె నల్లకమలాపతి వాస మొనర్చుచోట ద్ర
వ్యము తనయంతఁ దానగుచు వచ్చి సమస్తము నిర్వహించెడిన్. ౧౮౦

సీ. కొండకు మెట్లను గోరి తనంతనే
కట్టించె నొకషాపుకారుకొమరుడు
అన్నసత్ర మ్మొకర్కుపున్నెంపుఁ గమ్మయి
ల్లాలు పెట్టించె వాలాయముగను
ఆవశ్యకత దాని కంత లేకున్న పై
ద్యవుశాల నిల్పె భూదారుఁ డొకఁడు
గరుడవాహన మాదిగా వాహనమ్ములు
సంతరించిరి ధనస్వాము లెలమి

గీ. "రథము గట్టింతు నామనోరథము పండె
నేని" యని మొక్కుయిల్లాలు సూనుకొలుకు
మ్రొక్కుకొని కోర్కె యది తుదముట్టునంత
నెత్తునరథమ్ము గట్టించి యిచ్చె మ్రొక్కె. ౧౪౧

గీ. మాటయేనిసుది తిరుపతు లేటఁ గలిసి
పోవుప్రళయానఁ గూడ నీభూధరంబు
కాశితోపాటు నిలుచునుగాని పోద
టంచుఁ దెల్పె నటంట్రు నారాయణుండు. ౧౪౨

వ. ప్రధానదేవత శ్రీమన్నారాయణుండును క్షేత్రపాలకుండు విరూపాక్షుండు ను గాక శ్రీదుర్గాదేవి లోనగు నంగదేవతలకును నాలయంబులు నిర్మించి నిగమోక్తవిధానంబునఁ బూజాపురస్కారంబులు జరుగునాక్షేత్రంబు కలి యుగ వైకుంఠ మనెడిసార్థకనామంబున నలరారుచున్నయది యని యెండియు. ౧౪౩

మ. అనుభూతిఁగా వచియింతు శ్రీపతు లహార్యస్థుల్ గలా రెండ షే
నిని, వాంఛాపరిపూర్తి వార లెలమిన్ సేవించుచోఁ జేయుచే
కనుపట్టున్ బ్రకృతంపుదేవుమహిమన్ గన్గొంటి నక్కొండఁ గ
న్గొనుమాత్రన్ మదిలో నపూర్వసుఖ మంకూరించు సంసారికిన్.

ఉ. సారవిహీనసంసరణసాగర మీఁదువిసారముల్ సదా
చారులె యయ్యు మానవుల, సజ్జనులన్ వివరింపనేల ? సం
సారమునం దెదో యొకవిచారము గల్గుట తప్ప దట్టిచో
నేరుసు నగ్గిరీంద్రమున కేగినవెంటనె హాయి చేకుఱున్. ౧౮౫

చ. గిరిశిఖరంబు కన్నులకుఁ గేవలమున్ గనుపట్టినంతనే
"దురితములెల్లఁ బాయు" నని తొల్లిటిపెద్దలు చెప్పినారు శ్రీ
గిరినిగుఱించి; యాత్ర యది క్లేశసహాల్ పొనరింపఁ దగ్గ దీ
గిరి యటుకాద యెల్లరు నొగిన్ జని చూడఁగ వచ్చు వ్రేల్మిడిన్.

గీ. బండ్లు పొగబండ్లు "మోటార్లు, బస్సు" లట్టు
లుండఁ గాల్నడకలఁగూడ నూరనూర
నుండి యాత్రికు లెలమి నక్కొండ కేగి
స్వామి దర్శించుచుందు రాసాయ మెపుడు. ౧౮౭

ఉ. ఇట్టిసుసాధమైన దొకఁ డిక్కలి కుండకయున్నఁ దీర్ఘ మి
క్కట్టుగ నుండు నంచరసి కారుణికాగ్రణి శ్రీవిభుండు మే
లట్టిపడన్ సమస్తజను లూరక తంగెడిజున్నుమాడ్కిఁ జే
పట్టి సుఖింపఁ దా ననికిపట్టుగ నీగిరిరాట్టు మెట్టెనో ? ౧౮౮

శా. కొన్నా ళ్ళచ్చట నుంటి నేమికతమొక్కో ? యగ్గిరీంద్రంబునం
దెన్నాళ్ళుండిన నింక నుండవలె, నంచే బుద్ధి రెట్టించు సం
పన్నుం డచ్చటిధర్మకర్త మిగులల్ భక్తుండుఁ బ్రాజ్ఞుండు నే
నన్నన్ బ్రాణము నిచ్చుఁవాఁ డిఁక నొకం డందేను గన్పెట్టితిన్.

ఉ. కొందఱు ధర్మకర్త లలఘుల్ పరు లయ్యెడఁ బున్నెమ్ముం గొనం
గం దమ రేదియేని ఘనకార్యము సత్రము లోనుగాఁగఁ జే
యం దమదేమొ ? పోయినటు లక్కృతు లడ్డుదు రే నొకంట నీ
చందము గంటి నీతఁ డటు సల్పక సాయముగూడఁ జేసెడిన్. ౧౯౦

వ. నేను జూచిన వేఱొక్కధర్మకర్తకూడ సద్వంశసంభవుండే యయ్యును·

శా. తా నాస్వామికి వచ్చు నయ్యఖిలవిత్తంబు హరించున్ ఋణం
బేనిన్ దాన వ్యయింపఁ డేధనికులో ? యేసత్రమో ? పెట్టి "స్వ
జ్ఞానం బోద" మటన్న దానఁ దనకున్ వ్యాపించుదుష్కీర్తి యుం
చానిర్దోషుల నష్టపెట్టునఁట ? యీయన్యాయ మేలాటిదో ? ౧౬౨

మ. తనపూర్వుల్ "సుకృతాన" కంచు భగవద్భక్తుల్ శిష్టుల్, విష్ణు ని
ల్పిన నచ్చో నొకధర్మకర్త యయి తద్వృద్ధిం బొసంగించున
ప్పనికిం బూనక తస్కరించుపనికిన్ బాల్పడ్డ యమ్మేటి నే
మనవచ్చున్ ? "ధన మిచ్చి తద్దినము గో"న్నట్లుండు నీయోదుముల్. ౧౬౩

ఉ. పుణ్యముకోసమై తనదుపూర్వు లొనర్చిననంస్థ వారికిం
బుణ్యమె కూర్చినం దుదకుఁ బుత్రులుఁ బౌత్రులు నక్కృతాన సు
త్పన్నమహాఘులై చెడుట తారస మైనటులయ్యె "నయ్యవా
రి న్నెఱిఁ జేయఁ గోఁతి యగురీతికి వచ్చుట" యిట్టిదేకదా ? ౧౬౪

వ. కొందఱు తమపూర్వపుపైశ్వర్యము గోల్పోయి యుయ్యాది యట్లుకో
ల్పోఁ దగ్గది గామింజేసి యిక్కతన జీవయాత్రసాఁగించుకొను దురవ
స్థకు నగ్గమైనవారలుం గల రని వెండియు. ౧౬౫

చ. ప్రకృతపుధర్మకర్త నుతిపాత్రుఁడు గాఁ గనుపట్టె నాకు; "నెం
దుకు నిది వచ్చె నేమి యగునో ? యెటు చేసిన" నంచు భీతిమైఁ
జకితమనస్కుఁడై మెలఁగు స్వామిధనం బెటులైన నేమి ? మి
న్నక నురుఁగున్, నకాళపుజనంబుల నెవ్వఁడు పట్టనేర్చెడిన్. ౧౬౬

ఉ. దొంగతనంబు వట్టికొని "త్రోసియు రా" జని వాని, నన్యు నం
దుం గులశీలవంతు నిడ నొండొకనాఁటికి వాఁడుఁగూడ న
మ్ముంగలివానితాత యయి పోవుటయే యనుభూత మందుచే
తం గులశీలముల్ చెఱచు ద్రవ్యము దానికి బుద్ధి యున్నదే ?. ౧౬౭

వ ఇయ్యది ధనమునందలి దోషంబుగాని ఆయావ్యక్తులయందలి దొసఁగు కాదు, విరాగికూడ బంగరుపట్లన కాదు రాగియెడంగూడ రాగియై లోఁగి తన్మయుండగుటయే తఱచు గన్పట్టు. ౧౯౮

ఉ దేవతలన్ యజింత్రు పరదేశములన్ జరియింత్రు దాతలై
కోవిదకోటికిన్ ముదము గొల్పుదు రుత్తము; లల్పలోభులో?
జీవుల హింస సేయుదురు చేయుదు రెంతయుఁ జౌర్యమున్ మదిన్
భావన సేయఁగాఁ బరధనంబు హరించెడిత్రోవ లిన్నియున్. ౧౯౯

క. ధనకాంతామోహమ్ములు, జనులకు స్వాభావికములు జగమున నెవఁడీ
ధనకాంతామోహమ్ములఁ, గనకుంతునొ? వాని శివునిగా నెన్నఁదగున్.

ఉ కావున దేవతాధనముగాని మఱొక్కటిగాని వ్యర్థమై
పోవకయుండ నెవ్వఁడును బ్రోవఁగ లేఁడని ధర్మకర్త స
ద్భావుఁడు తొల్లివారలనె పట్టి యెటో నడిపించు ధర్మమున్
శ్రీవరుఁ డచ్చటం గలఁడు చెట్టలకే మెట లేక యుండెడిన్, ౨౦౧

శా. దేవక్షేత్రములందు నెందుఁ గనినన్ దేబెల్ శతం బుంచు రా
దేవుం డేటి కుపేక్ష చేసెడినొ ? అదృష్టాత్ములన్; వాంఛ్రకున్
దేవుం డన్నను వట్టిబాయి యిట సందేహంబు లే దెందు నా
దేవానాంప్రియు లుండ రట్టిగుడి ధాత్రిన్ జూడఁ బో మొక్కఁడున్.

ఉ. వారలబుద్ధులన్ మఱియు వారలవర్తనలన్ విమర్శతో
నారసినన్ మనమ్మునకు నత్యధికమ్మగు నేవ మబ్బు నే
ధీరులుగాని యెన్నఁడును "దీర్థముఁ బోఁదగ"దంచుఁ దోఁచు నె
వ్వారికి; విజ్ఞు లాజడులఁబట్టి త్యజింపరు తీర్థయాత్రలన్. ౨౦౩

వ. ప్రతిక్షేత్రింబునం గాకున్నను గొన్నిచోట్ల నుత్కృష్టులైన యోగులు క్వాచిత్కంబుగా నుందు రట్టివారల సందర్శనంబు దీర్థయాత్రాపరులకుఁ దక్క నన్యులకు సిద్ధింపదు కావునఁ దీర్థయాత్రాచరణం బవశ్యకర్తవ్యంబ యని సైంధ్రియు. ౨౦౪

ఉ. క్రొత్తది తీర్థ మొక్కటిని గోరితి రీరలు "చెప్పు" మంచు నే
నిత్తటి దానిఁ జెప్పితి మహేన్నియొ చూచితిఁ దీర్థరాజముల్
సత్తము లందునం దఖిలసాక్షిఁ బరాత్పరు నాత్మ నిల్పి కిం
చిత్తపు మంటకుండుగతిఁ జేయుచు నుందురు కాలయాపనన్.

క. బంగార మ్మొనరుచువా, రుం గల రవ్వారిఁగూడ రూపిగ నేఁ గం
టింగాని వార లద్ధా, నిం గందురు మృత్తికన్న నీచతరముగన్. ౨౦౬

చ. "కనక" మటంచు దానియెడ గౌరవ మెవ్వఁడు పెట్టెనో ? జగం
బున, కదిగూడ మృత్తికద ? పూర్ణవిరాగము రెండు నొక్కఁట
క్కని గనినప్డె చొప్పడెడిఁ గేవల మీదృశు లెంద రుందురో ?
మునిజనులందుఁగూడ, నిది మూలము సర్వజగత్ప్రవృత్తికిన్. ౨౦౭

సీ. జ్ఞాన మమ్మెడివారు గాన మమ్మెడివారు
మాన మమ్మెడివారు మహిని గలరు
సుతల నమ్మెడివారు సుతుల నమ్మెడివారు
సతుల నమ్మెడివారు జగతి గలరు
అన్న మమ్మెడివారు సున్న మమ్మెడివారు
పున్నె మమ్మెడివారు పుడమిఁ గలరు
ఇండ్ల నమ్మెడివారు పండ్ల నమ్మెడివారు
చెండ్లనమ్మెడివారు క్షితినిఁ గలరు

గీ. తనదుజీవితాంతమ్మునఁ దలఁగలమెద
డమ్ముకొనునట్టివారు నున్నట్టు లిప్పు
డక్కడక్కడ వినఁబడు నఖిలమొక్క
ధనమె చేయించు వట్టిదంధనము ధనము ౨౦౮

క. ఎవఁ డెవనిధనము తృణమే
ని వృథా తిను వాఁడు వానినిక్కపు దాసుం
డవు నని భీష్ముఁడు పలికెన్
శివ ? శివ ? యోగులకు నిట్టి సిబ్బితి తగునే.

చ. ఇది భగవంతుఁ డొప్పికొనకే యనుకొందును వారి కేదియే
నదను ఘటించుచోఁ గనక యౌపసరో ? మఱియొండొ ? చూపిన
ట్లైదను దలంతు వార లది యేరికిఁ జెప్పరు చెప్పిరేనిఁ బా
అదు సుతదారగేహముల రక్తి వహించు గృహస్థకోటికిన్. ౨౧౦

గీ. ఎంతటి విరక్తులకునేని యెల్లయపుడు
గాకయున్న నెప్డేనియుఁ గానుతోడఁ
బనివడిన నాదరువు చూపవలయుఁగాన
దేవుఁడే వారి కిది యొండు తెలిపి యుండు ౨౧౧

ఉ. వారల కేమి గావలయు వస్త్రము నైతము గట్టకుంద ర
వ్వా రవధూత, లల్లహిమవంతమునం గల రట్టివారు సం
సారులకుం గనంబడ రసాధ్యము. వారలయున్నయున్కి యే
ధీరులకే నెఱుంగుట, విధేయులు వారల కాత్రిమూర్తులున్, ౨౧౨

గీ. అల్లకార్తవీర్యార్జునుఁ డట్టివారి
పాదసేవకతంబునఁ బ్రబలుఁ డగుచు
నెల్లభూమండలమునకు నేలిక యయి
నట్టులు పురాణములఁ గల దది ధ్రువంబు. ౨౧౩

ఉ. ఒక్కటిమాత్ర మున్నయది యోగివరేణ్యులసేవ చిక్కనే
చిక్కదు చిక్కినప్పు డలసేవ పరంబునకున్ వ్యయింపఁ బో
కక్కట ! వ్యర్థసంసృతికి నగ్గము సేయుటకన్న శోచ్య మిం
కెక్కడనుండు ? ద్రవ్యమునకేమి యెఱని గణింపనయ్యెడిన్ ౨౧౪

ఉ. మోసము చేసి ద్రవ్యమును మూటలు గట్టెడివారు చాల సం
తోసము గూర్చి ద్రవ్యమును దోరముగా గడియించువారు స
న్న్యాసము నొంది కూడ ధన మార్జన చేసెడివారు సుంద్రు ప్రా
గ్వాసన లేక జ్ఞాన మది గల్గదు దానికి సాటి లే దిలన్. ౨౧౫

క. జ్ఞానికిఁ గలియానందం, బేనరునకుఁగూడ నుండ దిక్కృతమనసే
జ్ఞానుల సేవించుటకై, భూనాథు లరణ్యమునకుఁ బోయెద రనఘుల్.

వ. ఇట్లు ధర్మగోష్ఠితో నారేయి గడపి వేకువం దీర్థయాత్రకై బయలుపేఱి
రని చెప్పు నప్పటికిఁ బ్రదోషం బగుటయుఁ దత్కాలోచితకర్మంబులు
నెఱపుటకై వారు సదస్సు చాలించిరి. ౨౧౩

ఆశీర్వచనము.

క. తనయులతో మనుమలతో
మునిమనుమలతో నితాంతమును నానందం
బున ఘనమగుసిరితోడన్
మనెడి జగన్నాథుఁ బ్రోచు మాధవుఁ డెపుడున్. ౨౧౪

గద్య.

ఇది శ్రీ తిరుపతివేంకటీయంబగు సుశీల యను కేవల
కల్పితప్రబంధమ్మునందుఁ దృతీయాశ్వాసము
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీమత్పరదేవతాయై నమః

# సుశీల

## తిరుపతివేంకటీయము.

## చతుర్థాశ్వాసము.

వ. అనంతరము మునులు సూతుంగాంచి. ౧

ఆ. అడవి యుసిరికాయ యలసముద్రపుటుప్పు
గలియురీతి వీరు గలిసి తీర్థ
యాత్ర సలుపు టరిది, అలవారిసఖ్యంబు
సర్వవిధములను బ్రశంస్య మనఘ! ౨

ఉ. ఎక్కడివేశ్యకూఁతురు. మఱెక్కడివైశ్యుఁడు, వృద్ధరాజు తా
నెక్కడ? విప్రమౌనివరుఁ డెక్కడ? వీరివిరాగవర్తనం
బెక్కడ? నక్కజంబు మది కిక్కత యెక్కఁగఁ జేయు నిందులో
నక్కమలాక్షిసన్న్యసన మట్టె చలింపక నిల్వ నేర్చెనే? ౩

వ. అదియునుంగాక. ౪

ఉ. కోమటి వృద్ధు రాజు ననఘుం డటు వృద్ధుఁడె. వారివెంట ని
క్కోమలి యున్న లోకులకుఁ గొందొక సందియముల్ జనింప విం
కేమన? విప్రమౌని యొకఁ డిం చొగిఁ జేరె, నతండు వృద్ధు గాఁ
డేమెయి సంశయింప రెవరేని; జగంబు నిజం బెఱుంగునే? ౫

మ. అతఁ డైశ్వర్యము పెట్టిపుట్టినఘనుం డం చీవు వాక్రుచ్చుని
క్కతలోఁ దేలెడి, నట్టివాఁడు సుభగాకారుండు గాకుండఁ డీ
సతిలేజవ్వన మల్లవానిఁ గనుచున్ శాంతంబుగా నుండి య
చ్యుతసేవాపదరక్తిలో నిలుచుటల్ చోద్యంబు యోగీశ్వరా. ౬

చ. "ఎపుడు విరక్తి గల్గు నపుడే త్యజియింపఁగ వచ్చు సర్వసం
గపుగొడవల్ సుధీరుఁ"డని కన్పడెడిన్ శ్రుతులందు; నెందఱో

తపసులు తాదృశుల్ చెడుట తత్త్వదభిజ్ఞులవల్ల విందు మీ
చపలమృగాక్షిజీవితము సాఁగెఁగదా ? తుదిదాఁక శుద్ధమై. ౮

గీ. అతఁడు మునిమార్గగామియే యగును గాక
వయసు పూర్తిగా మరలినవాఁడు గాఁడు
అనుభవించి వీడినసుఖ మయ్యు మరల
భ్రాంతి పుట్టించు టదియు నబ్రంబు గాదు. ౯

చ. నృపుఁడయి గాధిజుం డెలమి నెన్నియొ సౌఖ్యము లొంది మౌనియై
తప మొనరించుచుం జెడెఁ బదంపడి కూఁతురుకూడఁ బుట్టె నే
తపసికినేని జవ్వని యెదన్ గలఁగించు స్మరారికన్ననున్.
"దపసు" లటంచు నుందురె ? వృథా యగు జవ్వనిపొంత సర్వమున్.

చ. అఱువదియేఁడులేనిఁ జననప్పుడు మానిసి యోగివర్తనం
బొరసిన నెన్నఁ డంగనలమోము గనంబడకున్న నిష్ఠతో
జరుగును గాని కాలము; స్వసన్నిధి సుందరి యున్నయ ప్టైటుల్
జరుగును నిష్ఠ; చిత్తము వశంబగునే ? తపమందు నిల్పఁగన్. ౧౦

ఉ. అందులకేగదా ? గృహులమై యిటు లుండి జితేంద్రియత్వమున్
బొందినటుల్ నటించు జపముల్ పొనరింపక సన్న్యసింపఁగా
డెందము తొందరించినను డీకొని దానికి నచ్చఁజెప్పి మే
మందఱమున్ గృహాశ్రమమునందు యజించుచు నుంటి మీశ్వరున్.

క. వేదాంతశ్రవణమునకు, లే దధికారమ్ము గృహికి; లే దనినంతన్
బోదు, పురాణమ్ములఁ గల, వేదాంతము వినుటకూడ వృజినం బగునే?

క. స్త్రీలకు శూద్రులకుఁ బురాణాలాపము లాలకించునర్హత కల దం
చోలిం జెప్పుదురు గృహస్థేలా ? విప్రుం డనర్హుఁ డిందుల కనఘా !

క. ఇతరాశ్రమములఁ గలిగిన
చ్యుతికిన్ బాచితము లుంట శ్రుత మగు నిఁకఁ బ్రా

చితము పరివ్రాట్కృతదు
ష్కృతమునకున్ లేమి నీవ యెఱుఁగుదు వనఘా ? ౧౫

వ. నియమపూర్వకంబగు మహావాక్యోపదేశమ్మునకుఁ దక్కఁ దక్కిన వేదాంతశ్రవణాదికమ్మునకు గృహస్థుల కెల్లరకు నధికారం బున్నట్లు తత్తత్పురాణవాక్యమ్ములవలన నవగతం బయ్యెడి నని వెండియు.

ఆ. అల్లవిప్రమౌని యతిధీరుఁ డగుఁగాక
వారవనితగూడఁ బరమయోగ్య
రాలె యగునుగాక యీలోకమును విశ్వ
సింపఁజేయఁగలరె ? చెప్పుమయ్య ? ౧౬

క. "లోకులొ ? కాకులొ ?" యంద్రు సు
ధీకులు; లోకమ్ము మూయుతెఱఁగున కెందున్
మూకుడు గల్గునె ? ప్రకృతం
బీకతలోఁ దీరనట్టి దీసందియమే ౧౭

వ. నావుడు రౌమహర్షణి యిట్లను. ౧౮

చ. ఇరువురుఁగూడ ధీయలె మఱెట్టి కళంకము లేనివారె ని
ర్దురితులఁగూడ లోకులు సదోషులుగా వచియించుచుందు రె
వ్వరును యథార్థముం గనరు, వారలవారల హృద్వికారముల్
పరులకు నంటఁ గట్టెదరు పాపపుముల్లై గడింత్రు దానిచే. ౧౯

వ. వారివారియపోహలకు ననుకూలించు హేత్వాభాసంబులు సమకూరుటయును గల దది యటులుండె నని మఱియును. ౨౦

ఆ. ఇతరసాధనంబు లెన్నేని యున్నయ
క్కాలమందుఁగూడఁ గాలినడక
నే పొనర్చినార లీనల్వురును దీర్థ
యాత్ర మధ్యమధ్య నాఁగి యాఁగి. ౨౧

చ. ప్రకృతివిలాసముల్ దెలుపు పర్వతపంక్తులు వృక్షజాలముల్
వికసితనీరజాతముల విందొనరించు తటాకముల్ నదుల్
కకవికఁ గూయు పక్షులను గాంచుచు మెల్లఁగ స్వామిపెండ్లివే
ళకు నలదేవుఁ డుండిన యిలాధర మేగిరి వారు నల్వురున్. ౨౨

శా. ఎందున్ జూచిన వేదగోష్ఠిమయమై యెచ్చోఁ గనుంగొన్న "గో
విందా" ధ్వానపరీతమై, మఱి యెటన్ వీక్షించినన్ గానవి
ద్బృందాలాపిత గానమానితమునై దేదీప్యమానప్రభా
సందోహంబగు పర్వతంబు గని రుత్సాహంబు దీపింపఁగన్. ౨౩

గీ. పర్వతమునుండి క్రిందికి బయలుదేఱి
స్వామి యూరేగునట్టి యుత్సవము గనుచు
నాఁడు జాగరణము చేసినారు వారు
నల్వు రేకాదశీసుదినంబు గాన. ౨౪

చ వ్రతము లొనర్చువారి నలవారికిఁ గల్పముఁ జెప్పువారి శ్రీ
పతిపయిఁ బద్యముల్ సలుపువారి షడంగములందుఁ బ్రాజ్ఞస
మ్మతముగ వాదముల్ సలుపు మాన్యుల నన్యులఁ గాంచుచున్ బురా
కృతము ఫలించినట్లు మది నెంచిరి వారలు సంతసించుచున్. ౨౫

చ. హరికథ సెప్పుచుండె నొకయాఁడుది వైష్ణవి కైత సెప్పు చా
తురి గలదాపె, గాత్రము మృదుత్వము గల్గి రహించు సభ్యు లం
దఱు వినుచుండి, రందు విబుధప్రవరుల్ గల రన్యులుం గలా
"రరు దిటు కల్కి చెప్పు" టని యక్కజమున్ గనుచుండి రెల్లరున్

వ. అట్లు పండితపామర జనానురంజకంబుగా హరికథాకాలక్షేపం బొనరు.
చున్న యాభక్తురా లొక్కచో నొకానొక సందర్భంబున—"ముక్తులుఁ
గూడ శ్రీహరి యనంతకళ్యాణగుణమ్ములను గానము చేయుచుందు"
రని నొడువుటయు నయ్యది విని యొకయద్వైతి మహాపండితుండు—

"ముక్తులకుఁ గర్తవ్యమెయ్యదియు నుండ"దనియు వారు 'కృతకృత్యు' లనియు వివదింపఁ జొచ్చె నంత నాకథకురాలు. ౨౭

సీ. ముక్తులు పలువిధములు గల వందులో
"నద్వైత" మనునది యత్యగాధ
మద్దాని నే నిట ననుసరించి వచింప
భాగవతగ్రంథపఠన మెట్టి
ముక్తిగూర్చి వచించు ముఖ్యమ్ముగా నిప్డు
దాని మనమ్మునం దూనియుంటిఁ
ద్రిమతమ్ములకు సమత్వము గల్గ బెన్నఁటి
కిని ఘటింపదుగదా! కేవల మొక

గీ మతమునే పట్టి వేఱొక మతము త్రోసి
వేయుటకు నొప్పికొనరు కోవిదులు మిమ్ము
వంటివా, రేమతమునేనిఁ బట్టి కవులు
రచన సాఁగింత్రు ఖండింపరాదు దాని. ౨౮

క. ఏమతమునకున్ గుదురని, దేమేని స్వతంత్రవాక్య మేనుడివినచో
ధీమంతులు నన్నునెడ, నే మీకున్ దాసురాల నేరము నాదో. ౨౯

వ మఱియును విశిష్టాద్వైతులు పరమపవిత్రముగా సమ్మానించు తప్తచక్రాంకణమ్ము నద్వైతులు సమ్మతింపక— శ్లో చక్రిణం శంఖినం దృష్ట్వా సచేలస్నాన మాచరేత్" అని నిషేధింతురు, పైఁగా నంతతో నాఁగక శ్రీవైష్ణవులెల్లరును విభూతిరుద్రాక్షలు ధరించ తీరవలయునని యు నందులకు—"శివం పరమభాగవతం స్మరామి" యనురామానుజ మతస్థుల వాక్యమే యుపోద్బలక మనియు వాదింతురు. అయ్యది సిద్ధాంతమైనను గాకున్నను శ్రీవైష్ణవభక్తులలో నగ్రేసరుఁడని తన్మతస్థులచే స్మరింపఁబడుచున్న శివునిచే ధరింపఁబడు విభూతిరుద్రాక్షలను దదితరులెల్ల తిరస్కరింపవలయు నని లోఁపక మానదు, మీదు మహావిద్వాం

సులు మీవంటివారు శంకించినచో నాబోటి యాఁడుది కాదుగదా? పెద్ద పెద్దహరికథకులే సమాధానము చెప్పఁజాలరు. నావుడు నప్పండితుండు విరమించినచో నది తన కవమానంబుగా [illegible]నని కోలాహలంబుగాఁ "బిడివాదమ్మున" కుపక్రమించుటయు నాసభలోఁ గట్టకడఁ గూర్చుండి వినుచున్న వేశ్యబాలిక సుశీల లేచి సవినయమ్ముగ నిట్లనియె ౩౦

ఉ. మీరలు పెద్దపండితులు మీకొక స్త్రీ యటులుండ విజ్ఞులౌ
పూరుషులేని వాదునెడఁ బోలరు కానిది "యౌ" నటంచన
న్నేరుతు నైనదానిని మనీషబలమ్మునఁ "గా" దటంచన
న్నేరుతు రట్టివాదసరణి న్నిము గెల్తురె? యెట్టిధీరులున్. ౩౧

గీ. అట్టివాదమ్మునకు నిది యదను గాదు
హరికథకురాలు వచియించినట్టి మాట
యేమతానకు సరిపడెనేని సమ్మ
తింపవలయు నామెను వినుతింపవలయు. ౩౨

వ. అదియునుంగాక యాపె శ్రీవైష్ణవకవయిత్రి యగుటంజేసి స్వమతాచార్యులైన రామానుజాదిమహామహుల వచనంబుల కనుగుణముగా నొడువుంగాని విమతాచార్యులవచనమ్ముల కనుగుణంబుగా నొడువదు మహాకవికాళిదాసుం డద్వైతమతావలంబి యయ్యుఁ గుమారసంభవంబునం దొక్కచో ముక్తులుగూడ భగవద్గుణంబులను గానము చేయుచుందురని సూచించిన ట్లీక్రింది శ్లోకమువలన నవగత మయ్యెడిని. ౩౩

శ్లో. ప్రాక్తనానాం విశుద్ధానాం పరిపక్వ ముపేయుషామ్
తపసా ముపభుంజానాః ఫలాన్యపి తపస్వినః. ౩౪

వ. పై నుదాహరించిన శ్లోకము సప్తమహర్షులకు సంబంధించినది ఆఋషులు తపస్సిద్ధిని బొందియు మరలఁ దపస్సునే చేయుచున్నారని దాని ముఖ్యతాత్పర్యము. సప్తమహాఋషులు ముక్తులు గారనికూడ వాదించునెడలఁ జెప్పవలసియుండదుగాని అంతవఱ కొప్పికొన్నచో నాపెరచన యసంగతము గాదు శ్రీమద్భాగవతమునందలి—

శ్లో. నివృత్తతర్షై రభిగీయమానాత్

అను శ్లోకముకూడ నిదే యర్థమును బోధించెడిని అథవా ఆయీ సిద్ధాంత మద్వైతమతస్థులకు రుచించు ననుకొన్నను నాపె యద్వైతమ తానుయాయురాలు కాదుగదా ? త్రిపుట్యైక్యము ద్వైతులకుఁగాని విశిష్టాద్వైతులకుఁగాని రుచింపదు. కావున ముక్తులకు భగవద్గుణకీర్తనము నుపపాదించుట విరుద్ధము కాదని నే ననుకొందు నాయీయజ్ఞాలాపమ్ముల కు క్షమించి కథాకాలక్షేపము జరుగనీయవలయు నని మిమ్ముం బ్రార్థింతు నని వెండియు. ౫౩

క. ద్వైతాద్వైతవిశిష్టాద్వైతమ్ముల నేది హెచ్చొ ? తగ్గేదొ ? పరిజ్ఞాతలె నేరరు; నేర్చిన, నేతావత్కాల మెట్టు లిన్నియు నిలుచున్.

గీ. వేశ్యకూఁతురు నిలిచి సవినయ మిట్లు
పన్యసించిన సభ యొక్కపరిగ నాపె
వంకకే దృష్టి సారించి "బాగు బా"గ
టంచుఁ గరతాళరవము సేయన్ దొడంగె. ౫౪

ఉ. వృద్ధుల కామెపైఁ గలిగెఁ గేవలవత్సలభావ; మిం కసం
బద్ధపుఁగోర్కు లుప్పతిలెఁ బాపపుదుర్విటకోటి; కెవ్వ రీ
సిద్ధవచస్క యెంత కృషి చేసినదో ? 'ఇద మిద్ధ' మం చనా
విద్ధపుఫక్కిఁ బల్కు టది విం తనిపించె జగజ్జనాళికిన్. ౫౫

ఉ. స్త్రీలకు విద్య లేమిటికొ ? చెప్పరువో ! మనవారు చెప్పుచో
నాలుగురెట్లు హెచ్చుగద ? నారులకు న్మనకన్న బుద్ధి, వా
చాలతమాత్ర మెంత సరసంబుగ నుండెడి ? గీర్వధూటితోఁ
బోలుపవచ్చు నీపెకులమున్ గన నెవ్వతె యౌనొ ? యద్దిరే ? ౫౬

గీ. అంతొ యింతొ విద్దియ వేశ్యలందుఁ గలదు
గాని యున్యత్ర యక్షరజ్ఞాన ముంట

అరుదు వేశ్యలవిద్దియ యాటపాట
లకు నుపకరించు నీకు నెంచులకును గాదు. ౪౦

వ. ఈమె యెవ్వతెయై యుండునో ? యని పలువురు పలువిధములఁ దమ
లోఁ దాము వితర్కించుకొను చుండిరి. అప్పండితుం డింకను నేదియో
వివదింపఁ దలంచియు సభ యందులకు సుముఖంబుగా లేకని యెంగి
తజ్ఞుండుగాన గుఱితించి మిన్నకుండె. ౪౧

క. వేతొకఁడు గవ్వకేనియు, మాఱనిబూకరి ద్విజుండు మాటాడంగా
నోరెత్త ధర్మకర్త యుఁదాయఁడు వారించె నంత నాఁగె సభఁ దొగిన్.

చ. హరికథ పూర్తి యయ్యె సభ యంతయు నాయకు సన్నుతించి, రా
మఱుసటినాఁడు వేఱు మతిమంతుఁడు “మాలలుఁగూడ మంటపాం
తరమును జొచ్చి దేవునిఁ గనందగునీ లొనరింపకున్న నో
దరుల ననాదరించినటు లౌ దురిత మ్మది మర్త్యజాతికిన్. ౪౩

వ. మఱియును జననాదివిశేషంబులయందుఁగాని కరచరణాదులయందుఁ
గాని రక్తమాంసాదులయందుఁగాని వాతపిత్తాదులయందుఁగాని వారు
మనకన్న భిన్నులు గా”రనుచుఁ గొంత యుపన్యసించి కొన్నిదేవాల
యమ్ములధర్మకర్తలే కాక కొందఱు స్వతంత్రరాజులుఁగూడ వారలకు
దేవాలయప్రవేశం బంగీకరించుట శుభావహం బనియు నీదేవళంబునం
గూడ దాని నంగీకరించుట దేశక్షేమకరం బనియు మనప్రాచీనులు సర్వ
సమబుద్ధిలేక వారల కస్పృశ్యత నాపాదించి రనియుఁ బోఁచిన నిల్ల
సిద్ధాంతం బొనరించుచుండుటఁ గని యుల్లసహాసములలోఁ గఱపు
రకు వెగటుగా నుండియు “నియ్యది కాలదోషం” బని ప్రతి చెప్పక
మిన్నకుండిరి. ధర్మకర్తకు మితిలేని యాగ్రహంబు జనించెంగాని యు
తండును దనలోనన యుపశమిల్లె; నట్టియెడ సుశీల లేచి బద్ధాంజలియై
సభకు నమస్కరించి, ౪౪

మ. అనఘా ! మీర లుపన్యసించినవిధం బాపాతరమ్యంబు గాఁ
గనుపట్టున్ బరికించి చూచినయెడన్ గానంతయున్ దాన మం
చిని నేఁ గానను, మీ కుయుక్తు లెవియున్ సిద్ధాంతముల్ గావు, వా
నిని ఖండింపఁగఁ బూనుకొన్నయెడల న్నిల్వంగఁ బో దొక్కఁడున్.

క. అపయుపపమత్వమును ర
క్తి విషయసామ్యంబు యోగ్యతకు గుఱుతని యే
కవులును సమ్మతి చూపరు
నవుఁ బాటు ప్రసంగమునకు నవ్వుదు రార్యుల్. ౪౬

ఉ. ఏదియొ "భాగ్య మబ్బ"నని యీ రితువంటి కుమార్గ మొందు స
ర్వాదరణీయ మౌటకుఁ బ్రయత్న మొనర్తురు దీనిచేత దా
మోదరుఁ డాగ్రహించినటు లూహకుఁ దోఁచుచు నున్న, దెన్నియో
యీ దెసఁ గీడు లుప్పతిలు టేకవియో ప్రకటించెఁ బత్రికన్. ౪౭

వ. తమ దక్కవిపద్యమ్ములు చదివియే యుండు రనుకొందు నైనను నా
కవి కంఠపాఠమ్మగుకతన మఱియుం గలసదస్యులకొఱకుఁ జదువు
చుంటి నవధరింపుఁడు. ౪౮

ఉ. "ఆలయముల్ ప్రధాన మయినట్టివి యంటువడెన్ శఠించి వ
ర్షా లెగఁదట్టె భూప్రజలు క్షామపుదేవత కగ్గమైరి దే
వాలయదేవతల్ కినిసి యాత్మపురమ్ములు చేరఁ బోయి రే
'రాలనపాలనల్' జరుపునట్టిరు మంత్రుల కేమి గావలెన్. ౪౯

చ. పశులకు మేఁత లేదు, పసిపాపల కక్కట ! పాలు సున్న, యీ
దృశమగు చిక్కునందు నొకదేవుఁడు దక్క శరణ్య మేనిరం
కుశులును గారు, దేవతలను శ్లపవిత్రిము లయ్యె నిట్టిదు
ర్దశఁ గొని తెప్పుకొంటిమి; వృథా విలపించిన నేమి లాభమౌ? ౫౦

చ. జపతపముల్ ఘొనర్చుటకుఁ జాలినబ్రాహ్మణజాతి పూర్తిగా
నపగతజీవమై మినుకులాడుచు నున్నది 'సైన్సు'వల్ల న
న్నిపుణులు వర్షధారల జనింపఁగఁ జేతురె ? నేఁడు దేవుఁడే
కృప జనియించి కావవలె నెవ్వరి 'సైన్సుల'తోడ నేమగున్. ౫౧

ఉ. తప్పు లొనర్చు పుత్రులను దంద్రుడు సైఁచుచె కానసౌ జగం
బెప్పుడు పుట్టెనో? గుడు లవెప్పుడు పుట్టెనొ? ముట్టుబిత్తరుల్
చెప్పులు గుట్టుపెద్దలును జేరరువో ? గుడి: బిడ్డలయ్యు నీ
ము ప్పుదయించె నేమికతమో ? భవితవ్య మెవం డెఱింగెడిన్. ౫౨

శా. సర్వజ్ఞత్వము ఫాలనేత్రుని, దభిజ్ఞత్వ మ్మ దెం తుండినన్
బర్వాల్ వాఱుట తప్పిదం బగు "నహంభావంబు చే" టంచు ని
ర్గర్వుల్ సెప్పరె ? యానుషుల్ మృషలె ? శాస్త్రం బన్న జంకన్వలెన్
దుర్వాదంబుల కేమి ? వాదముల "కంతున్ బొంతునున్" గల్గునే ?

చ. పరమపవిత్రుఁడైన భగవంతున 'కంటును సొంటు లే' దటం
చెఱుఁగనివారలుం గలరె యీభువి ? నట్లని యంటుముట్టుఁ గూ
శ్చెఱిఁగి యెఱింగి దేవతల కేరు నివేదన చేయఁబూని, రే
గఱువలు దీని కొప్పుదు రకాండమహాప్రళయమ్ము లిప్పుడుల్. ౫౪

ఉ. 'వచ్చు స్వరాజ్య మెయ్యదియొ ? ప్రామికొనంగల'మంచు నెంచి ని
ప్పచ్చరపుంగృతుల్ యువకవర్గ మొనర్చునుగాక యెన్నఁడో
చచ్చినయట్టు లుండు ముదుసళ్లకు నిట్టివిరుద్ధపుంగృతుల్
మెచ్చఁగ నేమి వచ్చె ? మెఱమెచ్చులకున్ మఱి లేవె పత్రికల్ ? ౫౫

గీ. ఇట్టికృత్యమ్ములకు ఫల మిదిగొ ? చూడుఁ
డనుచుఁ గఱవుతోపాటుగ నాహవంబు
మనకుఁ బ్రత్యక్షమయ్యె నే మనిన నేమి
లాభ ? ముద్వృత్తి యేరికి లాభ మిడదు." ౫౬

వ. ఆపద్యమ్ములకును నప్పటికాలమానస్థితికిని మిక్కిలి తార్కాణంబుగా నుంటచే సభాస్తారు లెంతయు నక్కజపడిరి పిమ్మట నా సుశీల మఱియు నిట్లనియె. ౨౩

క. మూన్నాళ్లధికారమ్మన, నున్నారో? లేదొ? యిట్టి వాకకొన్నికృతుల్ బన్నపుటిక్కలు పొనరిచి, చన్నారివి జగము నేర్చి చలపాదించున్.

క. జగమునకున్ శ్రేయస్కర, మగుపను లివి కావు జగము నడఁగించుటకే తగు నియ్యవి హేతువులై, యగుపడుఁ గన్నులకుఁగట్టి యాదుర్గతియున్

మ. ఒకదేశానకుఁ జీడ వట్టినపు డంతో యింతొ? ఆచీడ వే
ఱొకదేశానకు సోఁకకుండ దిది మీ రూహించియుంగూడ దు
ర్వికృతుల్ గల్పన సేయుమానరు మిము న్విష్ణుండె ప్రేరేచి నా
శకతాపారమునుండి తప్పికొనునావందంబు గన్పట్టెడిన్. ౬౦

వ జాతిభేదంబులు విరోధకారకంబు లనియు వాని రూపుమాపుట సర్వథా యైకమత్యసంపాదకం బనియు నందులకై యీచండాలదేవాలయప్రవేశంబు ప్రథమసోపానం బనియు మీరు వచించుచుందురుగాని ఖండాంతరంబులందలి వైషమ్యంబు లెఱింగియుంగూడ నిట్లు మీరు భ్రమపడుట కడుంగడు నక్కజం బని వెండియు ౬౧

ఉ. అందఱు తెల్లవారెకద? యావలిదేశములందు; వారిలోఁ
గొందఱిమీఁదఁ గొందఱికిఁ గోపము లుండఁగనేల? కూడియే
తిందురు కూడియే జనులు దేవళమందుఁ జరింత్రు వార ల
ట్లందఱు జాతివైరముల కాస్పదమై నశియించు టేటికో? ౬౨

చ. కులములె కారణంబు లనుకొంట పొసంగమి స్పష్ట మయ్యె న
వ్వలిప్రళయానలం బెఱుఁగువారికి, నెవ్వని కాయుధంబులున్
బలమును నుండు వాఁడె యగుఁ బార్థివుఁ, డిక్కతలన్ జరిత్రముల్
వలుకుచునున్న, వెందులకు భ్రష్టతకుం గుదురై నశించుటల్. ౬౩

చ. ఇతరబలంబు దైవబల మీద్వయ మెక్కుడ నుండు వానికిం
బ్రతి జగతిం గనంబడదు, ప్రాభవ మెప్పుడు వానిఁ గొల్చియే
బ్రతికెడి. మాలకూడు దిని రాజ్యము తెత్తుమె? దేవళంబులం
బతితులఁ దూర్చి రాజ్యమును బాలన సేతుమె? సిగ్గు సిగ్గయో? ౯౪

వ. ఏశాస్త్రంబువలన శిలావిగ్రహంబులు దైవతములై పూజార్హంబు లయ్యె
నో? ఆశాస్త్రంబులు చండాలురకు నాలయప్రవేశంబు నంగీకరింపవు
గదా! యిఁక దేని నాధారంబుగాఁ గైకొని మీ రీయుద్యమంబునకుం
గడంగెదరు? అధికారబలంబుంగాని సంఘబలంబుంగాని పురస్కరించి
కొని శాసనంబులు పుట్టించి చేయుపని యెన్నఁటికిని భగవత్సమ్మతం
బు గానోపదు పశుబలంబు సర్వథా దూష్యం బని మీరే వక్కాణిం
తురు. మరల మీరు దానినే యవలంబించుటకన్న శోచ్యం బుండదని
మీ కేల గోచరింపదో? యని వెండియు ౯౫

గీ. పాలవంటికులమ్ములు భ్రష్ట మగుచు
నుండె నెందుల కగుచుండెనో? తదర్థ
మేని సిద్ధించుటయు లేక యెంత వెనుక
కేగవలె నంత వెనుకకు నేగుచుండె. ౯౬

వ. ఆయీ సందర్భమ్మున నాయెఱింగిన యొకచిత్రచరిత్రంబు గలదు; దాని
వలన నిపుడు మనదేశపుదుర్దశ యెట్లు ప్రబలుచున్నదియుఁ దెలియన
య్యెడిని వినుండు. ౯౭

చ. కలఁ డొకబ్రాహ్మణుండు కడు గణ్యుఁడు, బిడ్డలఁ గాంచె, నెల్లపు
త్రులు గడు యోగ్యు; లం దొకఁడు రోయకమాలెత నాలిఁ జేసికోఁ
దలఁచె భవాదృశుల్ దెలుపు ధర్మపుమర్మము లాలకించి, దే
వళమున కీర లాజ్ఞ నిడఁ బారెఁడొ? మూరెఁడొ? దేఁకె నాతఁడున్

ఉ. బాలురు బాలికల్ గలిసి పాఠములన్ మఱి పాఠశాలలం
దోలిఁ బఠింపవచ్చు ననుచుందురు గొందఱు ముప్పు దెచ్చుఁ ద
చ్ఛీలము లెంత మంచిపరిశీలన గల్గిన నైన, విప్రుఁ డ
బ్బాలుఁడు మాలెతం గొనెడి పాతకహేతువు దానిదోసమే. ౧౯

ఆ. "పొలఁతి దావవహ్ని పురుషుఁ డాజ్యఘటంబు
కదియకుండవలయుఁ గదినేని
బమ్మయైనఁ గూఁతుఁ బట్టకమానఁడు
వటున కింతిపొత్తు వలదు వలదు " ౨౦

వ. అని శ్రీమద్భాగవతమునందు ద్విరుక్తంబగు నిషేధమ్ము గన్పట్టుచున్న
ది. అది యున్మత్తప్రలాపం బెన్నఁడును గా దని వెండియు, ౨౧

ఆ. ఏకపాఠశాలనే జవ్వనము వచ్చు.కాలమందుఁ గన్యకలను గలిసి
విద్యనేర్చువా రవిద్యకు నగ్గమై, యిట్టిముప్పు గాంచు టేటివింత. ౨౨

క. వలపు కులమ్ము నెఱుంగదు
వలపునకున్ వావి సున్న. వరుసయు నట్లే;
వలపునకుఁ దఱచు నొకచోఁ
గలసిమెలసి యునికి యొకఁడె కారణ మెందున్. ౨౩

వ. ప్రకృతం బవధరింపుఁ డామెకును నాయనకును వివాహబంధంబు విడా
కులచట్టముంబట్టియో వేఱువిధమ్మ్ననో కొలఁదికాలమ్ములో విచ్ఛిన్నం
బయ్యె నిప్పు డాయనకు బ్రాహ్మణకన్యక నెవరేని యిచ్చినఁ గైకొని
పెండ్లియాడు కుతూహలం బున్నట్లు చెప్పికొందురు ౨౪

గీ. కతఁడు ప్రయోజకుఁ డాయన గడన సేయు
వందలకు వంద లొక్కొక్కవారమునకె
నిష్కళంకచరిత్రుండు నీతిపరుఁడు
తల్లిదండ్రులు గలవాఁ డతండు మఱియు. ౨౫

వ. మాలెతతోఁ గొందొకకాలమ్ము సంసారియైన కారణమ్మునఁ దల్లిదండ్రులును సోదరులును నతనిపొత్తునం గుడుచుట లే దనునంతట నయ్యుపన్యాసకుండు.

గీ. ఊరకే చెప్పెదవో ? లేక యున్నవాఁడో ?
అట్టివరుఁడు వివాహార్థి యగుచు నొకట
నిక్కముగ నుండెనేనియు నేన యిత్తుఁ
బెండ్లి యీడు దాఁటిన నాదుపెద్దకూఁతు. ౫౭

ఉ. ఈవిటు సంస్కృతంబుగ నెదే మదిఁ బెట్టుక పల్కినట్టి యా
భావము దూరదూరముగఁ బ్రాఁకుచునున్నది సందియంబు నా
కీవిషయమ్మునందు లవమేనియు లేదు వరింపఁజేతు భూ
దేవసుతుం డతం డనుమతించుటయే తడ వంబుజాననా ! ౫౮

క. తలిదండ్రులు సోదరులున్
వెలిగా నయ్యలఘుఁ గనుట 'వెట్టి' యనియె నేఁ
దలఁచెదఁ గులతత్త్వమ్ములు
తొలఁగింపక యున్న దేశదుర్దశ తెగునే ? ౫౯

గీ. ఏను నలబ్రాహ్మణునికన్న హెచ్చు "విప్పు
గడుగుఛాందసకులము"నఁ బొడమినాఁడఁ
దుదకు దేశదాస్యమ్మును ద్రుంప నెంచి
వెట్టికట్టుఁబాటుల నొగి వీడినాఁడ. ౬౦

వ. ఇవ్విధమ్మున నలదేశభక్తిపరవశుండు తనమనమ్మునం గల నూతనాభిప్రాయమ్ములు తేటతెల్లమ్ముగ వివరించుచుండ నయ్యవి వినుటకుఁ గూడ సమ్మతిలేని ధర్మకర్త నిపుణంబుగ నయ్యుపన్యసించుమానిసి నభినందించి వేశ్యకన్యక దిక్కు మొగంబై. ౬౧

ఉ. ఈయనచే జయింపఁబడి తీవె యహో? శ్వపచన్ వివాహమై
యీయన దానిఁ గోలుపడి యీడఁ దలంచినపెండ్లి కీయఁ దే
మో? యనఘన్ దనూజ నని యుక్తిమెయిన్ వచియించి తీవు, "నే
నీయఁగ సిద్ధ" మంచు వచియించె నిఁకేమి యొనర్తు వుగ్మలీ! ౯౨
ఉ ఇచ్చును గూఁతు నీతఁ, డతఁ డెట్లును దా గ్రహియించుఁ, బెండ్లి వే
ఱెచ్చటనేనియున్ జరుగుచే యుచితం బగుఁ గాని వీర లా
ముచ్చట కీ రమావిభుని ముంగలకున్ జనుదెంతు రేమొ? "రా
విచ్చుట లే" దటం చిపుడె యేర్పడఁ జెప్పితి నోతలోదరీ! ౯౩
వ. అది యటు లుండె, నీయుపన్యాసకుండు కొండఱవలెఁ గాక చెప్పినదాని
నాచరణంబునఁ గనఁజేయు నుత్తముఁ డగుటంజేసి యభినందనీయుం
డని ప్రశంసించి సగౌరవమ్ముగా నాపె నుద్దేశించి. ౯౪
ఉ, నిన్న నెదో వచించితివి నేరుపుగా సభలోనఁ బ్రాయమా?
పిన్నది, వేదశాస్త్రములఁ బేర్పడు పెద్దలకన్న నెంతయున్
మిన్నగ మాటలాడితివి మిక్కిలిసంతస మందినార, లం
దున్నయభిజ్ఞు, లేది కుల, మొజ్జ లెవారు? వచింపు కోమలీ! ౯౫
క. నీతో నుండినవృద్ధులు, నాతండును ముగురు నేమి యగుదురు నీ; కో
శీతకరానన! నీప్రజ్ఞాతిశయము వర్ణనీయ మది యటు లుండెన్. ౯౬
ఉ, ఇప్పటికాలమందుఁ గల యేపువుఁబోఁడులు గాని నీవలెం
గొప్పు ధరించుకొంట కనుఁగోఁబడ దెంతటి ఛాందసంపుఁ గం
పొప్పెడి యిండ్లనైన; నిది యొక్కటి గాదు భవద్విధంబు సొం
పెప్పటినాఁటిదో? యిది సహింపరు నేఁటికుమారికామణుల్, ౯౭
క. భగవంతుం డిచ్చిన యా
సొగసు మఱుఁగుపడఁగఁ జేయఁజూచెడి చిన్నెల్
మిగులఁ గనుపట్టుఁజుమి నీ
దగు కట్టున బొట్టున మఱి యన్యమునందుఁగా, ౯౮

క. పై వేషమ్మున కేమి? మ్మహావిద్వాంసులకుఁ దెలియు నంశమ్ములు నీ
వేవెఱవున నేర్చితి కొల, మీవిద్య లెఱుంగు ద్విజులదే యిసునొక్కొ? ౧౦౦

వ. నావుడు సవినయమ్ముగ నమ్మదిత యిట్లను.

ఉ. బోగమువంగడమ్మునెడఁ బుట్టినదానను నేను, గాశిదా
సే గురుఁ, డమ్మహామహుని వెన్నికృతుల్ గల వన్ని చూచితిన్
భాగవతంపుఁ బద్యములు పాఠము సేయుదు, భారతమ్ములో
భాగము లచ్చటచ్చటివి భక్తిమెయిన్ బఠియింతు నిచ్చలున్ ౧౦౧

వ. మా గణికలకు నత్యావశ్యకంబని భరతముని నిర్దేశించినచొప్పునఁ జిన్న
తనంబునఁ గౌండొకపాణినీయంబు కావ్యమ్ములతోపాటుగఁ బఠియించి
తింగాని యయ్యది యిప్పుడు విస్మృతప్రాయంబ యయ్యెనని వెండియు

తే. వట్టివార్తలు ప్రచురించు నట్టిపత్రి
కలను నే నంతగాఁ జూడఁ గవివరేణ్యు
లెంచి ప్రకటించు వ్యాసము లెపుడుఁ జదువు
చుందు నాచదు వింతకు నుండ దెచ్చు. ౧౦౩

తే. నాకుఁ దెలిసిన దేమి యున్నది నిజాన
కీరు నను మెచ్చుకొనుటకు హేతు వరయ
భవదుదారస్వభావ సంభవదఖండ
యోగ్యతాతిశయంబ వేఱొండు లేదు. ౧౦౪

వ. అని తనచుట్టునుంగల మూర్తులవంక దిక్కై ౧౦౫

ఉ. ఆయన రాజమౌళి, మఱి యాయన వైశ్యకులావతంసుఁ, డ
ల్లాయన విప్రమౌనివరుఁ, డందఱ నొక్కటఁ గూర్చె దైవ, మిం
దేయెవ రేరి కించుకయు నేమియు బంధులు గారు, వాసమున్
జ్ఞేయుదు మొక్కచో నడవిఁ; జేయుచునుందుము తీర్థయాత్రలన్.

వ నావుడు ధర్మకర్త నీనొడివిన దెల్ల యథార్థంబ యయ్యెఁ గొండొక ప్రశ్నించుట కవకాశంబు గల్పించుచున్నది. అగుఁగాక! అతిగాఁ బ్రశ్నించుట సజ్జనలక్షణంబు గాదని విరమించుటయు నయ్యతివ తాము ప్రశ్నింపకున్నను నేన విన్నవించుదాన నని యిట్లు చెప్పందొడంగె.

క. కులవృత్తియందు నాకుం, దలఁపెక్కుక వదలికొంటిఁ దగునట్టిరు మా కొలమునఁ జిక్కరనుచుఁ బెం, డిలికిన్ యత్నంబు లేదు నృపతివరే [ణ్యా!

తే. ఇపుడు జాత్యంతరవివాహ మెల్లయెడల
మొలక లెత్తుచునున్నది వెలవెలంది
కూఁతు రనక న న్నెవ్వరో? గొవ్వకొలము
వారె కైకొంద్రు నా కట్టివాంఛ లేదు. ౧౦౯

వ. ఏమని ప్రశ్నింతురేని చిత్తగింపుఁడు. ౧౧౦

ఉ. వారికి మాలమాదిగలు వారవధూటులు నెల్లవారలున్
గౌరవభాజనంబు, లటుగావున వారివి గట్టుకొన్నచో
వారక వారకామినులవర్తనకన్నను హేయమౌ నటం
చూరక బ్రహ్మచారిణిగ నుండఁ దలంచితి యావదాయువున్. ౧౧౧

వ. మఱియు నామనస్సును మిక్కిలిగాఁ గలవర పెట్టుచున్న దింకొక్కటి కలదు, దానికతన నిక్కాలమునందలివారి కేరికిని గృహస్థాశ్రమము సుఖదాయి కాక పలువిచారములకుఁ గారణ మగునని నానిశ్చయము.

ఉ. ఉత్తమబ్రహ్మవంశమున నుద్భవమందియు మాలదానిపొ
త్తత్తిన యాద్విజాత్మభవు నచ్చరితం బది విన్నదాది మ
చ్చిత్తము పెండ్లికిం దలఁపు వేయదు సంతతిఁ గన్నమీఁద నే
యుత్తలపాటు చెందవలెనో? యని, కాల మ దట్టు లుంటచే.

ఉ. మాలెత నాలి నేలు నలమంచికులీనునితల్లి యెంతగా
జాలికి నగ్గమై నొగిలి చాలఁ దపించెనొ? యెందు కింక నీ

జోలి, విరాగమూని మధుసూదనునిన్ స్మరియించుకొంటకే
కాలముగాని పెండి లికిఁ గాలము గా దిది యంచు నెంచితిన్. ౧౦౪

చ. ఎఱిఁగి యొనర్చు నిట్టికృతి కెందును నిష్కృతి లేక యుంట తా
నరసియుఁ బుత్రవత్సలత యాత్మ దహింపఁగఁ దండ్రి పుత్రకున్
బొరిఁబొరిఁ బ్రోత్సహించెఁ దనపౌత్రునకున్ మరలన్ గ్రహింపః సం
కరతకుఁ బుత్రుఁ డొప్పమిని గల్మష మయ్యది యాఁగె నంతతో.

ఉ. మంచికొలమ్మలే మతులు మాఱి యధోగతిపాలుగాఁగ నే
మంచియు లేని మాకొలముమాట వచింపఁగనేల ? యెట్టులో
యించుక కన్ను మూసికొని యీయెలప్రాయము వెళ్ళఁ బుచ్చుచోఁ
గాంచఁగవచ్చు యోగినులు గాంచెడి యుత్తమ పుణ్యమార్గముల్.

ఉ. ఇం దెదియేని విచ్యుతియు నీశ్వరునిచ్చకతానఁ గల్గుచోఁ
గం దది మాకొలమ్మునకుఁ గల్గినకందుకు హెచ్చు గాదు నా
యందుఁ బరాత్పరుం డలుగు నట్టియఘం బది సోఁకకుండ మీ
రందఱు దీవనల్ సలుప నంజలి యొగ్గి నమస్కరించెదన్. ౧౦౭

వ. అనవుడు ధర్మకర్త యక్కలికిమనోనిశ్చయంబునకు వెఱఁగందుచు సం
తసించి "నీపురాకృతంబు మంచి" దనియు "నీవచనంబులు వనితాలో
కమ్మునకె కాక పురుషులకును శిరోధార్యంబు" లనియుఁ "బ్రకృతకాల
దౌరాత్మ్యంబు నీవలెం గనిపెట్టినవారు సనాతనులందుఁగూడ నరుదుగా
నుందు" రనియు వక్కాణించి. ౧౦౮

మ. కొడుకుల్ గల్గినఁ గూఁతు లుద్భవిలినన్ గోడండ్రు నల్లుండ్రు నే
కడజాతుల్ ఘటియింతురో ? యనెడి దుఃఖం బక్కటా ! అర్యు లీ
చెడుకాలమ్మునఁ బుట్టు టేటికొకదా ? సీ ! సీ ! దురంతమ్మ తె
వ్వఁడు సైఁచున్ భరతావనీభవుల కీపాట్లబ్బె నీనాఁటికిన్. ౧౦౯

మ. సడికిం బూర్వులు జంకువార లిపుడో ? జంకన్నదే లేదు ముఖా
బిడియం బంగన కుండె నిప్పు డది యుంటే పెద్దదోసం బహో

విడియాకుల్ మఱియున్ "విడో" స్వరిణయావిర్భావమర్యాద లీ
చెడుకాలాన మనస్వి యేవిధమునన్ జీవించి వర్తించెడిన్ ? ౧౨౦

వ. అనుచుఁ దనమనమ్మున నప్పటి దురాచారంబులందలి యేవమ్ము నగ్గ
డించి యాపెతో "నీవును వీరును నియ్యెడ స్వామికైంకర్యంబు సలిపి
కొనుచు నెంతకాల మ్మున్నను మీయోగక్షేమమ్ము లెల్ల నాయవి యని
యభినందించి గౌరవించెఁ, బదంపడి వారు నలువురు నచ్చటనే భగవ
త్సేవాపరాయణులై వసించిరి. ౧౨౧

ఉ. స్వామిప్రసాదముం దినుచు స్వామికిఁ బూవులు గోసి యిచ్చుచున్
స్వామిని బాడుచున్ వినుచు స్వామిని జూచుచు స్వామిభక్తులై
నోములు నోఁచువారలఁ గనుంగొనుచున్ జని సార్థకంబుగా
నామెయుఁ దక్కుమూఁగురును నయ్యెడ నుండి రఘౌఘదూరులై.

ఉ. స్వామియు వారిపట్టునఁ బ్రసన్నహృదంతరుఁడై స్వకీయమౌ
నామమునందు వారల కనారతభక్తిని బేర్మి నిచ్చి త
త్క్షేమముఁ జూచుచుండెఁ దిలకించెడువారికి వారిచర్య యు
ద్దామముదంబు గూర్చె సుకృతంబున కుబ్బనివార లుందురే ? ౧౨౩

వ. అని చెప్పునంతకు మాధ్యాహ్నిక నియమంబులకుఁ దఱి యగుటయు
సదస్యులును సూతుండును సభ చాలించిరి.

ఆ శీ ర్వ చ న ము

క. ఘనుఁ డుద్యోగియు నయ్యును
ననుదినమున్ మాధవార్చనాసక్తిన్ జీ
వనముం బావన మొనరుచు
ననఘు జగన్నాథుఁ బ్రోచు నామాధవుఁడే.

గ ద్యం.

ఇది శ్రీ తిరుపతివేంకటీయంబగు సుశీల యను కేవల
కల్పితప్రబంధమ్మునందుఁ జతుర్థాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీమత్పరదేవతాయై నమః

# సుశీల

## తిరుపతివేంకటీయము.



### పంచమాశ్వాసము.

వ. మరల నిర్వర్తితానుష్ఠానులయి మునులు కృతాహారులై సభఁ దీర్చి కూర్చుండి యవ్వలికథ వినువు మనుడు నాతం డిట్లు వక్కాణింపఁ దొడంగె. ౧

ఉ. వారలయున్కిఁ గాంచి చనువారలమూలమునం గ్రమమ్ముగా
వారవధూటితల్లికిని వైశ్యునిపుత్రుల కెట్టులో నిజం
బారయనై వెసం గొమిరె నారయఁ దండ్రినిజూడఁ దల్లియున్
ధీరులు సెట్టిపుత్రులును దేవునికొండకు వచ్చి రంతటన్. ౨

చ. కొమరితఁ జూచినంతఁ గనుగొల్కుల నీరు ప్రవృద్ధ మయ్యె నా
రమణికిఁ, దల్లిఁ గాంచు నలరామకుఁ గన్గవ నిండ నిండె బా
ష్పములు; విరక్తి యెక్కడికిఁ బాతెనొ? దైవ మెఱుంగుఁ దత్సమా
గమ మది తాదృశంబు; పులకల్ జనియించెను జూచువారికిన్. ౩

వ. ఉవ్వెత్తుగాఁ గొమిరెం గౌఁగిలించికొని కొండొకసేపు విస్మృతసకల ప్రపంచవ్యాపారయై పదంపడి సగద్గదమ్ముగా నిట్లనియె. ౪

శా. కాషాయాంబరమున్ ధరించి యొదలం గైసేఁత వర్జించి యీ
వేషం బేటికిఁ దాల్పఁగా వలసె? నేవేశ్యాంగనల్ గాని నీ
వేషంబుం గని మెచ్చికొందురె? నిను న్వీక్షించితి న్నేఁటి కే
వేషంబైన మతేమిలే, తుద కిటుల్ వెష్టైత్తెనే? తల్లిరో! ౫

ఉ. ఏమి కొఱంత నీకుఁ గల దింట, సమస్తము నున్నదానవై
యీమెయి జోగులం గలసి యిందు వసింపఁగనేల ? తల్లి ! యీ
సాము లెవారు ? వీరికిని సఖ్యము నీకును నెట్లు గల్గె ? నా
నోముల కిట్టిదుర్గతి గనుంగొనఁ జేయునె ? దైవ మక్కటా ! ౬

ఆ. "మచ్చుమందు చల్లి మరగించుకొందురు
జోగు" లందు రట్టిచొప్పు సంభ
వించెనేమొ ? తల్లి ! వీరఱకతమున
నేమి సేయుదాన నెందుఁ జొత్తు ? ౭

చ. కనుఁగవవిందు గాఁగ నినుఁ గాంచినవారికి నేఁటి నీదురూ
పునఁ గలమార్పు పెంతవగఁ బుట్టఁగజేయునొ ? రూపమేకదా
మనకు ననాదిజీవితము మంచిగఁ బేరుఁ బ్రతిష్ఠఁ గాంచు జ
వ్వనమున నీకు నింతటియపస్మృతి గల్గు టిదెట్టికర్మమో ? ౮

క. నిన్ను 'సినీమా'తారగ, నెన్నఁడు గైకొందు మనుచు నెందఱొ ఘనసం
పన్ను లెదురుచూచెద రా,మన్నన కిపు డుత్సహింత్రు మంచిగృహస్థుల్

సీ. సీతకుఁ దండ్రియౌ క్షితినాయకునికన్న
ద్రౌపదిఁ గన్నట్టి రాజుకన్న
సత్యభామనుగన్న క్షత్రియోత్తముకన్న
సావిత్రిఁ గన్న భూజానికన్న
నిందుమతిని గన్న పృథ్వీనాయకుకన్న
సంయుక్తఁ గన్న భూస్వామికన్న
మండోదరిని గన్న మాననీయునికన్న
నలయరుంధతిఁ గన్న యనఘుకన్న

గీ. నే"సినీమా"నొ తగ నటియించు తారఁ
గన్నతండ్రియె "సుకృతంపుగని" యటంచు

నెల్లగృహమేధు లట్టిసుకృతముకొఱకు
మఱియుకాలమ్ముసుమి! యిది ముద్దుతల్లి! ౧౦

క. మన కిప్పుడు సంసారపు,వనితలతో స్పర్ధ గలిగె వారవధూటీ
జనులకుఁ గీరితిఁ దేవలెఁ, జనునే? యిప్పట్ల వెట్టిసన్న్యాసంబుల్. ౧౧

చ. కనుఁగవ కింపు గల్గి నుడికారపు సొంపులు గల్గి గాత్రమం
దున రుచిగల్గియున్న మనతొయ్యలు లెందఱొ యాకసమ్మునం
దున నలతారలంబలె నెదో యొకపత్రికయందుఁగాక మ
న్ననఁ గనుచున్నవారలు ఘనంబగు పత్రికలందు ఫిల్ములన్. ౧౨

శా. మాతోఁ జెప్పక నీ వెటో చన 'సినీమా' లెల్ల గాలించి ప్ర
ఖ్యాతిం గాంచిన పత్రికల్ వెదకియున్ గన్పట్టకే పోవ నీ
చేఁత ల్లో దలపోసికొంచు నెటులో జీవచ్ఛవంబై యిటుల్
నాతల్లీ! భరియింతు జీవితము నే నానాఁటికిం జిక్కుచున్. ౧౩

సీ. వెంకోబరావుగా ర్విధవ కూఁతుఁ దనంత
నంపె "సినీమా"కు నాపె యేగె
నిప్పు డాతన్వంగి కిద్దఱు బిడ్డలు
మంచిముత్యమ్ములమాద్రి నుందు
రెవరు పునర్వివాహేచ్ఛువులో వారి
కిది పెండ్లివేదిక యింత నిజము
మననాగమణి వెట్టిమానిసి వెంకోబ
రావు 'వలపుసాని' రావు తనకుఁ

గీ. దప్పు లే దిప్పు డియ్యది ధన మొసంగు
నొప్పి రాఢ్యులు 'పంపుమీ' యుత్పలాక్షి
నన్న వినక "సినీమా"కు నాత్మజాత
నంపినది కాదు చేదస్తురాలు వింపె? ౧౪

గీ. పదులు గా వేఁబదులు గావు వందలేనిఁ
గావు వే లిచ్చుచున్నారు రోవెలందు
కలకు సంసారిణుల కంతకన్న హెచ్చు
గా నొసంగిరి యిప్పు డాఘనత తగ్గె. ౧౫

సీ. సోమయాజులుగారు సోమిదేవమ్మయుఁ
గన్నబిడ్డలకన్న ఘనత గలదె?
పంతులుగా రల్లపంతులయిల్లాలుఁ
గన్నబిడ్డలకన్న ఘనత గలదె ?
శాస్త్రిలుగా ర్వారిసహధర్మచారిణీ
కన్నబిడ్డలకన్న ఘనత గలదె ?
పేరందు రైతులు వారియిల్లాండ్రును
గన్నబిడ్డలకన్న ఘనత గలదె ?

గీ. అట్టివారల కేమాత్ర మందచంద
ములును గాత్రమాధుర్యము గలదయేని
యే "సినీమా"యొ వారలయింటి కేగి
ముందు ధనమిచ్చి వరియించు టెందుఁ గలదు. ౧౬

సీ. ఇంకొక్కసువిశేషమీ "సినీమాతార"
లను బత్రికలయందు "గొనవుటిక్క"
లని వ్రాతురే కాని యన్యథాగా వ్రాయ
రాస్థాన మట్టిగుణాతిశయము
"గలిగించుచో" టని కడకు సిద్ధాంతితం
బయి యెల్లగేస్తులు నాత్మజాత
లను "సినీమా" మతాలకుఁ "దారలు"గనంపు
చున్నారు చోద్య మింకొకటి వింటి

గీ. వేశ్యలం జేర్చికొన్నఁ బవిత్రులైన
నటులు చెడుదురు సంసారినాయికలను
జేర్చికొన్నచో నుండవు చిక్కు లట్టి
వనియుఁ గొంద అనుటగూడ నాలకింతు. ౧౭

క. ఇది యొకమాదిరి కాలం
బది యిది యననేల? పూర్వ "మనుచిత" మంచ
న్నది యిపు డుచితం బగు నిఁక
నెది యపు డనుచితమొ యదియు నిపు డుచిత మగున్. ౧౮

చ. ఎది యెట్లైననేమి? మన కిప్పటి కింకను "దార" అందు నా
స్పద మరికట్టఁగాఁ బడిన చందము గన్పడ దింకముందు "రో
ముదితలఁ జేర్చికో" రనెడి ముచ్చటలున్ విననయ్యె, భావికే
మిది తరుణమ్మొ నీకుఁ జెడనేమిటి కమ్మ? వృథా వికారివై. ౧౯

గీ. భరతముని నాట్యశాస్త్రాన వ్యక్తపఱిచె
గణిక యన నెట్టిదో? అట్టిగణిక లరుదు
నీకుఁ జెప్పించితిని దల్లి! నేను దమ్మ
నీంద్రుఁడు వచించినట్టి యాయెల్లకళలు ౨౦

సీ. సరసీరుహంబుకూఁతురు "సినిమా" తార
యఁట! నీకు దానికెంతంతరంబు?
పౌన్నాక్షిమన్మరా లన్న విగ్రహపుష్టి
యేకాని కీచుగొం తెఱుఁగమొక్కొ?
"కోలారు" చెల్లెలు మేలుగాఁ బాడెడిఁ
గాని యొంటెవిధంబు దానిసొరు
మాలతీమాలకుమారి పేరికెగాని
యభినయించెడి నేర్పు పసలె సున్న

గీ. పీర లిప్డు "సినీమా"లఁ దారలుగ గ
ణింపఁబడి వేలకొలఁది గణించుచున్న
వా రడవిఁ గాయు వెన్నెలతీరు నీదు
సొరుఁ జదువును నగుట విచారకరము. ౨౧

వ. ఇట్లు మిగుల వగలం బొగులు తల్లిమాటలు వెగటుగ నున్నను దల్లి
యను గౌరవంబునంజేసి యెట్లో వినఁగల్గియుఁ దనకుఁ దల్లికన్న నెక్కు
డుగఁ దోడునీడలుగను నేడుగడలుగను బరలోకబంధువులుగను నున్న
త్రిమూర్తులీప్రసంగమ్మ నేవగించుకొందు రని తలఁచి నేర్పున వారిం
చి యాపెతో నిట్లనియె. ౨౨

సీ. ఆ "సినీమా" తారలగు గేహినులకున
మస్కార మొనరింతు మహితచరిత
యైన తత్పుత్రిక లందఱి కిదె నమ
స్కారమే నందులోఁ జేరనమ్మ!
"తార" యన్పదమందు ధ్వనితమౌ నర్థంబు
నే రెఱుంగరు సుకవీశు లంబ!
అగుఁగాక యది గౌరవాస్పద మాత్మీయ
కులవృత్తియే కడుఁ గలుష మంచు

గీ. సేవ ముదయించి ననుఁ గని యింతదానిఁ
జేసినట్టి తల్లిని నినుఁ జెట్ట నగుచు
పీడి వచ్చిన నాకు నేగోడు వలవ
దఘహరుఁడు తల్లి తండ్రి నారాయణుండు. ౨౩

క. వెలవెలఁదియయ్యు నెంతటి
కలుషాత్మిక యయ్యుఁ దల్లి కడుపునఁ గనుటన్
గలవేలుపులందఱకున్
దలమానిక మగుట ని న్నెదన్ స్మరియింతున్. ౨౪

ఉ. భోగమువృత్తి నచ్చకయె పోవిడనాడియు నిల్లు రోసి పై
రాగులఁ జేరితిన్ మది తిరంబుగ హాయిగ నున్న దింటిలో
లోఁగడ నాయెఱుంగు బుధలోకవిరుద్ధపుఁ జెయ్వు లిట్లు బై
రాగిగ నన్నుఁ జేసె నిఁక రక్తి జనింపదు నాకు నింటిపై. ౨౫

ఉ. దేవునియూడిగంబును విధించిరి పూర్వులు దేవదాసి కా
భావము "నేతిబీఱ" యయి పాడఱకుండఁ జరింతుఁగాక ఆ
దేవునిదాస్యము న్విడిచి దేబెలదాస్య మొనర్చుచో మహా
భావులు పెట్టు పేరది యపార్థము గా కెటు సార్థకంబగున్. ౨౬

శా. పే రంచొక్కటి పెట్టుకొన్నయపు డాపే రెల్లరున్ సార్థకం
బౌరీతిన్ జరియింపకున్న నొకరే నందందు వర్తించుచో
ధీరుల్ మెత్తురు బ్రాహ్మణాదులను నింతే అంతమాత్రాన స
ర్వారెల్లన్ గణుతింపఁగాఁ బడుటయే వ్యాఖ్యానతో లభ్యమౌ

చ. వెలసతి పెండ్లియాడునెడ వేఱొకరుం దలదేపుఁ దేని "అ
క్కలికికి వానిసేవ కవకాశము గల్గుట కష్టసాధ్య" మం
చలమహనీయు లేర్పఱచి రాపె స్వతంత్రగ నుండునట్లు ల
వ్వల నఁబదేవదాస్యము ప్రపంచకదాస్యము గాఁగ నేర్పడెన్. ౨౮

క. దేవుఁడు ప్రపంచరూపుఁడు,గావున నది యొప్పికొనిరి గాఁబోలు బుధుల్
కోవిదు లేవము చూపెడి,యీవర్ణమునందుఁ బేర్మి యెవ్వారికుండున్.

వ. అని మఱియును. ౩౦

ఉ. నా కొకజోలి యేల ? జననంబు తరింపఁగఁ జేయు "దేవదా
సీ" కమనీయనామమును శిష్టు లెటో కరుణించినారు నే
నేకడ కేగ కిచ్చుటనె యీభగవంతునిదాసినై జను
శ్శ్రీ కళ గట్ట సేవలను జేయుదుఁగాక తరింతుఁగా కెటో. ౩౧

క. అలవాటు పడితి నాకల,ములు దుంపలు దినుచు దేహమును నిల్పుట కీ
మల నవి దొరకెడి నేదిన,మలినను బ్రాణంబు నిలుచు మఱి రుచులేలా?

క. "దేఁకు రసన దాఁట నరక,లోకం" బను తెలియఁగ లేక లోకు లరక యే
యేకారురుచులకో?యెగఁ,బ్రాఁకుదు రిది జిహ్వా సలుపు పాతక మకటా.

గీ. జిహ్వాదోష మంతటఁ బోక చిత్తమునకు
వికృతి గలిగించి తుదకు నారకపుఁద్రోవ
కీడ్చు నటుగాన నాదినే యీపిశాచి
నణఁచి ప్రాజ్ఞుండు స్వాతంత్ర్య మందవలయు. ౩౪

క. పొట్టకు వినాగ నెవ్వఁడు,గట్టికొని చనండు జనుఁడు గట్టిగ దానిం
గట్టఁగలవాఁడు దేవుని,గట్టంగా నేర్చు హృదయఘట్టమునందున్. ౩౫

ఆ. వెడఁదపొట్టకొఱకు విజ్ఞత్వ మదియెల్లఁ
బొల్లు గాఁగ వృథగఁ జిల్లిగవ్వ
కేని సిద్ధపడుచు హ్రీ వీడి వర్తించు
బుధునికన్న వెడఁగు పుడమిఁ గలఁడె ? ౩౬

క. జ్ఞానం బబ్బినయప్పుడు
దానిన్ భగవంతు చరణదాస్యమ్మున కే
మానవుఁడు వ్యయింపఁడొ? య,
మ్మానవజన్మంబు మేలొ? మహిషము మేలో ? ౩౭

క. కలిమి గలిగి లుబ్ధుండై, తెలివి గలిగి దేవుని కవిధేయుండై య
వ్వల నేమగునో? మనుజుఁడు?,విలపించిన లాభ మేమి?వృథగానపుడున్

వ. ఇది యంతయు నీశడం ద్రవ్వినఁ బ్రయోజన ముండదు కావున నీతుట్ట
తుదిమాట నాలింపుము. ౩౮

ఉ. ఎందటి కీవు తల్లివొ ? మఱెందఱ కేను దనూజనో ? వృథా
గందరగోళమందుఁ బడి కాయ మొసంగిన దేవదేవు నా
నందమయాత్ముఁ గొల్వక యనారత మేరికొ సేవ చేసి యా
క్రందన మేల సల్పవలెఁ గాలుపురాన దురుద్ధరవ్యథన్. ౪౦

తే. జననమరణప్రవాహ భాజనము దేహ
మిది పరీక్షార్థమై దేవుఁ డిచ్చు నంద్రు
చదివియుఁ బరీక్ష కేగనిజనునిభంగి
గాదె ? భగవంతు సేవింపఁ గలుగకున్న. ౮౧

క. మూన్నాళ్ల ముచ్చటగదా ?
యి న్నరజన్మమ్ము దీని నెఱిఁగియు భగవం
తు న్నమ్మి సేవ సేయక
యెన్నో చొసఁగులకుఁ జొత్తు రేమనవచ్చున్. ౮౨

ఉ అందఱు నందచందముల కాస యొనర్తురు లోకు, లందులో
నం దొలివారు భామినులు, నారులయందును వేశ్య, లౌఁగదా ?
యెందుకు ? మూఢులన్ జెఱుపనేకద ? యిప్పటికేని నీకు నీ
కందునెడన్ విరక్తి కవకాశ మొసంగదె ? చిత్త మంబరో ? ౮౩

వ. అని మఱియును. ౮౪

చ. ఎఱిఁగియె పెట్టిరో ? యెఱుఁగకే వెసఁ బెట్టిరొ ? "దేవదాసు"లన్
సరసపు నామమున్ మనకు సద్బుధు; లమ్మరియాద కే నెటో
గుఱి యయి యుందుఁగాక జని కుత్సితమై చెడకుండ నీయిలా
ధరమున నున్న దేవునకు దాస్య మొనర్చుచు యావదాయువున్. ౮౫

వ. ఇట్లు చెక్కు చెదరని నిశ్చయంబునఁ దనక కాక విజ్ఞానులగు పెద్దల కుఁగూడఁ జిక్కనిరాజమార్గం బుపదేశించు పదంబునం దున్న కోమిరె కేమియుం బ్రతి చెప్ప నేరక "నాకు నీతోడిదె లోకం" బనియు, నీ వెక్కడ నున్న నేను నక్కడనే యుండుదాన" ననియు, "నన్నియుం దీరిన నా కేమి కావలయు" ననియుం జెప్పి మిన్నకుండెఁ బదంపడి సెట్టికొడుకులు తండ్రి నె ట్లేని బ్రతిమాలి యింటికిఁ దమవెంటం గొని పోవుటకై యత్నించియు నయ్యది వశపడక వ్యర్థమనోరథు లైరి.

క. కోమటివై రాగ్యము లో, భామయదూషితమె యయ్యె నయ్యది తుదకీ
ధీమహితురాలికతమున, శ్రీమహితంబై రహించి చెన్నెసలారెన్. ౪౭

వ. అట్లు పరిపక్వాంతఃకరణుండుగా మాఱిన యావృద్ధవైశ్యుండు కొమరు
లం గాంచి సాదరంబుగా నిట్లను. ౪౮

తే. అన్నలార ! మీయొనరుచునట్టి సత్కృ
తులకు లోభోపహతబుద్ధి నలిగి నేను
గృహము వీడి వచ్చితి నది కేవలమ్ము
తప్పిదమె యయ్యెఁ దుద కదే ధన్యుఁ జేసె. ౪౯

ఉ. ఈనృపుఁ డెంతయో పృధివి నేలియు నిస్పృహుఁ డయ్యె నీపె రో
మానిని యయ్యెఁ దా నెఱిఁగి మంచియుఁ జెడ్డయు, సాధువర్తనన్
బూనుట నాకు నౌజ్జతికముం బొనరించె, నితండు యోగియై
కానఁ జరించుఁగా కిపుడు, గాఁడు వికారి జమీనుదారుఁడే. ౫౦

చ. ధనమును లెక్క వెట్టుచును దానినె చూచుచు దానిమీఁదనే
మనమును నిల్పి దానిఁ గొఱమాలిన వడ్డికి నిచ్చి యక్కృతం
బున నొగిఁ "గోరుటుల్" చనుచు బుద్ధి నొకప్పుడుఁ బారమార్థికం
బునకు వ్యయింపకుండు ననుబోటులు నిక్కము దైవవంచితుల్. ౫౧

ఉ. ఏ నొనరింపకుండినను నే గణియించిన విత్తరాశి మీ
రేనియుఁ బాత్రులౌజనుల కిచ్చితి రిప్పటి కే నెఱింగితిన్
దానఁ దరించినట్టులుగ; ద్రవ్య మెవం డిడెనేని యెవ్వఁ డ
ద్దాని గడించు "వాని సుకృతంబు వరించు" నటంద్రు కోవిదుల్. ౫౨

తే. "ఆత్మయే పుత్రుఁడై పుట్టు" ననుచు వేద
మాడుటంజేసి మీచేసినట్టి సుకృత
కార్యములు నన్ను ధన్యునిగా నొనర్చె
నక్కతనఁ గావలయు మీర లైరి హితులు. ౫౩

ఉ. ఏ విఁక నింటియం దునికి కిచ్చఁ గొనన్ "భవబంధ" మన్న నా
మానస మొప్పకున్నయది మాధవుసేవ లభించెఁ జక్కఁగా
స్నానము సంధెయున్ జపము సాఁగుచు నున్నవి వార్ధకంబునం
దే నరుఁడేనిఁ గోరు నిదియే యిసుమంత వివేక ముండినన్. ౫౪

ఆ. "ఇంటనుండి కూడ నేజోలి యంటించు
కొనక వృద్ధు జరిపికొనఁగవచ్చు
జపతపమ్ము" లనుట సామాన్యవచనంబు
గాని వృద్ధమతముగాదు వినుఁడు. ౫౫

తే. ఎంత యంటించికొనక తా నింటఁ బద్మ
పత్రగతజలబిందువుపగిది నున్నఁ
"బానకమ్మునఁ బుల్లల" భంగి నెవియొ
అడ్డు దగిలి మనశ్శాంతి యంతరించు. ౫౬

చ. గృహమనఁ బెద్దనాటకము, గేహిని లోనగుపాత్రలం దెదో
తహాతహ; రిక్తులం దొకవిధంబు ధనాఢ్యులయందు నొండు గా
నహరహమున్ గనంబడెడి, నయ్యది లేని గృహ స్థొకండు ని
మ్మహి నగుపట్టఁ డెన్ని పయిమాటలు చెప్పిన నేమి లాభ మో. ౫౭

చ. కొడుకులఁ గూఁతులం గనియుఁ గొందఱు "లింగియు లింగ"ఁడన్న య
వ్విడువున నుండి కొందఱును వంతలకున్ గుఱి యౌటె కాని యె
వ్వఁడును గృహాన నుండి యనవద్యసుఖంబును గాంచనేరఁ, డొ
క్కఁడు నొకచో రహస్యముగఁ గాలము పుచ్చుటయే సుఖ మ్మగున్.

క. "ఉపచారమ్మనకై తన
దుపుత్రపౌత్రు లట నుందురు గావున వృ
ద్ధపురుషు లిలు వీడక యుం
ట పరమహిత" మందు రదియు నచ్చదు నాకున్ ౫౯

మ. ఉపచారం బొక రేల సేయవలె ? నాయుర్దాయ మున్నంతకున్
గృపతో దేవుఁడు తన్నుఁ గొల్చుజనులన్ వీక్షించి రక్షింపఁడే ?
యెపుడున్ "జెట్టులఁ జేమలన్" మనెడి ఆయీపక్షిజాలమ్ము లే
యుపచారమ్మున నెగ్గుచున్నవి ? పరుం డున్నాఁడు సర్వానకున్. ౬౦

ఉ. వానినె నమ్మఁగా వలయు వానిని నమ్మినవాని కెందు నె
ద్దానికతాన నేసిలుగు తారస మెన్నఁడు గాని కాదు క
ర్మానుగుణమ్ముగాఁ గలిగినప్పు డెవారినో చూపు దైవ, మ
ద్దానికి లోన జంకి గృహదాసులు వృద్ధులు గారు ధీనిధుల్. ౬౧

క. ధన మెంతటిపాపిష్ఠమొ ?
కనిపెట్టితి నిప్పు డేను ? గడియించుట త
ప్పనికూడఁ దోఁచె నిటు లి
ష్టనుచో వినువారు నగుదు రనియు నెఱుఁగుదున్. ౬౨

చ. ధనము గడించుమాత్రమున ధన్యత గల్గదు దానితోడ నే
గానములౌ చేరఁగావలయుఁ గొన్ని: అవేవియు లేక యొక్కటే
ధనమది యున్న మానవుఁడు తజ్ఞులనిందకు నగ్గమౌ ధనా
ర్జనమునకన్నఁ గష్ట మది సజ్జనసమ్మతిగా వ్యయించుటల్. ౬౩

గీ. ఆర్జనము కష్ట మార్జించినట్టిదాని
రక్షణము కష్ట మిద్ది నిద్రయును బట్ట
నీదు ద్రవ్యమ్ము గలవాని కెందు సుఖము
లేదు సుఖియంద్రు వానిని లేకిజనులు ౬౪

ఉ. "యూరపు" ఖండమం దిపుడు యుద్ధము రేఁగిన దెందుఁ దత్సమా
చారము లాలకించిన విచారము గల్గుచునున్న దల్లదే
వారులు రావణాదులును నాయుగమం దొనరింపలేని "కం
గా రిది" యంచు నెల్లరు నెగాదిగఁ జూచుచునుంట తెల్లమే. ౬౫

ఉ. దేవుఁడు జంపు మ్మా కితరదేశము లేము జయించినాము మా
కై వసుధాస్థలం బుదయమైనది యెల్లపు డేమ యేఱుచున్
గోవులవంటి ఘూప్రజలఁ గొట్టి "యుతెం గయు ంచిమి" మున్నవా
రీవిలయంబు నాఁగుటకు నేమియుఁ దోఁపకయున్నవా రహో. ౨౮

క. ఈయలజడిలో దుష్టులు, సేయంగారాని వెన్ని సేతులొ ? "జాగ్ర
త్తా" యని చెప్పఁగవలసెన్, నాయనబారాః వినుండు నాయనుభూతిన్.

క. చల్లని "బ్రిటి" ష్ప్రభుత్వం, బల్లయు లణఁచినది గాని యంతయుము పే
యిల్లాలు నగలు దాలిచి, యిల్లు విడిచి వీధి కేగి యింటికి వచ్చెన్.

మ. 'ఇదిగో ? వచ్చుచున్నవార' మని ము న్నేవానినో పంపె ది
ర్మదు లేకొందఱొ గుంపుగూడి యదలింపన్ దివ్వె చేకుంటచే
సదనంబుల్ సధనంబు లేగి ధనికున్ జాఁగొట్టి 'ద్రవ్యంబు చూ
పెదవా ? లే దనెదా?' యటం చుఱుముటల్ భీ గొల్పు దాపోటచే

ఉ. తైలము క్రాఁగఁబెట్టి గృహి తా బెగడందఁగ నీతయూరు లా
తైలమునందు ముంచి 'యెట దాఁచితి బంగరు వెండి' యంచు నా
తైలము చిల్కరించెడి సుదారుణపుంగత లెన్నొ వింటి నే
బాలుఁడనైన కాలమునఁ బ్రస్తుత మయ్యవి జ్ఞప్తి గొల్పెడిన్. ౩౦

ఉ. జగ్గయపేటలోన నొకసాధుశిఖామణి యుక్తి చేసి తా
నెగ్గడియన్ వినెన్ 'జరుగు విట్టివిప' త్తని, యుప్పె యిల్లు స
మ్యగ్గతి పెండ్లియింటివలె నంటఁ జంపము గొప్పఁ జేసి దే
లొగ్గుచు వాంఛరాక కయి యూరక చేసునసుంచె పీడిలో. ౩౧

వ. అంతం గొంత సేపటికి. ౩౨

సీ. భూనభోంతరములు బూరటిల్లఁగ మ్రోఁగు
పటపటధ్వనుల తప్పెటలతోడ
చెవులు 'గింగురు' మని చీకాకు గల్పించు
నారవం బెసఁగు కాహళలతోడ

‘తళతళత్తళ’ మెఱుంగుల భీతి గల్గించు
కత్తు లొప్పారు ముష్కరులతోడ
ఆకంఠముగఁ ద్రాఁగి యట్టిట్టు దూఁగాడి
పడుచు లేచుచు వచ్చు జడులతోడ
గీ. కవిలగడ్డాల రోహిలా గణముతోడ
బందిపోటు దొంగలగుంపు పట్టపగలె
“బాదుబాదు” మటంచు నిర్భయముగాఁ బు
రంబునఁ బ్రవేశ మొనరించె రాజవీధి. ౬౩

వ. అమ్మహావిప్లవంబున. ౬౪

సీ. వీధిగుమ్మపుఁదల్పు వేసి ప్రాణభయాన
దొడ్డిగుమ్మపుఁద్రోవఁ దొలఁగువారు
వెండిబంగారమ్ము లందనుండెడి తీవ
పొదలలోఁ బడవైచి పోవువారు
‘ప్రాణ ముండినయేని బలుసాకు తినవచ్చు’
నని కట్టుగుడ్డతో నరుగువారు
అట్టిట్టుఁ జనఁ గాక లాడక యింటనే
పెణకల మిద్దెల నణఁగువారు.
గీ. ఇంటఁ జొరఁబడు దొంగల కెఱఁగువారు
“ఇల్లు మీయది” యని చెప్పి యేఁగువారు
గాఁగ నిటు లేమి చెప్పఁగాఁ గలదు పౌరు
లల్లకల్లోల మగు గతి నడలు గనిరి. ౬౫

వ. అట్టి బెట్టిదంబగు సంకటమ్మున నవ్వణిక్ఛిఖామణి ధైర్యం బవలంబించి పత్నీసహితుండై పూలమాలికలతో నెదురేగి యందలి ప్రధాననాయకుల నలంకరించి నమస్కరించి ‘మీరు మా కతిథులు మీ రాక మాకు శుభావహంబు మిమ్ముఁ బూజించువా రిప్పురంబున నెందఱో గేస్తులున్నను బ్ర

ప్రథమమ్ముగా మమ్ముఁ గరుణించి మాగృహమ్మున కేతెంచి మాయి చ్చుభోజనభాజనాదిసత్కారంబు గైకొని గాని మఱియొకచోటికిం జన కుండ పరమ్ము దయసేయవలయు' నని కాళ్లం బడి ప్రార్థించుటయు నియ్యది భావికి శుభసూచకం బనుకొను టయుఁ బండ నాతనికి నేమియుం బ్రతి చెప్ప నోరు రాక యాఘోరశిఖామణు లాషాహుకారునిఁ బట నడుగి డినదే తడవుగా స్నానంబునకు నీళ్లందిచ్చువారును మడిచీరో రుమా ళ్లం దెచ్చి యిచ్చువారును గూర్చుండుటకు నాసనమ్ము లమర్చువారును వెండిచెంబులతోఁ బానీయమ్ము లందిచ్చువారును బంగరుటాకులలోఁ బంచభక్ష్యపరమాన్నంబులు వడ్డించువారును బక్వాన్నంబులు మరల మరలఁ దఱిమి తఱిమి 'వలదు వల' దనుచున్నను బడవైచి పోవువా రునునై యాతండు సిద్ధపఱచిన నౌకరు లలమొక్కలుల నలరించి కు క్కలకన్న నెక్కుడు మొగమోటమ్మున కిక్కలం బొనర్చిరి. ఇవ్విధం బున విందు గుడిచి చేతులు గడిగికొనుటయే తడవుగా హుక్కాగొట్ట మ్ము లాయత్తపఱచి తాంబూలంపుఁ బళ్లెరమ్ముల నమర్చి యంతం దనివి సనక యగ్గడుసరిపర్తకుం డాగ్రామమ్మునఁ బేరందిన వేశ్యల మేళంబులంగూడ గొన్నిటి నంతకు మున్న సిద్ధపఱచి యుంచుటయు.

ఉ. అక్కడి కేగుదెంచి వెలయాండ్రు 'తకత్తిక థోంకిణాం తక
త్తక్క ఝణాం తళాంగు తెయితక్క సరీగరి' యంచు నాట్యపుం
దెక్కులతోడఁ జోరులఁ గడించి ముదంబున నోల లార్చి రా
ఫక్కి యెటుండెనో ? తెలిసి వాకొనఁగా వశ మేరి కయ్యెడిన్. ౭౭

ఉ. ఆడెడిసానితోఁ గలిసి యాడఁ దొడంగెడివారు వెంబడిన్
బాడెడిసానితోఁ గలసి పాడఁదొడంగెడివారు నొచు న
చ్చేడియలందుఁ దాము నొకచేడియలై కయిపెక్కి యాఖలుల్
గాడిదగత్తరన్ సలుపఁ గళ్మల మయ్యె సభాస్థలం బటన్. ౭౮

సీ. 'మొగ్గేసి నాల్కతోఁ బుచ్చుకొ' మ్మని మేల్మి
'మొహిరీ' యచటఁ బెట్టి మఱియు నొకఁడు
'కనుఱెప్పతోఁ దీయఁగావలె నిది' యంచుఁ
బిల్లకా సటఁ బెట్టి పిల్చు నొకఁడు
తనమెడ నున్న ముత్యాలహారము దీసి
సానిపై హేల విసరు నొకండు
తాఁ బీల్చు 'గుడ్గుడీ' దానిదగ్గఱఁ బెట్టి
తనబాసతోఁ 'బీల్చు' మను నొకండు
గీ. మ్రొగ్గతిలఁబడి సానికి మ్రొక్కు నొకఁడు
చుబుకమున్ ముట్టి బ్రీతిమాలఁ జూచు నొకఁడు
లావుమెయి వాని వెనుకకు లాగు నొకఁడు
తప్పనుచు వారలకు నీతిఁ జెప్పు నొకఁడు. ౭౯

వ. అది గాంచి యాసాధుశిఖామణి తనయెత్తిన యెత్తు సఫలప్రాయంబ
యని తలంచి యంతరంగంబున నుప్పొంగుచు. ౮౦

మ. తనయావత్తు ధనంబు చూపి "యిది మీధామంబు, సర్వంబు గై
కొనుఁ డే మాజ్ఞ యొసంగఁ బోయెదము మీకోసంబె యిందాఁక నుం
డిన దే మిక్కడ" నంచు నమ్రుఁడయి వా ర్నిశ్చేష్టులై చూడఁ బ
ల్కిన వాం ద్రేమియు నందుఁ గైకొనక మేల్మిన్ బల్కి రం టీగతిన్.
మ. "చెలియల్ నీసతి మాకు, బావవు భవత్క్షేమంబు మే మెంతు మీ
యిల మా కెన్ని గృహమ్ము లున్నయవి మిమ్మే మేల బాధింపఁగా
వలెఁ? మీరల్ సుఖ ముండు" డం చరిగి యాత్రాత్ముల్ పురంబం దెదో
కలవానిన్ బురుడించుగేస్తునిలు వీఁకన్ దోఁచి రాకాంక్షతో. ౮౧

వ. ఇయ్యది నాచిన్ననాఁడు విన్న బందిపోటు దొంగలకతలలో నొక్కటి
మఱియు నింకను నిట్టి వెన్నియో గలవు. ఇయ్యవి యథార్థంబు లయ్యె
నిటీవల నిట్టిదుండగంబులు లేకుండఁ బరిపాలకులు జాగ్రత్త వుచ్చుకొ

సుటచే ననుభవింపమిఁ బుక్కిటి పురాణమ్ములుగా నిప్పటివారు ఘోషింతురు. ఇట్టి బందిపోటుదొంగలే తుదకు జేంష్లుగాఁ బరిణమించుటయుఁ గలదని యైతిహాసికులు వక్కాణింతురు. కొందఱు జమీనుదారులు కొందఱు దొంగలకుఁ గొంత పన్నేర్పఱచి తమరాజ్యంబులోఁ గొంత ప్రదేశము నిర్దేశించి యందు దొంగతికమ్మున కభ్యనుజ్ఞ నిచ్చుటయుఁ గొప్ప చిత్రముగా నిన్నమొన్నటిదాఁక నుండెడిది. కొందఱు మొఖాసాదార్లు తమయూళ్ళవాపున జరిగెడిదొంగలను బట్టికొని శిక్షించియు వాండ్రు సేకరించిన ధనము ధనస్వాముల కిచ్చుటమాత్రము లేదుగాని తాము కైకొని యనుభవింతురని వినికి. కొందఱు జమీనుదార్లు దొంగలవలనఁ గొన్నధనమ్మును బండితసత్కారమ్మునకు వినియోగింతురు గాని తమఖజానాకుఁ జేర్పరఁట—"నిక్కమ్ముగ నొక్కనిం గొలుచుకన్నను దొంగతికమ్మె తక్కువే" అను శార్వలిక నీతిం బురస్కరించుకొని కొందఱభిమానవంతు లీబందిపోటుదొంగతనము వృత్తిగా నవలంబించియు "మద్యపానమ్మునకు మడుగు గట్టికొన్నచందంబునఁ గొంత వేషంబుగాఁ బ్రవర్తించుటయుఁ గలదు. వీరిలో నెందఱో దేవబ్రాహ్మణభక్తిపరాయణు లున్నట్లు వినఁబడెడి శ్రీభద్రాద్రిరామునియెడఁ బరమభక్తుండైన కొండనిచరిత్రంబు సుప్రసిద్ధంబు. స్వామికి వీఁ డెన్నిసార్లు ముడుపులు చెల్లించెనో? ఆస్వామికే యెఱుక. వీనియనుచరు లొకబ్రాహ్మణునివిత్తము దోఁచికొని తెచ్చి తనకు నివేదించినప్పు డయ్యది బ్రాహ్మణద్రవ్యంబని వాండ్ర మాటలవలన విస్పష్టం బగుటయు నతండు—"న విషం విష మిత్యాహు ర్విప్రస్వం విష ముచ్యతే" అనునభియుక్తోక్తి నెఱింగినవాఁడగుటం జేసి రోసికొని వైశమ తనయనుచరుల నాయయ్యవారిని వెదక నంపి తనకడకుఁ గొనివచ్చిన యయ్యవారివెఱపుడిపి వినయమ్మున సాష్టాంగదండప్రణామం బాచరించి యుచితవిధానంబున నతిథిసత్కారం బొనరించి. ఛా౩.

క. అయ్యా ? మీరలు 'బాపన
దయ్యము' లని యెఱుఁగ కురక దారి నడచు మి
మ్మొయ్య నడిచి మాయాచెడు
కొయ్యలు దయమాలి ధనముఁ గొని రవినయులై. ౧౪

క. దొంగతనం బనినంతన
వెంగలులై పాపపుణ్యవిధ మెఱుఁగక ముం
దుం గనకచేయఁదగునే ?
కంగా రిది మీరు సైఁచి కావఁగ వలయున్. ౧౫

క. ఇప్పుడు జమీనుదార్లై, గొప్పగ వర్తించువారి కూటస్థులు ము
న్నెప్పుడొ దొంగతనం బీ, చొప్పునఁ జేసి రని యెఱుఁగు సూరివరేణ్యా.

వ. మాయాయనుచరులతో నే నప్పు డప్పుడు చెప్పుచునే యుందును, మీ రెన్నఁడేని బ్రాహ్మణులం దోచికోవలసివచ్చునెడల వార లుద్యోగజీవనులైనం దప్పఁ దక్కఁగలభిక్షాటకులజోలికిం బోవలవదనియు నుద్యోగులనేని లంచగొండులని మీయంతరాత్మ బోధించినందప్పఁ గేవలవేషమాత్రంబున నపరాధులుగా భావించి తస్కరింపవల దనియుఁ జెప్పినను నప్పుడప్పు డిట్టిప్రమాదంబులు తటస్థింపక మాన వని వెండియు. ౧౬

ఉ. దొంగతనంబు సేయు టది దోసము కాదని చెప్పఁ గాని యెం
దుం గలలంచగొండులను దూఁచిన దొంగలతోడ, దొంగలే
ముంగలిసద్గతిన్ గుఱిచి మ్రొగ్గెద రించుక, ముందు దొంగల
య్యుం గడుధర్మవర్తులకు యోగము మాఱి జమీను లబ్బెడిన్. ౧౭

వ. అట్లు జమీనుదారులై పదంపడి యెన్నియో సుకృతంబు లొనరించి పూర్వకృతంబులగు దుష్కృతంబు లపనయించి సద్గతిం బొందినవారుఁగూడఁ గలరుగాని లంచగొండులుమాత్ర మిహపరంబులు రెంటికింగాక చెడుటయే కనుపట్టెడి నని వెండియు ౧౮

క. లచ్చలకొలఁది గడించిన, యచ్చతురులు లంచగొండ్లయన్వయజాతుల్
బిచ్చం బెత్తుటయే కన, వచ్చెడి నల ద్రవ్య మెంతపాపిష్ఠంబో ? ౯౯

వ. అది యటులుండె మీరు మీకొమార్తె పెండ్లికొఱకై పట్టణంబులందలి దాతలనుండి యాచించి సంపాదించిన ధనం బియ్యదియని యనుచరుల వలన నాకుం దెలియవచ్చినది కావున నేనుగూడఁ గొండొక సాయం బొనరింప నెంచితి నని కొంత కనకంబును నూతనవస్త్రద్వయంబును దాంబూలసమేతంబుగా వెండిపళ్ళెరమ్మున నునిచి. ౧౦౦

క. ఇది నాచేసెడిసాయం,బదిగో ? మీ కితరు లిచ్చినట్టిది కై కొం [న్నన్
డెద ముద మందిన నాశీ, స్సది దయచేయుండు 'కొండఁ' డందురు న ౧౦౧

వ. అని యవ్విప్రోత్తముం బూజించి సంతుష్టుం గావించి యాయనదీవన నంది మధ్యేమార్గమ్మున మరల నిట్టిప్రమాదం బితరతస్కరులకతన జరుగకుండ ననుచరులం దోడొసంగి సాఁగ నంపె నని చెప్పికొందు రది యటులుండె. ౧౦౨

గీ. గోఁచిపాతరాయలకు నేగోడు నుండ
దల్లవారు దొంగలమిండలై సుఖింత్రు
మిమ్ముబోట్లకె చిక్కటుల్ మెలఁగెదరొ ? దు
రంతము లనేకముల్ జగమందు జరుగు. ౧౦౩

వ. మెలఁకువ గలిగి మనుండని దీవించి కొమరులం బంపి యతం డక్కడన యుండె. వేశ్యతల్లియు నిఁకఁ దనకూఁతురు తనకు వశవర్తిని గాదని తెలిసికొని గర్భవాసప్రేమంబు చననీయనికతమునఁ గొన్నినాళ్లుండి పదపడి యింటికిం జనియె. ౧౦౪

ఆ. విప్రమౌనిజాడ విని సుతుల్ చనుదెంచి
తండ్రిఁ గాంచి మది ముదమున నించి
అతనియడుగులందు నాననం బానించి
పేర్మి మ్రొక్కి యనిరి వినయ మెసఁగ. ౧౦౫

ఉ. అమ్మలు నీకునై గృహమునందుఁ దపించి కృశింప నీదు నే
మమ్ము నెఱుంగరామి నొగి నున్నటు నేమును వాండ్రు నెంతయో
యమ్మలికంబునం బొగుల యోగ్యత నీ జనియింపనేల ? స
ర్వమ్మును నున్న నీ కిది చరంబు పరంబుగఁ దోఁచు టెట్టిదో ! ౯౬

చ. ఎది యెటు చక్కఁబెట్టుదుమొ ? యించుకయున్ దెలియంగలేని మ
మ్ముదవసితమ్ము నన్ విడిచి యోగిగ నొంటిఁ జనంపనేల ? నీ
యెదను విరక్తి గల్గుటను నే మొనరించిన దోసమేమి యు
న్నది ? యది యుండెనేఁడు ఇది న్యాయము మిన్నక నోసగింతురే.

వ. అని బహుభంగుల నంగలార్చు నంగనాలంగని సుప్రసన్నముఖుం
డలయోగి యిట్లనియె. ౯౭

ఉ. చిన్నలు మీరు, మీకు నది చెప్పిన నెక్కదు, నే విరాగమున్
గొన్నకతంబు మీయెడలఁ గోపము గల్గుటఁ జేసి కాదు సం
పన్నత యెంత గల్గినను మానవుఁ డెయ్యది "నిక్క" మంచు రా
నున్న భవానకుం దగినయోగ్యతఁ జూడక యుంట జాడ్యమౌ. ౯౮

సీ. "చుట్టాలు దొంగలు సుతులు ఋణస్థులు
కాంతలు సంసారకారణమ్ము"
లనుచు "బమ్మెర" కవి యనుపదంబునకుఁ గై
నెఱిఁగిన మానవుం డెపుడు గాని
తన కెంతధనమున్నఁ దన్వంగు లెందఱు
న్నను బుత్త్రులెందఱున్నను మఱెంత
నితరసంపద లెన్ని యెట్టివెట్టివి యున్న
నివి పరంబున కించుకేని సాయ

గీ. మీయఁ జాలవు కావునఁ గాయమున జ
వంబు సత్త్వమ్ము నుడుగని వయసునందె

శక్తి కోల్పడి దద్యత్నము సలుపుటొప్పు
"నిల్లు గాలఁగ నుయి ద్రవ్వి యేమి ఫలము ?" ౧౦౦

ఉ. మానవజన్మముం గనియు మంచియుఁ జెడ్డ యెఱింగియున్ హరి
ధ్యానపరుండు గా కెపుడు 'నా'లని 'బిడ్డ' లటంచు భ్రాంతి లో
నూని చరించు దీనుని దయోమయజీవిత, మింపు కెవ్వరున్
జ్ఞానులు సమ్మతింపరు గనందగు ముందటి త్రోవ కోవిదుల్. ౧౦౧

ఉ. నాలుగు చూపినారు మునినాయకు లాశ్రమముల్ గృహస్థుఁడై
యాలికి లోఁగి బిడ్డలకు నట్టులె వార్ధకమందు లోఁగి యు
క్కాలుని ప్రోలికిన్ జనెడికాలమునందును చింత సేయని
బ్బాలిశుజన్మ మేమిటికిఁ బాండితి యేటికిఁ బల్కి యేటికిన్. ౧౦౨

గీ. తెలివి యేమాత్ర మున్నను ధీరవరులు
చూపు నాల్గాశ్రమమ్ములఁ జొచ్చి భవము
సఫల మొనరించికొనవలె జగదధీశు
నెఱుఁగని మనుష్యజన్మమ్ము నెత్తనేల ? ౧౦౩

క. ఎందున్ జననీయక తన, యందున్ బంధించుటన్ గృహం బందురు వా
నం దవులుట బంధనగృహ, మందుంటయె భవ మిందుది యనం గాదే ?

వ. విరక్తి గల్గినవారికి రుచించు నీమాటలు నీటోటియును నాలకు రుచింపవు
రుచింపనక్కఱయును లేదు పరిసక్తి గతమ రుచింపనిచో నాని మనసుకక్క
అయును లేదు. అది యెటులుండె. ౧౦౪

ఉ. ఆలివిరోధమో ? సుతులయాగ్రహమో ? ఘటియించి యుంటిరే
బాళి నశించి పీడి చనుహారలు నుండుదుగాక నేను నా
మేలును గోరి యిట్లయితి మీకు శుభం బగుఁగాక, యింటిజం
బాలములో దిగంబడెడిహాంఛ జనింపదు నాకు నీపయిన్. ౧౦౫

క. నాయార్జన మీకు సుఖ, శ్రీ యొదఁగూర్చినను మంచిచెడ్డ లరయ కె
ట్లో యుంటకుఁ గార్దణమ్మె, వేయాఱువిదాల మదికి వేఁడుకు గొలుపున్.

క. ధనవంతుసుతులకన్నను, ధనహీనునిసుతుల జీవితమ్ములయందే
గొనములుమంచివి కనుపడు, ననుపెద్దలపలుకు తెలియుఁడాత్మజులారా ?
వ. ధనికులకొమరులకన్న రిక్తులకొమరులె సుప్రయోజకులై కుల ముద్ధరింతు రని వెండియు. ౧౦౯

క. ఆగర్భశ్రీమంతులు, గాఁగ జనించితిరి మీరు కష్టసుఖంబుల్
బాగోగు లెఱియ నెఱుఁగరు, శ్రీగలుగుటకున్ ఫలంబు చెప్పెద వినుఁడీ.

చ. కలిగినకొంపకున్ దలచుగా సతిథుల్ జనుదెంచుచుందు ర
వ్వేలఁ బను లెన్ని యున్న నలవారల నెవ్వరి నెట్లు చూడఁగా
వలయునో ? అట్లు చూడఁదగు వాండ్ర నియుక్తులుగా నొనర్చుటే
కలిమికి భూషణం, బురక కట్టుట మెక్కుట కల్మిచిహ్నమే ? ౧౧౦

ఆ. ఇంటిడాబు చూచి యేతెంత్రు బిచ్చగాం
డ్రవలఁ బొమ్మటంచు ననుటకంటె
నింతో యంతో పెట్టుటే సుఖం బగుఁ బెట్ట
కున్న వాండ్రు తిట్ట కురక చనరు. ౧౧౧

క. బిచ్చమ్మున కన్నానకు, నెచ్చట 'నిది పాత్ర' మనియు 'నిది కా'దని సం
విచ్చయిలు చూడ రధికం, బిచ్చెడిచోఁ జేయవలయు నీదృశచర్చన్.

ఆ. "ఈవు తగుదు" వంచు నీవు "తగ" వటంచు
బిచ్చగాండ్రతోడఁ బెద్దరగడఁ
బెట్టికొనుటకన్నఁ బెట్టి పంపించుటే
పరమసుఖ మటంచు నెఱుఁగు టొప్పు. ౧౧౪

గీ. ఎవరికొఱకు భిక్షాటన మేరుపడెనో ?
వా రొకరుఁగూడ దానికై వచ్చుచున్న
యట్లు కనుపట్టి దితరులే యందుల కల
వాటు పడిరింతవట్టును వాస్తవంబు. ౧౧౫

వ. ఇంతకు మున్ను చెప్పినదే యయ్యు బిచ్చగాండ్రం గుఱించి మఱియును గొండొక వచించెద నాలింపుఁడు. ౧౨౩

మ. ప్రతివాఁడుఁ జనుదెంచు "ముష్టి" కని దుష్పాత్రంబు లందెన్నియో వెతకన్ గన్పడుచుండు, గేస్తుల వృథా వేధించునివ్వాండ్రదు ర్గతి శోచ్యం బగుఁగాక, పెట్టుటయె యుక్తం బేరొ లేదన్న న ప్పతితు ల్లోఁగనియప్పు మానుటకు లాభమ్మేమి గన్పట్టెడిన్. ౧౨౪

ఉ. "ఏదొ పురాకృతంబుననె యీచెడుకర్మము వాండ్ర కబ్బె" నం చాదృతి లేకయుండినను నంతయె! యింతయె? పెట్టి పంపుటే నాదుమతంబు వాండ్రు జననాథునిశిక్షకుఁగూడ లోఁగ, రం చేఁ దలపోసి చెప్పితి గ్రహింపుఁడు నాయనలార? నానుడిన్. ౧౨౫

ఉ. "పెట్టినవారికిన్ మరలఁ బెంపుగఁ బుట్టుఁటె సాక్షి" యండ్రు వాం డ్రెట్టిరొ? స్వల్ప మిచ్చుటకు నెందుకుఁ జర్చలు. తారతమ్యమున్ బట్టి యొసంగునీవికి నపాత్రపుటీవికి భేద ముండుఁగా కట్టిది గోరుముష్టియెడ నారయఁబోరు వివేకు లెవ్వరున్. ౧౨౬

గీ. ఇప్పు డెల్లవర్ణంబులు నిందు దిగియె
భవతు మాన్పింప వాండ్ర నెవ్వరితరంబు
"ఎలుఁగుబంటితంటన" మనియెడి విధాన
నుండు నిట్టి పరీక్ష కే రుత్సహింత్రు. ౧౨౭

ఉ. నిక్కము నెంచి చూత మన నేఁ డొకవిప్రుఁడు మ్రొక్క నర్హుఁ డే దిక్కునఁ గానరాఁ డిదియు దేశపుదుర్గతి గాక యేమి? యిం కొక్కటి, తక్కుజాతులకె యున్నది బ్రాహ్మణవిద్యలందుఁ బే రెక్కినశ్రద్ధ; బ్రాహ్మణుల కెచ్చుచునున్న దనాస్థ వానిపై. ౧౨౮

క. కొందఱు బ్రాహ్మణశబ్దం, బెందుకు వచ్చినదిమన 'కరే?' యనిచింతన్
గుందెడి మనుజులును మన్నా, రందురుగా కట్టివారి నొగిఁ జేర్పకుఁడీ.

క. దేవబ్రాహ్మణభక్తి ము, దావహమగు నామమాత్రులగు బ్రాహ్మణులన్
సేవింపకున్న వృథగా, నేవిధమున వెక్కిరింపు టెంతయు ముప్పౌ.

గీ. మనకు నైశ్వర్యమున్నది యని సదాచ
రణము విడనాడకుం డపరాధ మెపుడు
స్నానసంధ్యాజపములను మానరాదు
మనుఁడు బ్రాహ్మణ్యమున కిది మంచితెలుపు. ౧౩౧

వ. అని మఱియును ౧౩౨

మ. ఎపుడో బుద్ధికిఁ దోఁచెనేని మిము నే నీక్షింప నేతెంతు, మీ
రిపుడున్ బోలె మఱెప్పుడేనియును రానే వచ్చు, సన్న్యాసి గా
నిపు డే. నిద్ది తృతీయమాశ్రమము మీ రేగుండు శ్రీనాథుఁ డెఁ
ల్లపుడున్ మీకు సుబుద్ధి నిచ్చి వరదుండై మిమ్ముఁ గాపాడుతన్.

వ. అట్లు కొమరుల నంపి యాతం డచ్చటన సుఖం బుండె. ౧౩౪

గీ. రాచతపసియందున ననురక్తి గల్గు
వారు పెక్కురు గల్గియు నేరుగాని
పిలుచుటకు రారు రాజేంద్రుతలఁపు మున్న
వారు పూర్ణమ్ముగ నెఱుంగువారు గాన. ౧౩౫

క. మూఁగురు మూర్తులు నాపె వి
రాగం బంగమ్ముఁ దాల్చరాణ నచట వి
ద్యాగోష్ఠియు భగవత్సే
వాగోష్ఠియుఁ గలిగి యెలమి వసియించునెడన్, ౧౩౬

గీ. బ్రహ్మబంధువుల్ గొంద ఱివ్వారిపయి న
కారణద్వేష మూని యక్కాలికిగొనము
"మంచిదై యండ" దంచు లో నెంచి యాస
డించుమాటలకు నుపక్రమించుటయును. ౧౩౭

గీ. వేశ్య లగు బ్రాహ్మణులు సుదుర్వృత్తు లైన
వారలను మందలించి "యెవ్వారుగాని
వ్యర్థమగు నపవాదలు పైవరాదు
వేశ్యయైన నేమయ్యె! సద్వృత్త యాపె. ౧౩౯

క. ఆపెకుఁ గలయోగ్యతలో, నేపాటియు లేని మీర లెంతులకో? యీ
పాపపుఁబల్కులు వల్కుట, శాపానుగ్రహసమర్థ జాగ్రత్తసుఁడీ!

గీ. నామమాత్రమ్మునకు బ్రాహ్మణజని నెత్తి
యితర మేమియు లేని మీవృత్త మేడ?
ఆపెసద్వృత్త మేడ? మీయంతఁజనుఁడు
వృథగ నాజ్ఞించికొనకుఁడు వృజినభరము. ౧౪౦

వ. ఏవిధమగు మంచియును లేని మీవంటిసత్రభుక్కులకతమున బ్రాహ్మణజా
తికిం గలుగుకళంకం బింతింత యన నలవిగా దని మఱియును. ౧౪౧

ఉ. ఈదృశదుర్గతిం గనియు నేయితరాన్వయులేని యోగ్యతా
పాదకమైన వర్తనను వర్తిలఁ జూచి సహింపలేక దు
ర్వాదులు గట్టునట్టి యపరాధము లంతటఁ బోవు జాతిమ
ర్యాదకు హాని దెచ్చు నపరాధకు లీరు క్షమాసహార్హులే? ౧౪౨

ఆ. ఒకరి "జోలి సొంటి" యొక్కింతయు లేమి
భగవదర్పితముగ బ్రదుకు సర్వ
మావెలంది గడపు నార్యసమ్మతముగా
నెంచు దాపెఁ దెగడ నెంతు రీరు. ౧౪౩

వ. ఇట్లు గాఢమ్ముగా మందలింప సమ్మూర్ఖు లుపశమించిరి పదంపడి.

ఉ. పేరును బెంపునుం గలుగుపెద్దకుటుంబమునందుఁ బుట్టి యా
వారవధూమతల్లి కులవైఖరి పూర్తిగ వీడి యెట్టి సం
సారులు మెచ్చుకోఁ దగినచందము నంది రహింప సంఘసం
స్కారులు తత్కులస్థులు వెసన్ జనుదెంచి వచించి రొక్కెడన్.

క. మనకుల మెప్పుడు పుట్టెనో ?
మనమా యటులుండ నితరమహనీయులు గూ
డ నెఱుంగ, రిది యనాదిగ
వినఁబడెడిఁ బురాణములను విశ్రుత మగుచున్. ౧౪౬

ఉ. ఎందఱు దేవతల్ చనిరొ ? యెన్ని ప్రభుత్వము లేగెనో ? జగం
బందు, మఱెన్నఁడుం గలుగనట్టివి మార్పులు నేఁడు పుట్టె యుం
దం దొకవిప్రులన్ విడిచి యుందఱుఁ దొంగిలి పెట్టుచున్న పే
మందువు తల్లి ? యాత్మకులమందలిచెట్ట లదించుపట్టునన్. ౧౪౭

మ. కవయిత్రుల్ ఘనగాయనీమణులు భూకాంతాప్రదేశాంబుధుల్
అవనీపాలురఁ గన్నయమ్మలఁ గులం బందెందఱో యుండియున్
శివ ! యేమందుము తల్లి ? పూరుషు లటుల్ శీర్షంబు పై బెట్టుగా
రవము నొప్పించినయట్లు లేమికి విచారం బేరికిన్ గల్గదే ? ౧౪౮

సీ. "విజయవిలాస" కవిప్రవరుం డల్ల
చేమకూ, రెవఁడు ? రోచామకొడుకు
"రాధికాసాంత్వనం" బేధీమతి రచించె
ముద్దుపళని మనముద్దురాలె
"పంచరత్నము" లను పదిసర్గములు చేసె
'పడివే' లెవఁడు ? మనవాఁడు గాఁడె
వీణలో నాటకవిత్వమ్ములో మేటి
'మధురవాణి' యు మనమనుప గాదె ?

గీ. కొలఁదికాలముకిందటఁ గుతల మేలెఁ
జక్రవర్తిత్వమున నొకక్షత్రియుండు
జనని యతనికి మనజాతిసాని కాదె ?
ఇట్టి మనజాతి యిప్పుడు హీన మయ్యె. ౧౪౯

చ. భరతుఁ డెవండు ? వ్యాసభగవంతుసుతుండు శుకుం డెవండు ? ము
న్నరున కులూచి తాఁ గనె జనుఁ శుతుఁ డాతఁ డెవండు ? ధారుణీ
సురులకు వంశకర్తలగు శుద్ధులలోఁ బలుమంది మౌను లె
వ్వరు ? ప్రకృతంబు వారె మనవంగడమున్ వచియింత్రు పందగన్.

గీ. ఇతరఖండంబులందున హెచ్చుగ వ్యభి
చార మున్న దీనికె నొకజాతి యన్న
యేరుపాటు లేదఁట ? మన మిందు కేరు
పడుకతన దూష్యుల మటంత్రు పలువు రిపుడు. ౧౫౦

ఆ. ఆర్యు లింతదనుక నాదరింతురుగాక !
స్వార్థపరత వారియందుఁ గలిగి
"ఆదరింపఁజేసె" నని యంద్రు నిజమగుఁ
గా, కసత్యమగును గాక యదియు. ౧౫౨

ఉ. పెండిలి లేక యెల్లరకుఁ బెండ్లము గాఁదగు శోచ్యవృత్తిలో,
నుండెడి స్త్రీలసోదరుల కుత్తమసభ్యత గల్గకుంటచే
బెండుతనాననే మనదు పెద్దలు కాలము వెళ్లఁబుచ్చి రె
వ్వండు యతింపఁ డీపరిభవం బుడిగింపఁగ నేయుగంబునన్. ౧౫౩

చ. "కులమున కుండువృత్తి యది కూడినదైనను గానిదైన వ
క్కుల మది యెన్నఁడున్ విడువఁగూడ" దటంచు ఋషు ల్లిఖింప రా,
జుల కవి శాసనంబు లగుచున్ జగ మేలఁగఁ జేసెఁ బిమ్మటన్
గలి చనుదెంచెఁ గాని కనుగందవ యాఋషులాడునేమముల్. ౧౫౪

చ. క్రమముగ నిన్న నేఁ డితరఖండజనుల్ నృపులైరి వారిమా
ర్గములకు నీఋషీశ్వరులు గారు ప్రమాణ "మొకూరిదాజచం
దర్శిముఁడు మఱొక్కయూరి కగుఁ దా నొకమాలగ" వారి కన్నివ
ర్ణము లొకమాత్రివే యగుట నచ్చకిపోయెఁ గులప్రభేదముల్. ౧౫౫

పుల్లసిలంగ నొగషము లొందిరి వారల కాత్మవృత్తిపై
నెల్లిదమున్ జనించుటకు నెవ్వడు సమ్మతి చూపకుండునే ? ౧౬౨

క. మే మంతగ ‘దద్విద్యా శ్రీమహితుల’ మంచు నీకుఁ జెప్పము మనలో
నీనంతయు నుద్యోగులు, సామంతులుగూడఁ గలరు సంస్కారేచ్ఛన్.

గీ. వారిలో వా రిత్త్వివాహసంబంధములను
జేసికొందురు కులమును జిందనాడ
రంపమును వృత్తి మానుచో నదియుఁ గష్ట
మనుచు వాదు నెఱుంగుదు రది యటుండె. ౧౬౪

ఉ. ఏ మొకకొంతమంచి కులవృత్తిని జూర్తిగ రూపుమాపఁగా
మామదిలోఁ దలంచి కులమాతలనెల్లరఁ జేరి కొందఱన్
సామముచేతఁ గొందఱను జంకును గొల్పుటచేత నెట్టులో
యీమతమున్ గ్రహించునటు లించుక చేసితి మెట్టకేలకున్. ౧౬౫

క. మడిమాన్యము లెన్నెన్నో గడియించిరి దీన నుండి గానకళన్ బే
ర్వడసిరి వారల కిది యిప్పుడు వీడుట చాలఁ గష్టముగనే యుండున్.

క. ‘ఇది మంచిత్రోవనే’ యన్ని, మది కెక్కియుఁగూడ వృద్ధమాతలు దీనం
బొదలుటకు నొప్పికొన ‘రే, మిది’ యనఁ బ్రతి చెప్ప రెట్లు కృషి యిది

ఉ. నెగ్గిన నెగ్గతున్నను ‘మనీషిహితం’ బని యెంచి మేము కే [నెగ్గున్.
లొగ్గి కులంపుఁబెద్దలకు, నోపికమైఁ గృషి సల్పుచుంటి మే
యెగ్గును లేని వృత్తు లని యెక్కడ నుండక పోవుఁగా కయో!
‘బగ్గున’ మండుఁ బో ? యొడలు; పాపపుబోగమువృత్తి నెంచినన్.

క. ఎటు నైఁచిరొ? పెద్దలు కట, కట! యియ్యది జాతిజీవకముగాఁ గొని యి
ప్పటికేని కనులు దెఱకవ్వతటకాపడి చూచుచుంట తగునే మనకున్.

తే. పెద్ద లొనరించినట్టి ‘దీవృత్తి’ యనుచు
మనముఁగూడ నొనర్పుట మంచి కనె ?గు

నేదేనిం గయికొం(డు మానవులు; మీ రీవృత్తి వర్జించుచోఁ
బో దీవృత్తి మఱొక్క రింద దిగుచే ముమ్మాటికి న్నిక్కమౌ. ౧౭౪

చ. దిగుదుడుగాక వేఱొకరు దీనికి "న"ట్లని మీ కుపేక్ష గాఁ
దగదు స్వశక్తి సర్వమును ధారఁగఁ బోయుఁడు దీనిఁగూర్చి యే
రెగఁబడిరేని యేమి చెడు? నేవము వారలకే ఘటించు మీ
తెగ నగుఁబాటునుండి కడతేఱుటె కావలె మీకు సర్వథా. ౧౭౫

గీ. "ఎవ్వరో తప్పు పని చేయు టెట్లుఁ దప్పు"
దనుచుఁ దాన యప్పని సేయు నజ్ఞుఁ డున్నె ?
ఉండఁ, డొక్కటిమాత్ర మిందున్న దేను
జెప్పఁదగ్గది చెప్పెదఁ జెవుల నిడుఁడు. ౧౭౬

మ. కళలం దెన్నిక గన్న నాట్యకళ కీకాంతామణుల్ దక్క నే
కులకాంతామణుల లర్హురాం డ్రినుట కేకొంచెమ్ము నంగీకృతిన్
గొలుప ర్విజ్ఞులు; నేఁడు వారలను మూర్ఖుల్ గాఁ బ్రసంగించువా
ర్గల రేకొందఱొ వారివాద మది శుష్కం బొప్పికో ర్కోవిదుల్.

చ. కులపతి నాట్యరంగమునకున్ జని వేఱొకపూరుషు న్నటున్
గలసి తదంగసంగతిని గైకొని నాట్య మొనర్చు టేళమున్
గలఁగనిదయ్యు "సంస్కృతిని గాపురమున్ బొనరించు నర్హతన్
గల"దని యాత్మవంచకులు గాని కవుల్ వచియింప రెవ్వరున్. ౧౭౮

వ. ఇయ్యది సంసారిణులుగా నుండి సభలలో నాట్యమును బ్రదర్శించు స్త్రీ
లకు సంబంధించు నంశముగాని మీయుద్యమమునకు సంబంధించునది
కాదు. కాని ముందు ముందు సంసారిణులుగా మాఱికూడ నితరసంసా
రిణులతోపాటుగ నిద్దానికి నగ్గమగునెడల వారలతోపాటు మీకును ని
య్యది యనువర్తించి తీరు నని వెండియు. ౧౭౯

చ. పొలఁతులమాట కేమి ? మును పూరుషులేనియు నాట్య మాడువా
రలవెనువెంట నంటి చని రాగముఁ దీయుచుఁ దాళమేయుచున్

మెలఁగుట "యేవ" ము౦ దనిరి మేటికవీశ్వరు, లట్టివాఁడు పెం
డిలికి యతింప నీయమిని నిల్చి రనేకులు బ్రహ్మచారులై. ౧౨౦

ఆ. గొడ్డుచర్మములను దొడ్డగా నుతికి బా
గొప్పఁ జేయుపిదప గొప్పవారు
తాల్చునట్టి నేఁడు తళతళల్ హెచ్చుటఁ
జేసి రంగభూమి సేవ్య మయ్యె ? ౧౨౧

ఉ. వీథుల నాటుభాగవతవేషము లెట్టివొ ? యివ్వి యట్టివే
గాథలుగూడ నట్టివియె కాని ధనంబు వ్యయించి తత్కళా
రాధకు లందచందములు రంగులు భంగులు గూర్చి తత్కళా
సీధువుఁ గ్రోలఁ జేసెదరు చిన్నలఁ బెద్దల నెల్లవారలన్. ౧౨౨

ఆ. పల్లెటూరినుండి భార్యతోఁ బిడ్డల, గుంపుతోడఁ బిల్లికూనతోడ
నేమ మొప్ప నొగి "సినీమా"కు రై తేగు,వారమునకు రెండుసారులేని.

వ. పట్టణవాస్తులం గుఱించి చెప్ప నక్కఱయే లేదుకదా యని మఱియును,

గీ. తోలుబొమ్మలాటలె "సినీమా"ల యాట
లపుడు గరిడెభాగవతము లిపుడు తెరల
నాటకమ్ములు వీని కానాఁడు లేని
గౌరవము నేఁడు క్రొత్తగాఁ గలుగుటెట్లు ? ౧౨౩

చ. కులమును సంస్కరించుటకుఁ గోరిక పూర్తిగ మీకు నున్నచో
వెలచెలు లేరు రంగముల విద్దియ చూపుట కేగకుండఁగా
పలయు టటుంత నేరొ ? కులవంతుల మానిను లేగి రంచుఁ బో
వలవదు వానిఁ జూచుట, కవశ్యము నా కిటు తోఁచి చెప్పితిన్. ౧౨౪

వ. నే నీవిషయమ్మున నింతగా నొక్కి వక్కాణించుటకుఁ గతం బేమందు
రేని ? ౧౨౫

ఉ. మాపురి నొక్కబ్రాహ్మణుఁడు మంచికుటుంబి వివేకి ప్రేలితోఁ
జూపఁగ వీలు గాని పరిశుద్ధుఁడు కూఁతులుగూడ నట్టిరే

ఆపసిపాప లిప్పటికి నాటియుఁ దేటియుఁ బెండ్లి లేనివా
రై పడియుంట సంఘటిరె నక్కట? రంగముల న్నటించుటన్.

క. 'రంగ' మనఁగ? 'రంగా' నే
వెంగలు లెఱుఁగంగ లేక వెటివెట్టినుడుల్
సింగారింతురు పత్రిక
లం, గాచని యున్నవారల న్నగుదు రొగిన్. ౧౦౯

వ ఇప్పటిమా ఱెట్టులైనను మనకులస్థు లశరాభ్యాస మైనంతమాత్ర నక్క న్నియను వివాహమాడు వారు కారని మీరును నెఱుంగుదు రని పెం డియు. ౧౯౦

చ. కులమును బాగు చేసికొను కోరిక కియ్యది బాధకంబుగాఁ
గల దని యిట్లు చెప్పితిని, గౌరవ మున్నకుళమ్ముపార లె
వ్వలనఁ జరించినన్ మనకు వారలతోఁ బని లేదు వారిపూ
ర్వ్వలచరితంబులన్ మెలఁగి పూతిని బూత మొనర్పఁగాఁదగున్. 

వ. ఈచెప్పెడి విషయంబు లోఁగడ వచించినదియే, మిగులనావశ్యకం బని తెల్పుటకుఁ జర్వితచర్వణం బొనర్పవలసి వచ్చె నది యేది యని ప్ర శ్నింతురేని. ౧౯౨

మ. మఱియొం దేను వచింతు "గేహిని 'సినీమా'' తార గాకుండ నే
ర్పఱుపంగావలెఁ గట్టుఁబా" టనుచుఁ జెప్పంగాఁ బనే లేదు మీ
రెఱుఁగుం డాపె తదీక్షణమ్మునకుఁ దా నేనాఁడు పోఁగూడ దె
వ్వరు సాక్షిజగదీశునాండ్రు చనినన్ వా రొజ్జలే? యేరికిన్. ౧౯౩

వ. ఇయ్యది నాకు నాయంతరాత్మ బోధించినతెఱంగు మీ కిది నచ్చినను న చ్చకున్నను నేను జెప్పెడిదిమాత్ర మింతియే, మీయుద్యమంబునకు దైవంబు తోడ్పడుఁగాక యని దీవించుటయు సంతసించుచు వార లరి గిరి యనంతరంబు. ౧౯౪

ఉ. పూవులు వారు మూఁగురును బొంతవనమ్ముల కేగి తేఁగ న
ద్దేవుని కాపె పల్వగలఁ దీరిచి భక్తి నలంకరించున
ట్లావల దేవళానఁ గలయర్చకపాళికిఁ జెప్పుఁ, బుట్టువున్
బావన మిట్లు చేసికొనుభావముతోఁ జెలి యుండె నయ్యెడన్. ౧౬౫

గీ. ఎన్ని వేదముల్ వెదకిన నెన్ని సత్పు
రాణములను గావించిననాణెమైన
దైవ భక్తికి మించిన తారకంబు
లేదు ముమ్మాటికిని లేదు లేదు లేదు. ౧౬౬

క. భాగవతమ్మును దఱచీ, యోగము వచియించె గీతయు న్వచియించెన్
యోగివరు లెవరొ వేతొక, లాగునఁ దరియింతు రది యలఁతులకువశమే

ఆ. అందుఁగూడ భక్తి నాంతరీయకముగా
నుండి తీరుఁ గాన యోగులెల్ల
భక్తిమార్గముననె పరమేశ్వరునను(గ
హంబు వడసియుందు రనుట ధ్రువము. ౧౬౮

క. కులమనియున్ మఱి తీర్థ
స్థల మనియున్ స్నాన మనియు జప మని భక్తిన్
దలఁచెడివారికి నేమ
మ్ములతోఁ బనిలేదు కలుగు ముక్తి యెటేనిన్ ౧౬౯

గీ. కేవలాకారమున మది గీలుకొల్పి
యన్నిరాకారు ధ్యానింపు మనుటకన్న
నేదియో మూర్తి కల్పించి యెదఁద నిల్పి
అర్చ లొనరింపు మనుటయే అతిసుఖంబు ౧౬

గీ. సంసృతి దరించువారికిఁ జాల మార్గ
ములను జూపిరి తత్త్వవేత్తలు మహాత్మ
లందులో భక్తి సర్వత్ర నాంతరీయ
కముగ భాసిల్లు భక్తి యొక్కరిధనంబె? ౨౦౦

గీ. అలగజేంద్రుండు పశువయ్యు హరినిగొల్చి
తత్కటాక్షంబు గణియించి ధన్యుఁ డయ్యె
భక్తికి వశుం డగును భగవంతుఁ డెల్ల
భంగులను భక్తి గడియింపవలయు నరుఁడు. ౨౦౧

క. పితృభక్తి మాతృభక్తియుఁ, బతిభక్తియు దేశభక్తి పరమేశపద
ద్వితయీభక్తియు నివి స, ద్గతితెరవులు భక్తి సకలకలుషము లడఁచున్.

వ. నావుడు శౌనకాదులు సంతసించి యతనిం బ్రశంసించి యప్పటికి సభ
చాలించిరి. ౨౦౨

శ్రీ శ్రీ శ్రీ

ఆశీర్వాచనము.

క. హరిపాదసరోరుహ బం, భరితాంతఃకరణుఁ డుత్తమచరిత్రుఁడు భూ
సురభక్తుండు జగన్నా, థరావు చిర మలరుఁగాక ధన్యత కిరవై.

గద్య

ఇది శ్రీ తిరుపతివేంకటీయంబగు సుశీల యను కేవలకల్పిత
ప్రబంధమ్మునందుఁ బంచమాశ్వసము

శ్రీ శ్రీ శ్రీ

---

ద్రుని దశరథసుతుని స్మరించెఁ జోరపురాసుని మెచ్చి యిచ్చె ను
య్యనఘుఁడు కాళి కెన్ని బలు లర్పణఁ జేసి యిలింబు నుంచెనో. ౯
క. ఒకఁడేఁడు భార్యనే కా, శికరున్ బలి యిచ్చె నది యుగ్రము గా దూ
రక చెప్పికొనరు పెద్దలు, సకలేశ్వరికి బలియిచ్చు శాస్త్రం బొప్పున్.
ఉ. ఇంతకు భాగ్యకాల మది యేర్పడఁ బట్టియె రాజపూజనన్
బ్రాంతమునందు యీజలజపాణి తపోనిధి వారిజాంచి యీ
చెంతకు వచ్చి నిల్చినది శ్రీ దేవి మూర్తిగ నూహనంబు "లు
శ్మంతగృహంపుఁగుందెలు" గదా ? యిది యెట్లు మఱింగి పోయెదిన్
క. వెనుక "నువుగింజ" సామెత
కనుగుణముగ నర్చకుఁడు గుహాంతరమున నె
మ్మనమున నిటు లుప్పొంగుచుఁ
గనుచుండెన్ స్వప్నరాజ్యగాథాశతమున్. ౧౩
క. నవరాత్రదీక్షతోఁ గడు, నవధానమ్మొప్ప దేవి నర్చించుచు "నే
కు వలి సమర్పించెద నొక, నవనీతశుభాంగి" నను దినదినం బతఁడున్
గీ. వంగదేశీయు లర్చించుపైఖరిగఁ జి
రంబు నుండి యర్చింప నోయంబ ? నేఁ ద
లంతు నేఁటికి సిద్ధించె సంతసించి
నన్ను నృపుఁ జేయు మంతియనాకుఁ జాలు. ౧౪
వ ఇట్లు దురాశాదూషితంబైన మనమ్ములో నయ్యర్చకుం డంబిక నర్చిం
చుచు మహాష్టమినాఁ డీపె నగ్గుహకు నేకాంతమ్ముగ రప్పించు నుపా
యమ్ము లరయుచుండె నది యటులుండె. ౧౫
ఉ. దానికి నాఁటిదూరమున దయ్యము గియ్యము లేకయున్న నిం
పైనవనమ్ములున్ సరసు లందములైన గుహల్ ఫలమ్ములున్
దేనియలుం గలట్టి ధరణీధర మున్నది యోగి యొక్కఁడం
దే నివసించు వైశ్యుఁ డతఁ డెల్లరు నాతని గంద్రు యాత్రికుల్. ౧౬

క. కొంద ఱట కేగుచుండఁగ, సందర్భం బెఱిఁగినట్టి జలజాక్షం డీ
సుందరి నమ్మూర్తులతో, నందులకున్ బంపి గండ మది తప్పించెన్.

వ. ఆవామాచారుండగు నర్చకాపశదుండు సుశీల యట లేమికి వగచి వేఱొ
క్క కన్నియం దెచ్చి బలి నీయం దలంచెఁ గాని తుద కయ్యదియు నెఱ
వేఱక ఆత్మవినాశకారణం బయ్యె నది యటులుండె. ౧౮

ఉ. ఆగిరి నున్న యోగికడ నంగన లుందురు తత్కుభృద్గుహా
భాగములందు యోగి యలవారలతో విహరించు సత్యమే
మో? గనరాదు "యోగు లిటు లుండుటయున్ గల"దంచుఁ జెప్పికొం
డ్రాగిరి కేగి చూచు జను లందఱు: రూపసి యాతఁ డెంతయున్. ౧౯

ఉ. "ఆతనిశిష్యురాండ్రు ధన మత్యధికంబుగ నున్నవాం" డ్రటం
"చాతని కిత్తు" రంచు జను లాడుదు రాతనితత్త్వ మెట్టిదో?
యేతఁడుగాని యొక్కఁడును నించు కెఱింగినయట్లు లేదు దు
ర్నీతియొ? లేక యయ్యది సునీతియొ? లోకవిరుద్ధ మెమ్మెయిన్. ౨౦

క. కొండొకబాల్యమునన నా, తం డీగిరిఁ జేరి పిదపఁ దత్తద్భూమీ
ఖండముల కరిగి తిరిగియు, నుం డు నిచటి కేగుదెంచి యోగస్థుండై.

క. అందుఁ గల యంగనలలో హిందూస్త్రీ లొకరె కా దఁ టితరద్వీపా
లందలి స్త్రీలుం గలరఁట? యెందులకో? వార లితనియెడ నిటులుంటల్

క. సామాన్యబుద్ధి కగుపడు. నామాటయె నిక్కమేని యంద ఱొకనితో
నేమియుఁ బొరపొచ్చెములువి, నా మసలుటమెచ్చటన్ గనంబడదుగదా!

సీ. అల "చిదంబరరహస్యం" బెఱింగినవార
లేరు లే రతనిని లేకి యనుచు
జెప్పుద మన్న దుశ్చేష్ట లింతకు మించి
కనుపట్ట విదియేని కాంచి పట్టి
నట్టివారలును లే రాతండు స్త్రీలును
నగగుహలో నుందు రంతవట్టె

యే రెఱింగినదేని యెలమి దత్తాత్రేయుఁ
డే కాదు మఱికొంద ఱిద్ధతేజు
గీ. లిట్టివా రున్నయట్టులె యెంచు వినికి
యెల్లయను వచ్చి త మ్మాశ్రయింపకుండ
బాలకులపోల్కి వెఱ్ఱులపగిది దయ్య
ములవిధమ్మున నుందురు మును లటంచ్రు. ౨౬

వ. అది యటు లుండె. ౨౭

క. ఆతండును నావనితలు, నీతన్విని దోడివారి నెఱిఁగినయట్టుల్
చేతఃప్రీతికరమ్ముగ, నాతిథ్య మ్మొసఁగి యుంచి రటఁ గొన్నాళుల్.

వ. వారల యాతిథ్యంబు గైకొంచు నచ్చటం గొన్నా ళ్ళుండి యాచుట్టుప
ట్టుల నుండు గిరులయందలి యోగుల దర్శించి వనమ్ముల నీక్షించి సర
స్సులం గ్రుంకి మరల నయోగ్యుఁడ కరుదెంచి కొన్ని దినమ్ములుండి పిదప
యథాస్థానమ్మున కరుగు నప్పు డయ్యోగి యిట్లనియె. ౨౮

క. భగవంతుఁడు ని న్నియ్యెడ
కొగిఁ బంపించినది యెందుకో? యెఱుఁగుదువే?
తెగ నఱుకఁ దలఁచె నొక్కఁడె
ఱెఁగి యిట్టి యుపాయ మొకఁడు శ్రీహరి సలిపెన్.

ఉ. నీ వట లేమికిన్ వగచి నీచుఁ డతం డలయమ్మవారికిన్
వావిరి వేఱొకర్తు బలి వైవఁ దలంచెను గాని యప్పునిన్
దేవుఁడె తా నెటో నిలిపె దీనియథార్థము సర్వ మీపలు
న్నీవును వీరు విందురు మనీషు లటన్ వివరింత్రు కోమలీ! ౨౯

వ. అని వీడ్కొల్పినపదంపడి యథాపూర్వపర్వతస్థానంబున కరిగి యయ్యో
డ యోగి చెప్పినయావద్రహస్యమ్మును నక్కడి పెద్దలవలనఁ దార్కా
ణం బగుటయు నత్యాశ్చర్యపర్యాకులచిత్తులై వారు నలువురును దమ
లోఁ దా మిట్లు చర్చించుకోఁ దొడంగిరి. ౩౦

చ. ఉనికిని బట్టి చూడ నొకయోగిగనే కనుపట్టుఁ గాని జ
వ్వన మలరారు భామినులు వజ్జనె యుండఁ సుభృద్గృహస్థలం
బునఁ జరియించు వేరికిని బుట్టఁగఁ జేసెడి సందియుంబు: పి
నినిజ మెఱుంగు టెంతటి మనీషులకేనియు దుర్ఘటంబ యౌ. ౩౧

క. జ్ఞాన మసామాన్యం బను
కో నగుఁ గాకున్న నిచటనొండ వెటు తెలియుం
గా నయ్యె "రేడియో" వలెఁ
గానఁగ యంత్రమ్ము యోగికడ నున్నదియే ౩౨

వ ఇక్కడివా రెవ్వరేని యక్కడికి వచ్చి యిక్కడి వృత్తాంతమ్ము నుడివి
రనుకొనుటకును నవకాశం బగుపట్టదు, అక్కడ మున్నున్న దినమ్ము
లలో నిక్కడనుండిగాని వేఱొకచోటినుండిగాని యెవ్వరును వచ్చినట్టు
లగుపట్టదని వెండియు. ౩౩

సీ. దూరశ్రవణశక్తి దూరదర్శనశక్తి
యోగులకున్నట్టు లొక్కకొన్ని
దృష్టాంతములవల్లఁ దెల్లమయ్యెడి నది
యోగసాధ్యం బని యోగవిదులు
వల్కుదు, రిప్పుడో? పరఖండవాసు ల
ద్దానియంత్రింపుబలాన నోలి
సర్వసామాన్యమౌ సరణికిఁ దెచ్చిరి
గాని మాంత్రికశక్తి కష్టసాధ్య

గీ. మద్ది యీయంత్రములబలె నన్యవస్తు
తతుల సాహాయ్యమును గోరఁ దలఁప దిదియొ?
కోరు నితరసాహాయ్యము, కొనకు దాన
నేది చెడెనేనిఁ జెడు, మంత్ర మెపుడుఁ జెడదు. ౩౪

ఉ. మాంత్రికశక్తి చేయఁగల మర్మము లన్నియుఁ గాకపోయినన్
యాంత్రికశక్తి కొన్ని పనులైనను సల్పుట యక్కజంబ యా
మంత్రి మటంచు లేదనుటమాత్రము తప్పగు దీనియున్కి "రై
ల్మంత్రము" వల్లఁ దెల్లమగులా గొనరించె నటం దొకం డహో ?

వ. ఇయ్యది యనేకు లెఱింగినదియు, సర్పదష్టుని పేరు చెప్పి తంతి నంపిన వెంటన యెన్నివేల మైళ్ళలో నుండినను నటనుండి మంత్రించి బ్రదికించుట ప్రత్యక్షమ్ముగ నీకాలపువారలెల్ల నెఱిఁగియు మంత్రశక్తి లే దను కొనుచెట్టిది ? ఇట్లు వారిలో వారు వలుపుచును నావైశ్యయోగిశక్తింగుఱిచి వితర్కించుకొనిరి వారిలో వైశ్యస్పృద్ధుండు తన యెఱిఁగిన యొక యోగిచరిత్ర మిట్లు వక్కాణించె. ౩౬

క. ఒకయోగి వచ్చె మును మా, మకపురమున కతని ననిరి 'మాలం'డని పాదుకలును దండము వస్త్రం, బొకటియ సామాగ్రియతనికున్న సకలమున్

వ. అన్నముగాని పాలుగాని యతఁ డెన్నఁడును ముట్టినట్లు లేదు మలమూత్ర విసర్జనంబున కరిగినట్లును లేదు. పుడిసెఁడు పలుచని మజ్జిగయును నొకయరఁటిపండులో సగమునుమాత్రము దినమున కొకసారి పుచ్చుకొను నింతకు మించి యేమియున్ దినఁడు కడుంగడుఁ గృశించి యుండెడివాఁడు, సర్వరోగములను "రెట్టియా పట్టిచామి" యనుమంత్రముపదేశించి పాఱఁదోలెడివాఁడు ఇది నేను బ్రత్యక్షమ్ముగా వీక్షించితి, నతనికడ కరుదెంచు రోగులకతన మాపురంబు జనసంకులమై పట్ట శక్యము కాదయ్యె నప్పు డతనిని రాజశాసనం బవలికిఁ బంపె, యోగులు ప్రచ్ఛన్నులుగనో ? యేదేని యితరవిధముగనో యుండవలయునే కాని కాకున్న జను లవ్వారిసమాధికి భంగంబు గల్గింతు రనుటకు సందియము లేదు, నేను జెప్పినయోగి యెక్కడి కేగిన నక్కడికే జనులు తండోపతండములుగా వెంటాడి పీడింప నతం డెక్కడనో యొకట నంతర్ధానము నందినట్లు చెప్పికొనిరి, వేఱొకయోగి కడుంగడుఁ జక్కనివాఁ

డు నవయౌవనుఁడు జన్మమ్ముచే శ్రీవైష్ణవుండె యయ్యు సుబ్రహ్మ
ణ్యోపాసకుం డతనికిఁ దోఁచి యేమన్నమేని యొసఁగినచో నది ధరిం
చుమాత్రన వ్యాధి నిర్మూలం బయ్యెడిది, కొందఱ కట్టి యాసక్తి జరి
గినపిమ్మట నయ్యది సర్వత్ర వ్యాపించుచుండును. ౩౮

క. దగ్గెడివారును జ్వరమున, గ్రుగ్గెడు వారలును మఱియు మఱియేరుజనో
నగ్గెడివారును నాతని, దగ్గఱ కేతెంచి రతఁ డెదన్ ఎసిగికొనన్. ౩౯

వ. తన కాతండును నెట్టకేలకుఁ దప్పించికొని మరిఁగె ననవుడు రాజర్షి
యీయోగులచరిత్రములు నానాప్రకారంబులుగా నుండు వానిని గ్రహిం
చుట కష్టసాధ్యము, మఱియుం గొన్నిటి కర్థమే కనుపట్టదని వెం
డియు. ౪౦

ఉ. ఈతనిచర్య హేయముగనే కనుపట్టెడి, స్త్రీలపొత్తు లో
కాతివిరుద్ధ, మంగనలయం దనురక్తియ యుండెనేని యీ
రీతిగ నుండి వారి నలరించుటకంటె మఱొండు వేషమే
ప్రీతికరంబు గాదె? అలభీతమృగేక్షణజాతి కారయన్. ౪౧

వ. అట్లనుకొనుటకును వలను పడదు సుభద్ర నర్జునుండు వలపింపఁజేసినది
యోగివేషంబుననకదా? ౪౨

ఉ. కొందఱితత్త్వమున్ దెలిసికోవలె నన్న వశంబు గాదు బల్
సుందరుఁ డొక్కరాజు పరిశుద్ధుఁడు విద్యలయందు నెందు సం
క్రందనమంత్రి సత్కవియు గాయకుఁ, డాయనవంటివాఁడు ము
న్నెందు జనింపలేదు జనియింపఁడు రాఁగలకాలమం దెటన్. ౪౩

ఉ. భోజుని విక్రమార్కునిఁ "బ్రభూతయశస్కు" లటంచు విద్యలం
"దోజగలా" రటంచు వినుచుందుము వారలశక్తి యీమహా
రాజవరేణ్యుశక్తికడ రాజిలు "కాగడముందు దీపపుం
దేజమునగాదు" మెచ్చఁదగు తేఁకువలెల్ల వరించె నీతనిన్. ౪౪

ఉ. క్షత్రియుఁ డాతఁ డేను నొకక్షత్రియమాత్రుఁడ నక్కటంబుగన్
స్తోత్రము చేయుచున్నటులు దోఁచుచునున్నది యేమొ? మీరు స
ర్వత్ర జగంబునం దతని రాజులునున్ గవిరాజులున్ సుశీ
గాత్రుని నేఁడునున్ విరివిగాఁ దలపెట్టుచునుందు రెల్లరున్. ౪౯

సీ. "ఔదార్య" మన్నప్పు డతనిదే యౌదార్య
మనఘత్వ మన్న నాతనికె చెల్లు
నలఘుత్వ మన్న నాయనదియే యలఘుత్వ
మనుపమత్వ మ్మన్న నతనికె తగు
నప్రమేయుం డన్న నతనినే యను టొప్పు
నపరిదృష్యుం డన్న నతఁడె యౌను
అకలంకుఁ డన్న నాయనఁదక్క వేఁ రెందు
ననుకంప యన్న నాతనిధనంబు

గీ. రసికుఁడన నాతఁడే యథార్థవిదుఁ డన్న
నతఁడె భోగియు యోగియు నతఁడె త్యాగి
వైణికుఁ డతండె గాయకవరుఁడు నతఁడె
ధీయుతుఁ డతండె శృంగారనాయకుండు. ౫౦

గీ. వైదికాచారతత్పరత్వమున మాతృ
పితృచరణభక్తి సత్యసంధతను నేక
వీరతాగుణమందు నీధీరు ముందుఁ
జెప్పి శ్రీరాముఁ దిమ్మటఁ జెప్ప నొప్పు. ౫౧

గీ. ఎంత వర్ణించినను తృప్తి యించుకంతఁ
గూడఁ గలుగ దిమ్మహీశుని గుణగణంబు
స్వయముగా నేను జూచినవాఁడ నొరుల
వలన విని యిట్లు వర్ణించువాఁడఁ గాను. ౫౨

ఉ. ఆయన కుండె నంక యొకఁ డంబుజవైరికిఁ బోలె, దాని
ని మెడఁ గొల్పు సే నుడుప నీరు తదీయకథానురక్తికిన్
"బాయుట లేమి:" యనన్ భయము పట్టి ననున్ వెసఁదీయఁ జేయుటన్
నామెడ దాఁచి పెట్టితి ననంతరమం దెటు దాఁగు దాఁచినన్. ౪౯

సీ. ఈయుకే పోవలె నిచ్చునో దర్శనం
బది యెల్లకాల మింక దు పడదు
ఉద్యోగ మొకసారి యుండి పోయినయేని
నెలజీత మది ముట్టు నియతముగను
అవసరమై యున్నప్పు డాడినమాటని
జరిగి తీరుటెకాని యురక పోదు
తనతండ్రి నాఁటిది తనకమే యగుఁగాక
అదియు గౌరవపాత్ర మతని కగుసు

గీ. మఱియు నెన్నియొ గల వసామాన్యములగు
గౌనము లాయనయెడ నందుఁ గొన్ని మనకు
నర్థమే కావు. కాక యన్యార్థ మిచ్చు
నంతటి విశాలహృదయ మె ట్లబ్బు మనకు. ౫౦

క. సామాన్యులతెల్వికి ను, ద్దామచరిత్రుల యథార్థత నెఱుంగు బలం
బేమాత్రము నుండదు త, త్సామర్థ్యము దెలియ నట్టిసారము వలయున్.

గీ. "తల్లి పట్టాభిషేక విధానము నకు"
నాజ్ఞ యీకున్నఁ దలపెట్టఁ డయ్యె మరలఁ
గారణము కోడలికి నత్తగారు గౌర
వంబు చూపుచు మెలఁగఁగా వలయు ననుచె. ౫౧

గీ. ఇది సదుద్దేశ మనుకొని యేకుమారుఁ
డన్వయపరంపరగ వచ్చునట్టి యుత్స

వంబు విరమించు నిట్టివి పదియు నైదు
గా వతనిసద్గుణము లనేకములు గలవు. ౫౩

క. ఏతల్లిమాటయెడ నే, భూతలపతి యింత భక్తిఁ బూని చరించెన్
సీతాపతి తండ్రికిబలె, సీతయు తల్లికి మెలంగె నెదు రన కెపుడున్.

క. పార్థివుఁ డాతం డెపుడుం, బార్థివలింగార్చనంబు మానఁడు కృష్ణున్
బ్రార్థించుటయును మానఁ డ, నర్థమ్ముల కాతఁ డెట్టు లాస్థాన మ్మో.

చ. పరమపవిత్ర మన్వయము భాస్కరతేజసు వంటి తేజ మీ
శ్వరపదనిత్యపూజనము స్నానము సంధెయు లోనుగా సదా
చరణము విప్రభక్తి తొలిక్షత్రియు లేగినవర్తనంబు నే
మఱక చరించు నీతనికి మద్య మెటుల్ రుచియించెనోకదే! ౫౬

చ. అనియనుకొందు నిప్పటికి నాయన జ్ఞప్తికి వచ్చినప్పుడె
ల్లను నిది యబ్బుకారణము లాఁతివిలాతులనుండి వచ్చి యీ
మనకుఁ బ్రభుత్వ మూను జనమాన్యుల "విందుల కేగుటే" యటం
చనెదరు గాని కొంద; అది యన్యనృపాలుర నిట్లు చేసెనే? ౫౭

క. ఈయనతో మఱికొందఱు,
శ్రీయుత లుద్యోగిజనులు శిష్టులు సుకవుల్
గాయకులును గాయనులును
సాయముగా నుండి క్రోలసాఁగిరి రసమున్. ౫౮

క. ఎంతెంతో విలువ గల రస, "మంతును బొంతు"గనరాక ఆగతమై 'రా
జ్యాంతే నరకం ధ్రువ' మని, అంతు లిడం జేసె జనపరంపరచేతన్.

గీ. త్రాగుఁగాక మద్యమ్ము విస్తార మధిపుఁ
డెవనిఁగాని పరుషమాడఁ డెపుడుఁగూడఁ
జేయఁ డపమతి మఱవును జెందఁ డిట్టిఁ
డొండొకఁడు మద్యపులయందు నుండు టరిది. ౬౦

క. పంచమహాపాతకులం, దెంచిరి మద్యమ్ముఁ ద్రావు నెవ్వని నటు వా
రెంచుటకుంగలకతమిది,మంచిసమస్తమ్ము నణఁచి మనుజుని జెఱుచున్.
గీ. అట్టిదుర్దోష మీయనయందు లేశ
మేని గలిగింప లేదని యేన కాదు
ఎల్లవారలు నెఱుంగుదు రల్లశంక
రార్యుఁడో ? యాతఁ డాతనియంశ మగునొ ? ౬౨
వ. అది యటులుండె. ౬౩
ఉ ఏగెను జాలఁగాల మిటు లీయొకయంకము దప్ప లోప మే
భాగమునందు లేకయలపార్థివసత్తము జీవితంబు, పై
కే గెడికాల మయ్యలఘుఁ డెట్టు లెఱింగెనొ ? గుర్తు వట్టి య
య్యాగమవేది తా నరిగె నాప్తులతో దరి నున్నకొండకున్. ౬౪
ఆ. ఏగుత్రోవ మద్య మెదురయ్యె వారికి
నధిపుఁ డల్లజనుల నడ్డఁ బనిచి
కావడులను గొండకడ కేగునట్లుగాఁ
జెప్ప నాజ్ఞ చేసె సేవకులకు. ౬౫
ఉ అక్కజ మయ్యెఁ జిక్కఁ గలయాప్తుల కయ్యధినాధుఁ డప్పు డా
ఫక్కిని జేయునాజ్ఞ ! మధుపానములె య య్యును వార లెంతయో
చక్కని మేల్పరిమళ మెసంగురసంబులు గోరెలువారు నేఁ
డిక్కటుమద్యమున్ గొనెడి యిక్కటు వారల కెట్లు సొక్కెడిన్.
క. యోగీశ్వరోత్తముండున, నాగతవేది యగుజ్ఞాని యయ్యధిపతి యీ
పైఁ గటుమద్యమె"వారల, కౌగతి''యనియెంచి యట్టులానతియిచ్చెన్.
వ. ఈతకల్లు కావళ్ళు కొండకుఁ జను నట్లాజ్ఞాపింపఁ బంచి యన్నరవ
రుండు. ౬౭
క. చర్మములు బాగు చేసెడి, మర్మ మెఱుఁగనట్లి దీని మర్మముగూడన్
దుర్మతు లెఱుంగ రిదియే, మీ ర్మేమును ద్రావుచుంటిమి జడాత్ములమై.

గీ. పుట్టినది పుట్టిన ట్లున్నపుడు మన కిది
యేవముగఁ దోఁచు నిది కాఁచి యేదో కలిపి
కాచపాత్రల కెక్కింపఁగా సురేంద్రుఁ
"డమృత మంపించె" నని క్రోలుదుము భ్రమించి. ౨౦

వ. ఇట్లర్థోక్తిగాఁ గొండొక సూచించి వేఁడు మిన్నకుండె. ౨౧

క. అలవాటు పడిరి వారలు, కలిమికి నెలవైన నృపతికడ మేల్మిపరీ
మళ మలయవిలువమద్యము, లలఘుండతఁ డేగుకాల మది దరియమ్యెన్

ఉ. ఈవిషయంబు వా రెఱుఁగ రించుకయు న్వెసఁ బూర్వముస్ బలెన్
శ్రీ వెలిఁ బుచ్చుతే ఁగాలయఁ జెల్వలరారె పి తేజి నెక్కి త
మూవరుఁ డేగుచుండె నలఘూధరకూట, మతండుమాత్రమే
భావమునం దెఱుంగు నలభావము వారి కెటుల్ స్ఫురించెడిన్. ౨౩

వ. అయ్యెడ మిక్కిలి నాంతరంగికులు గొందఱు. ౨౪

ఉ. ఏమి ? మహాప్రభూ ? ప్రళయ, మిట్టు లొనర్చితి రాజ్ఞ నెవ్వ రీ
పామరు లాను నీతకలు పానము చేయఁగలట్టివారు ? సు
శ్రీమహితంబులై తగు పరీమళముల్ దెస లావరించు సు
ద్దామపు "పైను" లున్నవిగదా ? మన కేమిటి కిద్ది దేవరా, ౨౫

వ. నావుడుఁ జెఱుసవ్వ్యసవ్వియవ్వి ఘుండిట్లను, సృష్టిస్థితిలయంబులొనర్చు త్రి
మూర్తులుగాని లెక్కలేని రిక్కలఁ జక్కఁగాఁ బ్రకాశించు నాకాశంబు
గాని భూమిగాని పర్వతంబులుగాని యవి యివి యననేల ? యేదియు
శాశ్వతంబు గాదు కావున నెవఁడుగాని దేనికిఁగాని యొకనిపై నాధార
పడి యుండరాదు స్వతంత్రజీవి సర్వథా ధన్యుండని వెండియు. ౨౬

ఉ. పోయిన దట్టికాల, మిఁక ముం దిదియే గతి మీకు, నన్ను సు
శ్రీయుతు నాశ్రయించితిరి, చెన్నఁటిదోసము నాకతాన మీ
యాయువు నాశ్రయించినది, "అంతట నింతటఁ దీఱునట్టిదా ?
యాయఘు" మంచు నాహృదయ మిప్పుడు కొందల మందఁ జొచ్చెడిన్

వ. అని మిన్నకుండె. నతిగంభీరంబులగు సద్వచనంబులయందలి యర్థం
బు గొండొక గోచరించియు నయ్యది త్వరలోనే జరిగెడిది కాదనికొని
వారలు లోలోఁ గొంత చింతిల్లియు నుపశమిల్లిరి పిమ్మట నన్నరపాల
మౌళియు. ౭౮

మ. పిలిపించెం బురమందు నెందుఁ గలరోప్పూఁబోఁడులన్ "వేడుకల్
దొలుకాడన్ మల కేగుదేవలయు నేదో? యుత్సవం" బంచు, న
ప్పలుకుల్ వింట యొకండె తాఁ దడవుగాఁ బర్వెత్తి రాప్రోలివే
శ్యలు, సాలంకృతు లౌచు గుంపులుగ నాశ్చైత్రేంద్రకూటానకున్. ౭౯

వ. అట్లు వచ్చినయచ్చేడియల నెల్లరం దనయాప్తులకుం జూపి యారాజేం
ద్రుండు. ౮౦

శా. మీలో నచ్చినదాని నొక్కరొకరై మీ రేరికొం డోలి నీ
బాలాసంఘమునందు, నచ్చనిచెలి న్వర్జింపుఁ డన్నంత వా
ర్చాలన్ లోఁ జలియించు చొక్కొకకనచ్చామీకరాంగిన్ గొనం
గా లజ్జించియు స్వీకరించిరి నృపాజ్ఞన్ దాఁట రాకుండుటన్. ౮౧

ఉ. అందఱు నేరికో మిగిలె నందొక రోచెలి యందకత్తె గా
దెందును జాణ గాదు నగ లేమియు లే వలలేమ నానృపా
లేందుఁడు తా వరించెను నదృష్టము పండెః శ్రుటిన్ ఘటించె సం
క్రందనుసానికిం గలుగురత్నపు భూషలు మేల్మిచీరలున్. ౮౨

ఉ. అందముఁ జందమున్ గలుగు నంగనలన్ సిరి చెందుఁ దక్కువా
రిం దరిఁజేర దందురు, పరీక్షగఁ జూచిన నెందఱందఱో
యుందురు రూపహీనలగు నుగ్మలు, లంగము రత్నభూషణా
మంద "నిగన్నిగన్నిగల" మాటున డాఁగెడి వార లెల్లెడన్. ౮౩

చ. అతిగఁ బరీక్షసేయు సిరి కందము హేతువు గాదు మేల్గుణ
ప్రతతియుఁగూడఁ గాదు భగవత్కృపయే పరమార్థ, మిష్ట భూ

పతికరుణన్ ద్రుటిన్ సిరికి భాజనమైన వెలందిపల్లఁ బ్ర
స్తుతమువిశేషమెల్లరకుఁ దోఁచెడి గోచర మౌను యోగిగన్. ౮౪

వ. పాండ్యమండలమ్మునఁ గముంగను పేదకుటుంబంపు ద్విజుం డొక్క
రుండుండువాఁడు వైదికవిద్యయుంగాని లౌకికవిద్యయుందునాని య
తనికి లేశంబును బ్రవేశంబు లేకుంజేసి యేపూట కాపూటయే గడచుట
దుర్ఘటంబుగా నుండెడిది. అతనికిఁ బలువురు బిడ్డ లుండిరి. అతనియ
వస్థ వర్ణనాతీతం బగుటచే విస్తరింప నక్కఱ లేదు ౮౫

క. ఆతఁడు జమీను కధిపతి, దాతయునై యెల్లసిరులు తన్నుఁ గొలువఁ బ్ర
ఖ్యాతి గడియించె నన నే, వాతులుఁడు న్నమ్మఁ డింత వాస్తవ మయ్యున్

క. ఇచ్చిరి జమీనుదారులు, వచ్చ కొమార్తల నతనియపత్యమునకు వే
ల్లిచ్చలు కట్నము లిడి యే. సచ్చరితముఁ జూడ కొక్కసంపదఁ గనియే

గీ. జనకుకాలమ్ము చక్కఁగా జరిగె నంతఁ
గొడుకులకుఁ బెత్తనము వశపడియె నొకరి
కొండొకరికిని బడదయె; బెండు వడఁగఁ
దొడఁగె సంపద క్రమముగా బడుగులైరి. ౮౮

క. 'చాపచిరిగినను జగరసు, లోపం బుండ' దని యంద్రు లోకులు పిదపన్
సాపాటుకు నెల్లెల్లో, లోపము లేనంతకల్మి లోనికి దిగియెన్ ౮౯

క. ఆగర్భదరిద్రున కెటు, రాఁగలిగె జమీను. పిదప రాచఱిక మెటుల్
పోఁగలిగె సుతులతరమున, శ్రీగొను మిటువంటి దనుచుఁ జెప్ప వశంబే?

వ. అదియటులుండెఁ బ్రస్తుతచరితంబు వినుఁడు. ౯౧

ఉ. వేలకు మించువిల్వ గల వింతనగల్ మెయినిండఁ దాల్చి య
బ్బాలిక గుల్కఁ జూచి యలవారమృగీనయనల్ పొరింటివారిన్
మాలిమి నామెఁ గాంచు చలమానిని నోఁచిన నోము మెచ్చికొం
చాలలనామణిన్ గొలిచి గాచెలి రాచెలియై రహించుటన్. ౯౨

ఉ. అక్కడివారి కెల్లరకు నక్కజమున్ గలిగించె రాజుగా
రిక్కలికిన్ వరించుటయు నిందఱు నిందఱతోడఁ గూర్చుచో
నెక్కడ నెన్నఁడుం గనని యీవిషయంబున నున్నభావ మే
యొక్కరుఁగూడ "నిట్టి" దని యూహ యొనర్పఁగఁ జాలరై రొగిన్.

వ. అయ్యెడ నక్కడిరాజమిత్రులు తమలోఁ దా మిట్లు చర్చించుకోఁ దొ
డంగి రఁట. ౯౪

క. "ఆనందో బ్రహ్మ" యటం, చానాఁడు వరూధిని "విషయానందమె బ్ర
హ్మానంద" మనియె విజ్ఞుం, డీనృపతియు దాని నొప్పునే?యిది సతమే?

క. తలిరాకుఁబోండ్లకలయిక,వలనిసుఖంబునకు నల్లబ్రహ్మానందం
బిలఁ దులగాఁ జెప్పియుఁ'జం,చల'మని నిరసించి రవల శాస్త్రజ్ఞాతల్.

ఉ "తా దివ మేగుకాల మది దాపుగ నున్న"దటంచు నిప్పుడే
కాదె వచించె? నిట్టి తుదికాలమునందు 'ధనాంగనాజనా
స్వాదన మిచ్చగింపఁ దెటువంటి కుశీలుఁ' డనంగ విజ్ఞులో
కాదరణీయశీలునకు నట్టిప్రవృత్తి జనించు నొప్పునే? ౯౬

క. పరిపూర్ణప్రజ్ఞాబం,ధురులగు వారలచరిత్ర తుచ్ఛాత్ములకె
వ్వరి కర్థంబగుఁ దాదృ,క్పరిపూర్ణులె వ్యాకరింపవలయున్ దానిన్. ౯౭

వ. కేవలకామప్రయుక్తం బనుకొంద మన్నను. ౯౮

మ. అగుఁగా కిందఱి కిందఱిన్ గలిపి యేయానందమున్ దాను బొం
దఁగ నూహించెనొ? ఆటపాటలకు నీదాంపత్యబంధమ్ముతోఁ
దగు లేముండెడి? నంతరార్థ మెదియో? ధాత్రీశుఁడే తప్పఁ జె
ప్పఁగలే రెవ్వ కిది యర్థశూన్యముగఁ గన్పట్టున్ రసాభాసమై. ౧౦౦

వ. అని మఱియును. ౧౦౧

చ. ఇపు డిది యర్థశూన్యముగనే కనుపట్టునుగాక దీన గో
ప్యపువిషయంబె దేని యొకఁ డద్భుతమైనది యుంట నిక్కమౌ మ్మే

పషు(బని కీఘనుండు తనస్వప్నమునందునుగూడి సొప్ప( డీ
కృపణత కిప్పు డొప్పెడినె ? కిన్నరపాలు(డె ? యాత( డక్క-టా ?
వ. అని యనేకప్రకారమ్ముల నెవరికిఁ దోఁచినతెఱంగున వారు తమలోఁ
దాము వితర్కించుకొనుచుండిరి. పిమ్మట నన్నరపాలుండు వారలం
గాంచి. ౧౦౩
మ. మన మీనాఁ డది యాది కృష్ణుని యసామాన్యంపుఁజర్యల్ నటిం
చి నటాగ్రేసరుఁడైన యప్పరమునాశీస్సుల్ గొనంగా మనం
బున నుత్సాహము పుట్టెఁ, దచ్చరితము ల్మన్నీరు వల్లించి యా
డినవే, యీవెల్లయాంధ్రు గోపికలమాడ్కిన్ గ్రొం డ్రిటన్ భూమికల్
క. అవతారము లున్నవి శ్రీధవునివి పెక్కు-ది యొసఁగెఁ దాదాత్మ్యముగో
పవధూటులకును గోవుల,కవనిన్ గృష్ణావతార మది యొకటి వినా.
ఉ. స్నానము సంధ్యయున్ జపము సల్పి విరక్తి గడించి మోక్షసం
స్థానము నొందుటన్న శ్రమసాధ్యము, జారత కగ్గమై రమా
జాని నెఱుంగకే అతని జారునిగాఁ దలపోసి మోక్షసం
స్థానము కొల్లగొట్టు వ్రజతన్వుల నోఁచిన నోము లెట్టివో. ౧౦౬
మ. పరకీయాంగన కబ్బు ప్రేమ మది పాపప్రాపకంబైనఁ ద
త్పరతంబట్టి విమర్శ చేసినయెడం దత్తుల్య మొం డుండ, ద
ప్పరమాత్మం దొకజారుభంగి నలగోపస్త్రీలకుం దోఁచుటల్
పరమాదృష్టమొ ? దానిపే రెదియొ ? చెప్పంగా వశం బేరి కౌ ?
ఉ. ఈతఁడు ముక్తినిచ్చు "పరమేశ్వరుఁడే" యని గోపికాంగనల్
చేతమునం దెఱుంగునెడ శ్రీహరిపై వల పంత ముమ్మరం
బై తెగఁదెంపు లేక విరహాసహమై విలసిల్లునే ? మనః
ప్రీతికరుండు జారుఁ డనుప్రేముడి తారక మయ్యె వారికిన్. ౧౦౮
క. జారునిపై జారిణికిన్, జారిణిపయి జారునకును సాఁగెడిరతి శృం
గారమ్మునకు జీవం బా,జారుఁడు పరమాత్ముఁ డెట్లి సంఘటనంబో ?

క. నదిలో వర్షించిన వృష్ట్యుదకముగతి గొల్లసతుల యుద్రేకము కృ
ష్ణుఁ దవిలి సద్గతి నిడె నిమ్మద మితరోద్దిష్ట మబ్ధి మణఁగెడి జలమౌ.

ఆ. నీటిగుణ మొకొక్కచోటిగుణముఁబట్టి
మాఱినట్లె ప్రేమ మాఱుచుండు
నొక్కప్రేమ ముక్తి నొసఁగు వేఱొకప్రేమ
నరక మొసఁగు నెఱిఁగి నడువవలయు. ౧౧౧

వ. ఇది యింకను విచారణీయంబు, భగవద్గుణానుభవం బెవ్విధమ్మున ల
భించినను నయ్యది తరణోపాయం బగు ననునది భాగవతంబువలనం
దేలెడి సారం, బని వెండియు. ౧౧౨

మ. నదు లెన్నేనియు నుండుఁగాక జగదానందానుసంధానసం
పద సొంపారెడి: నచ్యుతామలపదాబ్జాతద్వయీ దేణువి
ర్యదఘాంకూర విసీలవర్ణదమృతప్రాయ ప్రవాహచ్ఛటా
స్పద శ్రీమద్యమునానదీమణితులన్ బ్రాపింపఁగా నేర్చునే? ౧౧౩

శా. శ్రీకృష్ణుం డవతార మెత్తనియెడన్ శృంగార మేకానలో
నేకోనం బడి సగ్గి మగ్గి యసద్రై యేకాంత మెట్లుండునో?
నాకౌకస్సరసీరుహాక్షులకడన్; "నారాయణుం డీరస
ప్రాకట్యమ్మున కెత్తెఁబో యి నవతారం" బంచు నే నెంచెదన్.

ఉ. ఏరసముం గుఱించి కవి యేరచనన్ బచరించెనేని శృం
గారరసాంగ మైనప్పుడె అయ్యది తియ్యగనుండు భోజరా
జేరస మొప్పికోక "యొకఁడే రస" మంచు వచించె నట్టిశృం
గారరసంబు గోపికలయం దుదయించి ఫలించెఁ గృష్ణుచే. ౧౧౪

2వ చరణములో — 'శృంగారరసాంగ మైనప్పుడె కమ్మఁదన మ్ముదయించు' ననియు, 4వ చరణములో — గోపికలతాయము లందు ఫలించెఁ గృష్ణుచే. ననియుఁ బాఠాంతరము.

ఉ. వృద్ధులు పైత మీరసము పిడియు. బూర్తిగ పిడనొల్ల ర
శ్రద్ధ నటించినం బయికి స్వాంతమునందుఁ బురానుభూతముల్
పద్ధతులెల్ల నిల్పి రసభావముల న్నెగడించు నీ రసం
బిద్దరకెల్ల మూల మని యెల్లరు నొప్పుదు రింత యేటికిన్. ౧౧౬

క. భక్తులలో శృంగారపు భక్తియె తారకము పల్లవకులం బెల్లన్
ముక్తిగనె దీనికతమున వ్యక్తం బగు నిదియు భాగవతమునయందున్

క. శుకునితరువాత రెండవ శుకుఁడని వినుతింతు రెవని సూరులు లీలా
శుకుఁడును శృంగారపుభక్తికతననే ముక్తి గాంచెఁ దెలియునకాదే?

ఆ. "దేవుఁ" డంచుఁ దెలిసి సేవించు యోగులు
సద్గతులకుఁ జనుట శాస్త్రహితమె
"జారుఁ" డనుచుఁ దన్నుఁ జేరిన వెఱిగొల్ల
యాండ్ర కిచ్చె ముక్తి నచ్యుతుండు. ౧౧౮

శా. 'గొల్లల్ గొల్ల' లటన్న గొల్లలెపొ? ఆగొల్లల్, తదీయాంగనల్
పుల్లాంభోరుహలోచనల్ మృదుతనుస్ఫూర్తుల్ కనత్కాంతివి
ద్యుల్లేఖల్ కరిరాజమందగతు లిందుభ్రాజదాస్యల్ సుతా
ర లీలావతు లేల వేయిపలుకుల్ రంభోర్వశీమేనకల్. ౧౨౦

వ. ప్రకృతము వక్తవ్యం బేమన. ౧౨౧

మ. మన మాగోపవధూమణుల్ హరియు నేమాడ్కిన్ రహిన్ బృందికా
వసమందున్ 'వనమందు వర్తిలిరొ? తద్భావమ్ములన్ స్వాంతమం
దున నేకాగ్రత నిల్పి తచ్చరితమందున్ రక్తి గీల్కొల్పి యిం
చనువ ర్తింతము మూఢభక్తిమెయి ముక్త్యర్థంబు నేఁ డిగ్గిరిన్. ౧౨౨

చ. ఇది మొద లేరు మీరు హరి నేమఱకుందురుగాక! గోపికా
హృదయములట్లు మీమదులు శ్రీపతియయ్యవతారమైన శ్రీ
యదుకులనాథుపై నిలుచునట్లు యతింతురుగాక యెట్టికో
విదులకు నందరానిపదవిన్ విభుఁ డిచ్చునుగాక వీఁకమై. ౧౨౩

వ. అని వెండియు. ౧౨౪

ఉ. ఇచ్చకు వచ్చినట్లు తినుఁ డిచ్చకు వచ్చినయట్లు గ్రోలుఁ డీ
రిచ్చపలాశులున్ మెలఁగుఁ డిచ్చకు వచ్చినయట్లు లిగ్గిరిన్
ముచ్చటకైన మద్యమును ముట్టఁకుఁ డీపయి, నొట్టు వెట్టికొం
డిచ్చెడువస్తు వొక్కటియె యెట్టివివేకిని మట్టువెట్టెడిన్. ౧౨౫

సీ. తలిదండ్రులను గొట్టు ఖలులు భార్యలఁ బట్టి
మర్దించునట్టి దుర్మదులు పడపు
చెలులఁ గూడెడి చెనంటులు కన్నములు వేయు
మొఱకులు జూదముల్ పరగు జడులు
పూజ్యుల నవమానముం బొనర్చెడి మొద్దు
లపమృత్యువుల కగ్గమగు నలసులు
"బొడ్డున మాణిక్యమును బెట్టిపుట్టి" అ
న్నము రామచంద్ర ? యన్ కుమతితతులు

తే. యమపురిని 'గ్రొత్తనరకము లవసర' మని
పించెడి ప్రబుద్ధు లెల్లఁ బ్రపంచకమున
మద్యమున కలవడి చెడు మనుజు లని యె
ఱుంగఁదగు దీనిబారిఁ బడంగఁ దగదు. ౧౨౬

గీ. ఏనుదక్క మాకొలమున నింతవఱకు
దీని కలవాటు పడినట్టి దృష్టులు జని
యింపలే దొక్కసువిశేష మిది మరగియు
నే నొకయకార్యమును జేయ నెఱుఁగు జగము. ౧౨౭

ఉ. చేసినఁ జేసినట్టె మఱి చేయకయున్నను జేసినట్టె యా
దోసము, లాసవంబునకు దూరముగాఁ జరియింపకున్నచో
గ్రాసము లేక కుందుటయు గాసిలి క్రుగ్గుటయున్ దటస్థమౌ
నాసహవాసులార ? యిది నాకతనన్ ఘటియించె మీకొగిన్. ౧౨౮

శా. ఏ నెల్లప్పుడు శాశ్వతం బగుదునే ? యీవేళనో రేపొ ? క్రా
దేనిన్ వచ్చెడియేఁడొ ? యెప్డొ ? చనుటే యేలాగునుం దప్ప, దా
పైనేనిన్ ద్యజియించితీరవలె నీపాపిష్ఠపున్ వస్తు వి
ద్దే నే నుండఁగనే త్యజించునెడ నా కెంతేని సంతోషమౌ. ౧౭౯

క. ఏకులమునకును నియ్యది, తాఁకంగారాని చెడుపదార్థము ద్విజులన్
వాకొనఁగనేల ? సాక్షాచ్ఛ్రీకృష్ణునియన్నగూడఁ జెడె నిక్కౌతనన్.

మం బలరాముం డలశేషునంశముగదా ? ప్రాజ్ఞుండు హాలాపరీ
మళ విస్మారితచిత్తుఁడౌ కతన నమ్మాన్యున్ గురుం జేసి పు
త్రులునుం బౌత్రులు నెల్లవారుఁ దుద కీదోషానకున్ బాత్రమై
ఖిలులై ప్రమ్గిరి మూలముట్టుగ సురాకాలుష్య మింతింతయే. ౧౮౧

వ. దీనిం బూర్తిగ వర్జింపవలయునని దైత్యగురుండు శుక్రుండు శాసించెం
గాని యాశాసనం బేకొలఁదిమందియోగాని యెల్లరు నామోదించిన ట్లగ
పట్టదు. భావికాలమ్మ్మననేని యెవరెన్నివిధముల యత్నించినను దీనిప్ర
చారంబు మూలముట్టుగ నాఁగుట కలలోనివార్తయే యని వెండియు,

మ. ఎవరో నీచులు దీనిబారిఁ బడువాండ్రే యెప్పుడుంగూడ, మీ
రవనీదేవకులావతంసులును శిష్టాచారసంపన్నులున్
గవులున్ గాయకులున్ వరేణ్యులును నీకాలుష్యము న్నెట్టి మీ
భవ మీపై భగవంతుఁ డొప్పికొనుశేవన్ వర్తిలుం డెమ్మెయిన్.

ఉ. రాజకుటుంబులం దిది పురాతనకాలమునందు నున్నయ
ట్లోజఁ గవీశ్వరుల్ దెలుపుచుండిన నేమగు ? దాన, నన్ ఖలెన్
రోజునురోజుఁ గ్రోల రెవరో ? యెపుడో ? కుసుమాసవమ్ము లా
రాజులు వారియంతిపురిరాణులు గ్రోలిరి మంతనంబులన్. ౧౮౩

చ. ఇది తుదిరోజు మీకు, నిఁక నెన్నఁడు దీనికి నాస చేయకుం
డెద గుదియించుకొందు పరమేశ్వరుసాక్షిగ నొట్టు వెట్టికొం

ఠద నయినప్డు మాను నెదియైన సరే? ఏజితేంద్రియుండు, కో
విదులకు మీకుఁ జెప్పెడివివేకులుగూడ జగాన నుందురే ?    ౧౩౭

వ. అని నొక్కినొక్కి వక్కాణించి వారలచేఁ బ్రమాణంబులు చేయించి
కొని వెండియు.    ౧౩౮

క. పాపంబులు లోఁగడ నిది, యాపాదించినవి తూల మగ్నిసెగకు నె
ల్లే పాటిపోవు నిపు డ, ల్లే పాఱుతఁ గృష్ణదేవుకృతులు నటింపఁగా.

మ. అని గోపాలురు గోపికల్ మఱియు నయ్యంభోజనేత్రుండు యా
మునతీరమ్మున నైకతమ్ముల నెటుల్ ము న్నాడిరో ? పాడిరో ?
జనపాలుండును వారు నట్లె భగవత్సాక్షాత్కృతిన్ గోరి భ
క్తి ని నాట్యంబు లొనర్చి రప్సరసలున్ దేవుల్ దివిన్ జూడఁగన్.

సీ. ఆజలక్రీడకు నీజలక్రీడకు
నంతరం బున్నదే యనెడివారు
ఆరాసకక్రీడ కీరాసకక్రీడ
కేమి యంతర మంచు నెంచువారు
ఆవేణుగానాన కీవేణుగానాన
కగును బూర్ణోపమ యనెడివారు
ఆగాయనులకు నేఁ డీగాయనులకు నే
మంత భేదం బున్న దనెడివారు

తే. అపుడు శ్రీకృష్ణుఁడై పుట్టినట్టి హరియె
యిప్పు డీఱేఁడుగాఁ బుట్టెనేమొ ? లేక
యున్న నిది గాంచు మనమనయుల్లములకు
నబ్బునే మోద ? మనువారు నైరి సురలు.    ౧౪౦

సీ. అట్లు తన్మయావస్థ నంది యానృపుఁడు శ్రీ
కృష్ణదేవుని శుచిక్రీడ లెల్ల

వారితోఁ గూడి యప్పర్వతమ్మున నాడి
సరగ "యాంతేమతి స్సా గతి" యను
గీత నిక్కమ్ముగాఁ గించిదామయపీడ
యును లేక భగవంతుమనికి కేగె
నాతఁడు జేఁడె కాఁ 'డానంద'వాచ్యమౌ
వాస్తవార్థ మెఱుంగుపండితుండు

గీ. భోగి యోగియు నంట కొప్పుదురు వేద
వేత్త లితరులమాట లిం దెత్తనేల ?
మనము చూచినయోగి దమ్మాద్రియోగ
మేమొ ? 'యిద మిద్ధ' మని నిర్ణయింపలేము. ౧౪౩

క. పయికిఁబరిశుద్ధులుగ నుం,డియుఁ గలుషాత్మకులు గల రనేకులు పయికి
న్జెయువు లోకభంగిగానుం,డియు లోకోత్తరులుగల రనేకులుఁగతిన్.

గీ. ఇట్టు లావృద్ధరాజర్షి యెలమి నల్ల
వైశ్యయోగిచరిత్రమ్ము పాపవర్త
నంబు గాదని చెప్ప విన్న యలముగురు
నౌను గావచ్చు నని సంశయంబు విడిరి. ౧౪౪

చ. అలఘుమనీషులౌ జనుల కంతట మంచియె తోఁచుచుండు విం
క లఘుమనీషులో? చెడుగుగానె సమస్తము గాంతు, రెల్లచోఁ
గలుగదు మంచి, చెడ్డయును గల్గదు రెండును మిశ్రభావమున్
గలిగి చరించు సంకరముగా, సహజం బిది యెంచుఁ జూచినన్.

క. ఏయంకము లేకుండఁగ,నే యెల్లప్పుడును దేవు నెద నిల్పెడివా [మా
రీయుగమున మృగ్యులు నా,రాయణు నెటులేనిఁ దలఁప నది యఘహర

క. నారాయణపదభక్తియు, నారాయణసేవకార్చనమ్మును శ్రీమ [గున్
న్నారాయణుఁ జెత్తిన యావ,తారగమ్ముల యొఱఁగయు నఘహారకము ?

ఉ. కోమటి వాఁడు విప్రముని కోమలి వారవధూసుతల్లియున్
నేమముమై రమేశ్వరుని నిత్యము భక్తిమెయిన్ భజించుచున్
క్షేమముగా నిటుల్ సకల జీవితమున్ గడపం దలంచి యా
భూమిధరమ్ము వాసముగఁ బొల్పుగ నుండిరి స్వస్థచిత్తులై. ౧౪౯

క. సూతుం డీగతి నొడివినఁ, బ్రీతహృదయు లగుచు మునివరేణ్యు లతనివి
ద్యాతిశయమునకు మెచ్చి య, నేతాదృశమైన పేర్మి నిట్లని రపలన్.

వ. రాజఋషి చెప్పినరాజయోగిచరిత్రంబువలనఁ బంచమహాపాతకంబులలో
నగ్రగణ్యంబగు సురాపానంబుగూడ భగవత్కథాశ్రవణమననాదులవల
న నివర్తించుటయ కాక యట్టిపాపాత్ములుగూడఁ దుట్టతుదకు ముక్తు
లగుదు రని స్పష్ట మగుచున్నది. దీని నెట్లు విశ్వసింతుము నావుడు
సూతుం డిట్లను. ౧౫౦

గీ. జ్ఞాన మనునగ్నిహోత్రంబు సకలకర్మ
ములను భస్మం బొనర్చెడి మునివరేణ్యు
లీరు గీతార్థ మెఱుఁగనివారు కారు
గీత యుపనిషత్సార మోజ్ఞాతలార. ౧౫౧

గీ. ఉత్తమజ్ఞాన మొక్కటి యుద్భవింప
వలయునే కాని యయ్యది కలిగెనేని
వాని కిఁక దేనితోఁగాని పనియె లేదు
పార్థుఁ డొనరించె జ్ఞానియై భండనంబు. ౧౫౨

క. భండనముకన్నఁ బాతక, మొండుండునె? యెన్ని ప్రాణులో యటఁ జనకో
దండమ్మున కెరయౌఁ బా, ర్థుం డొందెనె? యోద్ధయగుచు దోషమ్మంచున్.

గీ. ఇతరయోగులపోకడ లెన్ననేల?
కృష్ణభగవానుకన్న నుత్కృష్టులైన
యోగు లెందేని గలరె? యచ్యుతునిగూడ
విశ్వసింపనిపాపిష్ఠు లీపృథ్విఁ గలరె? ౧౫౩

గీ. "కృష్ణుఁ డస్ఖలితుం" డనియెడి వివేక
లెందఱో గల "రిది సత్యమే" యటంచు
భాగవతమును శ్రద్ధగాఁ బఠనసేయు
విజ్ఞులకుఁ బొడకట్టెడి విశదముగను. ౧౫౬

క. అగుచో నాతఁడు ప్రద్యుమ్నుఁ గనుటెకా కితరులైన పుత్రులఁ గనుటె
ట్లు గుదురు!యోగులచరితము, లగమ్యగోచరము లందు రక్కటతముననే.

గీ. కృష్ణుఁ "డవతారపురుషుఁ" డం చెఱిఁగికూడ
బ్రహ్మ గోవత్సముల దాఁచి పరిభవంబు
నొందు టెట్టిది? దేవేంద్రుఁ డురక రాల
వాన గురిపించి సగుఁబాటు పూననేల. ౧౫౭

క. నారదుఁ డలకృష్ణునిశ్శృం, గారరసపు వర్తనమును గన నెంచి వృథా
గా రాత్రి సర్వ మాతని, నీరజనేత్రలగృహములు నెమకఁగ నేలా ?

క. తలచినకొలంది శంకా, పరంపరలు బయలువెడలుఁ బరమాత్మకథల్
దురితహారము లనుకొను ధీ, వరులకు సద్గతి లభించు వాస్తవ మింతే.

క. పలువురు కృష్ణున్ భక్తిం, గొలిచి తరించి రిఁకముందుఁ గొల్తురుధీమం
తులు లీలాశుకజయదే, వులు నారాయణయతియును బూర్ణజ్ఞానుల్.

గీ. ఎంత వేదాంతమునకు శ్రీకృష్ణుచరిత
మును సమన్వయపఱచిన ఘనుఁడతండు
"యోగి" యని "భోగి" యనికూడ నొప్పుకొనక
తీరదని తోఁచు నన మునిధీరు లనిరి. ౧౬౧

గీ. ఎట్టి విజ్ఞానులకు "నిద మిద్ధ" మనుచుఁ
బలుక శక్యము గాని దప్పురముచరిత
మతఁడు జారుఁడొ ? చోరుఁడో ? యగుసుగార
ణ్యాత్మనిచరిత మహోన్నతం బనుట ధ్రువము. ౧౬౨

క. ప్రతివనితయు నమ్మహితుని, బతిగా వరియించు హావభావము లట సం
గతము లగుకతన నతనికి, "నతిజారుం" డనుకళంక మది ఘటియించెన్

ఉ. ఎప్పుడుగాని కృష్ణుఁ డొకయింతిని దా నయి కోరినట్టుగాఁ
జెప్పెడివారు లేరు పలుచేడియ లాతనిఁ జూచి నేమముల్
దప్పి చరించినట్టులె బుధప్రవరు ల్లిఖియించి రందుచే
నప్పురుషోత్తమోత్తమున కంట దఘం బనుకొంట యుక్తమా. ౧౬౫

మ. ఎవ రేరీతి ననున్ భజించెదరొ ? తాదృగ్రీతినే నేను వా
రి విలోకించి "తరింపఁ జేతు" ననుచున్ గృష్ణుండు వాక్రుచ్చె గో
పవధూటుల్ పతిభావనన్ దను మదిన్ బ్రార్థించుటంజేసి మా
ధవుఁ డవ్వారల కట్లె తోఁచి భవమున్ దాఁటించె వేయేటికిన్. ౧౬౬

క. జారత్వము ఘోరంబగు, నేరంబే యయ్యు నదియు నిఖిలేశ్వరుపైఁ
గూరిమికిఁ గారణంబై, తారకమంత్రమ్ముకరణి ధన్యత గూర్చెన్.

మ. భగవంతుం డని కృష్ణు నొప్పికొను నేభక్తుండు దచ్చర్య దా
"విగుణం" బంచు వచింపఁ డన్యులనుడుల్ విశ్వాస్యముల్ గావు పు
ణ్యగరిష్ఠం బది కావయేని శుకుఁ డానందార్ద్రకుం గూర్చి చె
ప్పఁగనేలా ? యభిమన్యుపుత్రున కటుల్ ప్రాయోపవేశమ్మునన్.

వ. ఇవ్విధమ్మున సూతునివచనమ్ములను శౌనకాదు లభినందించి గౌరవించి
యాతఁడును దామును నిరంతరము భగవద్గోష్ఠితోఁ గాలక్షేపమ్మొనర్చు
చు సుఖంబుండిరి, ౧౬౯

శ్లో. సంసారే కిం సారం, కంసారే శ్చరణకమల పరిభజనమ్
జ్యోతిః కి మంధకారే, య దంధకారే రనుస్మరణమ్.

( కృష్ణకర్ణామృతము)

శ్రీ శ్రీ శ్రీ

## కృతిప్రదానము.

ఉ. ఊరక సర్వదా శయన మూని గృహమ్మున నుండు నాకు వ్యా
పారము కావ్యనిర్మితియె, బాగుగ నుండిన నుండకున్న నే
నో రచియించుచుందు, నిది యొక్కటి యారచనంబునందు శ్రీ
వారిజనాభభక్తుఁ డొకబ్రాహ్మణుఁ డిద్ది వినెం బిఠాపురిన్. ౧

ఉ. పెద్దకొమార్తెఁ జూచుటకుఁ బీఠపురంబున కేగి యచ్చటం
బద్దయుఁ బేర్మి నుండ నొకనాఁ డితఁ డీనసుఁ జూడ వచ్చి తా
నిద్ది వినెన్ గృతీశ్వరత కిచ్చ గనంబఱచెన్ ''దథా'' స్తటం
చిద్ది యొసంగితిన్ గవియుఁ గృష్ణునిభక్తుఁడునైన జ్ఞానికిన్. ౨

గీ. ఇతఁడుమాత్రమె కని గాఁడ యితనితాత
గూడ నుభయభాషలఁ గడు గొప్పనుకవి
అంతియేకాదు రామదాసంతభక్తుఁ
డాఖ్యచేత జగన్నాథుఁ డతఁడు నితఁడు. ౩

క. ఇతనిజగన్నాథత్వము, కృతార్థ మెట్లన్న నెన్నియేఁడులో భూమీ
పతికిం బ్రతినిధియై యధి,కృతియుం దీతఁడు రహించి యిపు డది విడి(చెన్.

క. ఉపకారవేతనము మా
నపువరుస న్నాఱు ఞేఁ డొసంగ సుఖముగా
నెపుడుం గృష్ణు యజింపుచు
సుపుణ్యుఁ డీతండు పెంచు సుకృతము మిగులన్ ౫

తే. షష్టిపూర్తికి నైదుమాసములలోపు
వయసునం దుండియును దేహబలము గలిగి
దీక్షతోఁ బుండరీకాక్షు దినదినంబుఁ
బూజ సేయక నీరేని ముట్టఁ డితఁడు. ౬

క. ఇరువురు భార్య లొకొక్క కొ
మరుమాత్ర మొసంగి చనిరి, మాధవుకృపఁ దా

మరతంపరగాఁ గుల ము
ద్ధరింపఁ బడుఁగాక । కోటితరములదాఁకన్.

మ. ఘనుఁ డుద్యోగి యశస్వి పాత్రుఁడు రమాకాంతాంఘ్రినీరేజవం
దననిర్ధూత సమస్తకల్మషుఁడు సత్కావ్యప్రణేత్రర్చకుం
డనుకూలంబుగఁ గైత సెప్పఁగలవాఁ డన్యాంగనన్ దల్లిగన్
గనువాఁ డుత్తముఁ డూర్జితాత్ముఁడు జగన్నాథుండు ధన్యుం డిలన్.

చ. ధన మధికంబుగాఁ గలదు ధారుణినాథుల కల్లవారిలోఁ,
గనుపడు నెక్కడో యొకటఁ గావ్యరసగ్రహణంబు, వారి కి
చ్చినకృతికన్నఁ దాఁ గవిత సెప్పఁగ నేరుచు మేటిగేస్తు కి
చ్చినకృతికన్య ధన్య యని చెప్పుట కొప్పని విజ్ఞు లుందురే. ౧౦

క. మానుగ మాధవుపై లక్ష్మీనారాయణునిమీఁదఁ జెటియొకశతకం
బీనియమస్థుఁ డొనర్చె న,నూనంబగు భక్తిగరిమ ముప్పొంగంగన్.

శా. 'భక్తత్రాణపరాయ'ణాంకితము కబ్బం బొండు గల్పించె ని
ర్ముక్తాఘుండు పితామహుం, డితఁడు తత్పుస్తంబు తెల్గించె సు
వ్యక్తంబౌగతిఁ దాతగారి కవితాపాండిత్యమే కాదు త
ద్భక్తిస్ఫూర్తియు నంటె నీతనికి, నీభాగ్యంబు సామాన్యమే. ౧౨

మ. ధనమున్ ధాన్యము నిల్లు వాకిలి జమీందారీ మొదల్ వంశవ
ర్ధను లెల్లం గొను టున్నదే సుతులు, సత్కావ్యప్రణేతృత్వమున్
ఘనదాతృత్వము దైవభక్తి మొదలౌ కాణాచియున్ గూడ ద
క్కినటుల్ విన్నది లేదువో । తఱుచు, దక్కెన్నేఁటి కీమేటికిన్. ౧౩

సీ. నాతాత సుకవియై నాఁటె బీజమ్ము మా
కొలములో నని చెప్పికొనెడివారు
నాదుముత్తాత విద్యాదక్షుఁ డతని ము
న్మనుమఁడ నని చెప్పికొనెడివారు

పెదతాత దాతయై విజ్ఞులఁ బోషించె
నని గర్వమునఁ జెప్పికొనెడివారు
నాతండ్రిగారి విన్నాణమ్మునకుఁ బ్రతి
గన రెవ్వ రని చెప్పికొనెడివారు

గీ. కలుగుగాని తత్తద్గుణగణము దాయ
భాగముగఁ బంచుకొని మెచ్చు పడయువారు
చాల మృగ్యు, లీభాగ్యము సంక్రమించె
మనజగన్నాధరాయని కనఘుఁ డితఁడు. ౧౪

ఉ. ఈతనివంశమున్ గుఱిచి యించుక యొక్కెడ విస్తరింతుఁ బ్ర
ఖ్యాతుఁడు లోహితర్షి మునిగణ్యుఁడు, తన్మునివంశమందు వి
ద్యోతితుఁ డుద్భవించెఁ గడు యోగ్యుఁడు తిమ్మయ, యయ్యశస్వసం
జాతుఁడు రామయాహ్వయుఁడు సత్త్వగుణాఢ్యుఁ డుదారుఁ డెమ్మెయిన్

వ. ఈరామయామాత్యునకు వేంకటరావు నరసింహరావు తిరుమలరావు నను
ముగురు కొమరులు. వారిలో ౧౬

క. నరసింహరాయఁ డచ్చమ.నరసీరుహనేత్ర తనకు జాయగ సుతులన్
వరగుణుల నోలిఁ గనె నేఁ,గురఁ జిరతరయశుల,నైదుగురు హరిభక్తుల్

వ. బాయన్న రామస్వామి పద్మరాజు జగన్నాధరాయఁడు చెల్లయ్య అను
నీసోదరపంచకమ్ములో ౧౮

గీ. నాలుగవవాఁడు శ్రీజగన్నాధరావు
కవియు భక్తుండుఁ బ్రకృత మీగ్రంథము కృతిఁ
గొనినసమేటికిఁ దాత యీఘనునిఁగూర్చి
యాదినే వచియించితి నలఘుఁ డితఁడు. ౧౯

క. ఇతఁ డుద్యోగము లొల్లక
ప్రతిదిన మచ్యుతునికొలువు వ్రతముగఁ దనకై

వితమున్ గడపిన ధన్యుం
డితనికిఁ బ్రతి రామదాసుఁడే హరిభక్తిన్. ౨౦

*గీ. ఇతఁడు తనభార మెల్ల శ్రీపతిపదాబ్జ
సంగత మొనర్చినట్టి నిస్సంగుఁ డీవి
షయము నీమహనీయుని సత్కవిత్వ
మును జదివి నే గ్రహించితి ముక్తుఁ డితఁడు. ౨౧

గీ. భరసమర్పకుఁ డైనయీపరమభక్తు
ఛాందసవుఁజర్య లిచ్చు నానంద మట్టి
వారలకు, నేఁటినాగరవర్తనులకు
వెట్టిగాఁ దోఁచునని యిందు విడిచినాఁడ. ౨౨

గీ. కావ్యనాటకాలంకృతి కళలు శిష్యు
లకు ననుదినంబు చెప్పు నీసుకవివరుఁడు
రాము నెల్లప్డు స్మరియించు నేమముగ ని
తండు ధన్యుండు గాక యేతండు జగతి. ౨౩

క. లచ్చమ యను వనితామణి
సచ్చరిత నితండు గొనియె జాయగఁ, గడు ను
ద్యచ్చరితుల నేఁగుర నే
మచ్చయు లే కలరు నట్టిమాన్యులఁ గనియెన్. ౨౪

వ. వెంకన్నపంతులు, నరసింహులు, నారాయణమూర్తి, సోమసుందర వేం
కట రామదాసు (ఈయన పరమభక్తుఁడును సుకవియు నై యక్షగాన
ములు రచించెను.) శేషయ్య అను నీసోదరపంచకమ్మున జ్యేష్ఠుండు
వెంకన్నపంతులు బాల్యం బేగినదే మొదలు శ్రీగౌణే నారాయణగజపతి
రాయని యనుంగుమంత్రియై బహుజనపోషకుండై సిరిసంపదలతో నె
క్కుడుగఁ దులఁదూఁగె, నియ్యనఘునకు నొకరి వెంబడి వేఱొకరుగా

* భక్తతారిణపరాయణశతకము నీతఁడు రచించెను.

ముగ్గురు భార్యలు వారిపోఁ గడఁగొట్టువస్థాంగి వేంక టేశాంబికమా
త్రమే వంశాభివృద్ధికారకురాలు. ప్రకృతకృతిభర్తయైన శ్రీలక్ష్మీజగన్నా
థరా వాపెకొమరులు నల్వురలో ద్వితీయుఁడయ్యు నద్వితీయగుణగణ
సంపన్నుం డనఁదగువాఁడు. ఈయనయన్న వేంకట వేణుగోపాలరావు.
తమ్ములు వేంకట రమణారావు, తిరుమలరావు నమువారలు. ౨౫

క. కృతినాయకుండు తాతకుఁ
బ్రతి యని చెప్పఁదగు పరమభక్తుం డీతం
డు తరించె యాత్రి తొనరిచి:
పితరులఁ దరియింపఁజేసె విహితక్రియలన్. ౨౬

గీ. "ఏగె బ్రహ్మకపాలంబు నీతఁ" డనినఁ
దక్కు యాత్రల కేగుట తడవనేల?
అసకృదావృత్తిగాఁ జేసినట్టియవియుఁ
గలవు గొన్నియాత్రలు, కడు నలఘుఁ డితఁడు. ౨౭

ఉ. ఈమహితుండు పీఠపురి నిష్టు వసించుచుఁ గుంతిమాధవ
స్వామునిదేవళమ్ము నెడ స్థాపనఁ జేసెను లక్ష్మి: నాత్మన
న్నామములోని లక్ష్మికలనం బది సార్థకమై యెలర్పఁ, బై
నామెకు దేవళం బితఁడె యూస్థమెయిన్ వెలయించె సొంపుగన్. ౨౮

గీ. భాష్యకారార్యుఁ డీయనభక్తి మెచ్చి
యిట్టికృతికిఁ బ్రేరేచె నీదట్లుఁ 'ద్వైతి
ధన్యుఁడ' నటంచుఁ దనదువదాన్యత కొక
గుఱుతుగా నొనరించె నీగొప్పపనిని. ౨౯

క. లింగికులమయ్యు వైష్ణవు
లం గలసెం బూర్వమెపుడొ లపముసు శివుపై
నిం గినియఁడు పూజించు న
నంగరిపు నితండు దీని కక్కజపడుదున్. ౩౦

క. లోహితసగోత్రభవున క, సీహంనకున్ గురున కొక్కఁ డిచ్చితిఁ గృతి నేఁ
దీహితునకుఁ గృతి నిచ్చితి, లోహితగోత్రుం డితండు లోకనుతుండున్,

క. ఉదయాస్తమయంబులఁ గో, విదగణ్యుం డితఁ డొనర్చు విష్ణ్వర్చన మ
భ్యుదయార్థమొ? ముక్త్యర్థమొ? కుదిరిన దీయనకు నీసుగుణ మలవాటై.

క శేషావతార మీసుమ, నీషి మొదటిభార్య, యీపె కిరువురు కొమరుల్
శేషించె నం దొకం, డే, దోషమొ? జ్యేష్ఠుండు పోయె దుఃఖప్రదుఁడై.

క. వెంకన్నపంతు లతఁ డా, వెంకనయనుజుండు వైద్యవిద్యాఘనుఁడై
శంకరుఁడై పల్వుర, కక, లంకుఁ డనంతుండు రామరా వలరాయన్.

ఆ సుందరమ్మ యనెడి సుందరి యీతని
భార్య, యితనికి సదపత్యవృద్ధి
గలదు కొడుకు లిర్వు రలఘులు, కూఁతులు
నిద్ద ఱిట్లె వంశ మెదుగుఁగాక. ౩౫.

గీ. అలజగన్నాధరావు రెండవ చెలంది
యనఘ వేంకటరమణాంబ ఆపెకొమరు
నాఖ్య వేంకటరంగతోతాద్రిదాసు
బాలుఁ డీతండు హరికృపఁ బ్రబలుఁగాక. ౩౬.

ఆ. ఇట్టిసత్కుటుంబి యీలక్ష్మి శ్రీజగ
న్నాధరావు దక్షిణమున నుత్త
రమున నున్న తీర్థరాజమ్ములెల్ల సే
వించి దేవతల భజించె భక్తి. ౩౭

వ ఏవంవిధ పుణ్యగుణగణ గరిష్ఠుండును నిరంతర నారాయణ పాదపద్మ
సమారాధనాసక్త చిత్తుండును శ్రీవైష్ణవకుల శిరోభూషణుండును దేవ
బ్రాహ్మణభక్తి తత్పరుండును నిరాడంబరుండును నిర్లిప్తుండును గవితా
రససర్వస్వవేదియు సతతామోదియు నగు శ్రీలక్ష్మీజగన్నాధరాయనికి
నభ్యుదయపరంపరాభివృద్ధి యగుటకై యీసుశీల నంకితం బిచ్చుచు
నాశీర్వదించుచున్నాఁడను. ౩౮

